అపరాధ పరిశోధన అనుబంధం—125

# నాలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## హంతకుల ఒప్పందం

రచన: ఎమ్. వి. వి. సత్యనారాయణ

## తళతళ మెరిసే కత్తి

రచన: ప్రతాప రవిశంకర్

## ప్రాణమిత్రులు

రచన: టెంపోరావ్

## అల్లుడొస్తున్నాడు జాగ్రత్త

రచన: చంద్రశేఖర అజాద్

కళ్యాణ దుర్గం - ఆరవ భాగం

అపరాధ పరిశోధన సప్లిమెంట్—125
మే, 1984
వెల: రు. 5-50
ఏడాది చందా: 66 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
టెంపోరావ్
శ్యాంబాబు
ఎ. వి. మోహన్రావ్
బొమ్మిడి అచ్చారావు
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.




# హంతకుల ఒప్పందం

## ఎమ్. వి. వి. సత్యనారాయణ

ప్రతాపరావు గోడవైపు చూస్తున్నాడు. ట్యూబ్ లైట్ వెలుతురు గదిలో ఆహ్లాదంగా పరుచుకొని వుంది.

గోడమీద బల్లి కదులుతోంది. అది అచ్చగా ఎర వైపు కదిలే పులిలాగా వుంది. బల్లికి రెండడుగుల దూరంలో కీటకం వాలివుంది.

బల్లి వొడుపుగా పాదాలు కదుపుతోంది. ఈసారి ప్రతాపరావుకు కీటకం కనిపించడంలేదు. కీటకం స్థానంలో సుందరరామయ్య కనిపిస్తున్నాడు.

సుందరరామయ్య అతడికి పిల్లనిచ్చిన మామగారు. మధులత ఆయనకు ఒక్కతే కూతురు. సుందరరామయ్య పరమఛాందసుడు. తాను బతికి వుండగా కూతురికి ఆస్తి ఇస్తే అరిష్టం అని ఎవడో సిద్ధాంతి చెప్పాడు. సుందరరామయ్యకు అతడి మాటే మెదడులో నాటుకుపోయింది.

అదిగో, అదే నచ్చలేదు ప్రతాపరావుకు. ఇవ్వవలసిన ఆస్తి ఏదో యిచ్చేస్తే తాను, ఏదయినా బిజినెస్సులో

ష్టేర్లు కొంటాడు. కాని మామగారు తనకు ఆ అవకాశం యివ్వడంలేదు. అంతేకాదు — ఈ మధ్య కాలంలో సుందరరామయ్యా, అల్లుడికి తెలియకుండా కూతురితో మంతనాలాడుతున్నాడు. ఆమె పేర రహస్యంగా వుత్తరాలు రాస్తున్నాడు.

అలాంటి వుత్తరం ఒకటి ప్రతాపరావుకు దొరికింది. ప్రతాపరావుకు అందులో అక్షరం అక్షరం గుర్తు వుంది.

"ప్రియమైన లతా!

నాకు ఒంటరితనం భరించరానిదిగా వుంది. వేళకు పనిమనిషి వండిపెడుతుంది. కాని జీవితానికి తిండి ఒక్కటే చాలదు. స్వరాజ్యం అని మన ఇంటి ఎదురుగా ఒక టీచరు దిగింది. ఆమె కూడా యిష్టపడింది. ఆమె బాల వితంతువు. యిప్పుడు ముప్ఫయి సంవత్సరా లుంటాయి.

అంతమాత్రాన నీకు ఏ లోటూ రానివ్వను.

—నీ తండ్రి."

మధులత తనమాట తో సెయ్యదని సుందరరామయ్యకు బాగా తెలుసు. సుందరరామయ్య బాలవితంతువును పెళ్ళి చేసుకొని ఆస్తి మొత్తం ఆమెకు కట్టపెడతాడు. మధులతకు తండ్రి మాటలలో మోసం చెప్పినా అర్థంకాదు. అందుకే ప్రతాపరావు తన భార్యను ఒక కంట కనిపెడుతున్నాడు. పోస్టుమాన్ కి చెప్పి వుంచాడు.

ఈ రోజు ఉదయం మధులతకు ఒక ఉత్తరం వచ్చింది. ప్రతాపరావు ఆమెకు తెలియకుండా ఈ ఉత్తరం చదవాలని ప్రయత్నించాడు. అసలు ఆ ఉత్తరమే అతడి కంట పడలేదు.

ప్రతాపరావు గోడమీదకు చూశాడు.

## 5

కీటకాన్ని సమీపిస్తోంది బల్లి. నాలుకను గాల్లో ఆడించింది. దూకడానికి సిద్ధమైన పులిలాగా ముందు కాళ్ళలో శక్తిని కేంద్రీకరించుకొంది.

"ఏమండీ! భో జ నా ని కి వస్తారా?" మధులత వంటింట్లోంచి పిలిచింది.

ప్రతాపరావు పట్టించుకోలేదు. ఊపిరి బిగబెట్టి చూస్తున్నాడు. బల్లి సునాయాసంగా ఉరికింది. నాలుక కీటకాన్ని తాకింది. క్షణంలో తక్కువ భాగంలో కీటకం రెక్కలు కదిపింది. నాలుకతో బాటు బల్లి నోట్లోకి వెళ్ళిపోయింది.

మధులత మరల పిలిచింది.

ప్రతాపరావు లేచి వంటింటివైపు కదిలాడు. భోజనం అయిందనిపించి బెడ్ మీద వాలాడు.

కొంతసేపటికి మధులత వచ్చింది.

డిమ్మర్ వేసి లైటు తీసేసింది. ప్రతాపరావు పక్కనే పండుకొని అతడిమీద చెయ్యివేసింది. ప్రతాపరావు ఆమెవైపు ఒత్తిగిల్లాడు. ఆమెను దగ్గరకు అదుముకున్నాడు. కనుకొలకుల్లోంచి గోడవైపు చూశాడు.

గోడమీద ఇప్పుడు రెండు బల్లులు పాకుతున్నాయి.

"ఏమిటటు చూస్తారు?" అంది మధులత, అతడి పెదిమ లందుకుంటూ.

'గోవిందును' మనసులో గొణుక్కున్నాడు ప్రతాపరావు.

## 2

ప్రతాపరావు అటు తిరిగి పడుకొన్నాడు. అరగంట గడిచాక మధులత కదిపింది.

ప్రతాపరావు కదలలేదు. ఆమె మెల్లగా బెడ్ దిగి

గదిలోంచి బయటపడింది. వీధి గుమ్మం తలుపు తెరచింది. స్విచ్ నొక్కి లైటు వేసింది.

భారీ విగ్రహం ఇంట్లోకి అడుగు పెట్టింది. అతడి వెనుక చీర గరగరలాడింది.

"అల్లుడు నిద్రపోయాడా?" అడిగాడతడు.

"వూఁ!" మధులత డ్రాయింగ్ రూంలోకి దారి తీసింది. అతడు సోఫాలో కూలబడ్డాడు. అతడి వెనుక నే వచ్చిన స్వరాజ్యం నిలబడే వుంది.

"నాన్నగారూ! యేమిటి యింత అర్జంటుగా వచ్చారు?" అంది మధులత.

"స్వరాజ్యం! కూర్చో" అని సుందరరామయ్య కొంతసేపు నిశ్శబ్దంగా వూరుకొన్నాడు.

స్వరాజ్యం సోఫాకి ఒక చివర కూర్చుంది.

"లతా! తొందరపడ్డాను. స్వరాజ్యాన్ని అర్జెంట్‌గా పెళ్ళిచేసుకోవాలి" అన్నాడు సుందరరామయ్య.

"ఏం?"

"వాళ్ళ వాళ్ళు యీ మధ్య మన యింటిమీదకు వచ్చారు. పెద్ద గొడవ కూడా అయింది."

"ఏమయింది నాన్నగారూ?"

సుందరరామయ్య తల వొంచుకున్నాడు. స్వరాజ్యం సరేసరి.

మధులతకు విషయం అర్థమయింది. తండ్రిమీద అసహ్యం కలిగింది. అదీ తాత్కాలికంగానే. తండ్రి మాత్రం ఏం చేస్తాడు? ఆమె కూడా తొందరపడిపోయింది కదా.

"ఎంత పని జరిగింది నాన్నగారూ?"

"ఇలా అవుతుందనుకోలేదమ్మా!"

"పెళ్ళి చేసుకోండి నాన్నా! మీ మాట యెప్పుడు కాదన్నాను?"

"స్వరాజ్యం తండ్రి విల్లు మార్చాలని గొడవ పెట్టాడు."

"విల్లా?"

"నా అనంతరం నిన్నే ఆస్తికి సర్వాధికారిణి చేస్తూ విల్లు రాయించి రిజిస్ట్రేషన్ చేయించాను. ఆ విల్లు మార్చి స్వరాజ్యం పేర సగం ఆస్తి రాయించాలని స్వరాజ్యం తండ్రి బలవంత పెట్టాడు."

మధులత నిశ్శబ్దంగా వుండిపోయింది. ఆస్తిమీదనే ప్రతాపరావు ఆశలు పెట్టుకొని వున్నాడు. ఇప్పుడు స్వరాజ్యం అడ్డం తగులుతోంది.

"అమ్మా, నీకు అన్యాయం చేస్తున్నాను కదా!"

"నాన్నగారూ! మీ అల్లుడితో మాట్లాడదాం!"

"నాకు మొహం చెల్లదమ్మా!"

"తొందరపడిపోయారు నాన్నగారూ!" స్వరాజ్యాన్ని చూచింది మధులత. స్వరాజ్యం మూగగా వింటూంది.

"సగం ఆస్తి అయినా నీకు పదిహేను లక్షల పైచిలుకే వస్తుందమ్మా!" అన్నాడు సుందరరామయ్య.

కిటికీ రెక్క కొద్దిగా కదిలింది. మధులత చటుక్కున తలత్రిప్పింది. ఎవరూ లేరక్కడ.

"అల్లుడు లేచాడేమో?" అన్నాడు సుందరరామయ్య.

మధులత మెల్లగా కదిలింది. బెడ్‌రూంవైపు అడుగులు వేసింది. ప్రతాపరావు బెడ్‌మీద ఆదమరచి నిద్రపోతున్నాడు. మధులత నిట్టూర్చి వెనక్కు తిరిగింది.

ప్రతాపరావు ఓరకంట ఆమెను చూశాడు.

ఆమె తండ్రిని సమీపించింది. "ఎక్కడ దిగారు

నాన్నగారూ?" అంది.

"నాగార్జున లాడ్జి. రూం నెంబర్ 10."

"రేపు ఉదయం వస్తాను. ఆయన బిజినెస్ పనిమీద వెళ్లారు."

సుందరరామయ్య తలూపాడు. స్వరాజ్యం లేచింది. తండ్రినీ, స్వరాజ్యాన్నీ పంపివచ్చి బెడ్ మీద వాలింది. లేచి కిటికీలోని గ్లాసుతీసింది. గ్లాసులో నీళ్ళున్నాయి. మాత్ర తప్పించి నీళ్ళు గటగట తాగింది. నీళ్ళు వగరుగా వున్నట్టు తోచాయి.

తల తిరుగుతోంది. బెడ్ వైపు కదలబోయింది. నిస్త్రాణముంచుకు వచ్చింది. అడుగులు తడబడుతున్నాయి.

నేలమీద కుప్ప కూలిపోయింది మధులత. దబ్బున శబ్దమయింది. ప్రతాపరావు చటుక్కున కళ్ళు తెరిచి మంచం దిగాడు. ఆమెవైపు క్రూరంగా చూచి గదిలోంచి బయటపడ్డాడు. గారేజిలోంచి కారు తీశాడు.

# 3

వీధి కుక్కలు యెక్కడో మొరుగుతున్నాయి. క్రమంగా వీధిలోని కుక్కలకు అక్కడెక్కడి కుక్కలో సంకేతాలు పంపినట్టు యివీ మొరుగుతున్నాయి.

సీసా ఎత్తిపట్టి చివరి చుక్క తాగుతున్నాడు గోవిందు. కిరసనాయిలు దీపం వెలుగులో అతడి నీడ భారీగా గోడమీద పడుతోంది. కండలు తిరిగిన శరీరం, కోరమీసాలు, గ్లాస్కో చొక్కా, ఒక చేతికి మల్లెపూలదండా.

సీసా బల్లమీద వుంచి వెనక్కి తిరిగాడు.

రత్తి కోకిల నవ్వి మంచం దిగింది. అతడి వెనుకనుండి మెడచుట్టూ చేతులు వేసింది. గోవిందు ఆమె చేతులు

సున్నితంగా విడిపించుకోబోయాడు.

"ఏం మామా? కోపమా?" అంది రతి.

"అది కాదు రతీ! కుక్కలెందుకు మొరుగుతున్నాయి?"

"వాటికి పనేముంది?"

"ఒక్కసారి వెళ్ళి చూచి వస్తాను!"

"అమ్మో నాకు భయం!"

"ఇక్కడే వుంటాన్లేవే!"

రతి చేతులు సడలించింది. గోవిందు కదిలొంచి బయటపడ్డాడు. బయట చీకటిగా వుంది. దూరంగా కుక్కలింకా మొరుగుతున్నాయి. కుడిప్రక్క వుంది గోవింద నిలయం. పోర్టికోలో దీపం ప్రకాశవంతంగా వెలుగుతోంది. వెలుగుకు అడ్డంగా పొడవుపాటి నీడ!

"ఎవరది?" అరిచాడు గోవిందు. కుక్కలు కూడా భయపడి మొరగడం ఆపేశాయి.

నీడ వెనక్కి తిరిగింది. గోవిందువైపు వచ్చింది.

"ఒరేయ్ గోవిందూ!"

"ఎవరు ప్రతాపరావా? ఇంత చీకట్లో—?"

"వూఁ! నువు అవుట్ హవున్‌లో వున్నావేం?"

"కుటుంబం పుట్టింటికి వెళ్ళిందిరా!" మోటుగా నవ్వాడు గోవిందు.

"నీతో పని పడింది."

"వచ్చాడా మీ మామయ్య?"

"వూఁ!"

"ఎక్కడ దిగాడు? ఇంట్లో అయితే ప్రమాదంకదా!"

"అవును. అనుమానం రాకూడదు. నాగార్జున లాడ్జి నెం. 10."

# 10

"నిన్ను తప్పించి ఎవరినీ అనుమానించరు కదా!"

"వూహూఁ!"

"మరీ మంచిది. నువు చెప్పకపోతే హంతకుడు యెవరయిందీ తెలిసే అవకాశంలేదు."

"అవును."

"ఎప్పుడు చంపాలి?"

"ఈ రాత్రే."

"ఇంత అర్జెంటా?"

"రేపు విల్లు మార్చుతాడు."

"ఆల్ రైట్! నువు ఒప్పుకొన్నావన్న మాట!"

"దేనికి?"

"ఇందిరను చంపడానికి!"

"పాపం! ఎంత అయినా నీ భార్య కదా!"

"సుందరరామయ్య కూడా నీకు మామయ్యే కదా!"

"వాడు ఈ వయస్సులో ఎవతెనో చేసుకుంటాడట. ఆస్తిని రెండు ముక్కలు చేస్తాడట!"

"ఇందిరకూడా అంతే! ఈ ఆస్తి ఆమెది. పైసా తీసుకోవాలంటే దాని అనుమతి కావాలి. పైగా—నాకు విడాకులు ఇస్తానని బెదిరిస్తుంది!"

"ఆమెకు నచ్చచెప్పుకోవచ్చు కదా."

"ఒరేయ్ ప్రతాప్! ఎవడి కష్టాలు వాడివి. నేను నీ పని చేసిపెడతాను. నువు నా భార్యను చంపు. అంతే!"

"చూస్తూ చూస్తూ ఆడదాన్ని యెలా చంపడంరా?"

"ముసలాడిని నేను చంపుతూన్నట్టే!"

"ఆల్ రైట్."

"గుడ్. అడ్రసు మరోసారి చెప్పు."

"రూం నెంబర్ 10, నాగార్జున లాడ్జి, అతడివెంట

స్వరాజ్యం వచ్చింది."

"స్వరాజ్యం కూడా ఆ గదిలోనే వుంటుంది కదా! ఎలా?"

"ఆలోచించు. ఇద్దరినీ చంపుతావా?"

"అతడిని చంపుతాను. ఆమెను ఏం చేయాలో అక్కడే అప్పటికప్పుడు నిర్ణయించుకుంటాను" ఆలోచించుకోసాగాడు గోవిందు.

"గుడ్!"

"మామా!" అవుట్ హావుస్‌లోంచి రత్తి పిలిచింది.

"నువ్వు పడుకో....వస్తున్నాను" అని గోవిందు తిరిగి ఆలోచనలో పడ్డాడు.

"ఘాటైన నిద్రమందు సేవించింది మలఘుత. ఆమెను యిప్పుడు నర్సింగ్ హోంకి తీసుకువెళ్ళాను. తెల్లవారే వరకూ అక్కడే వుంటాను. నాకు ఎలిబీ పటిష్టంగా వుంటుంది. ఈ లోపులో సుందరరామయ్య పని ముగిసి పోవాలి."

"తప్పకుండా."

"జాగ్రత్త. ఎక్కడ బెడిసినా మనకు చాల ప్రమాదం!"

"మనం కాగితాలు రాసుకొంటే మంచిదేమో!"

"నాన్సెన్స్ మనం యిద్దరమూ బాల్య స్నేహితులం. నమ్మకం లేదా?"

"నీ పబ్బం గడిచిపోతుంది. ముప్ఫయి లక్షలకు అధికారివవుతావు. నా పని ముగించడం అప్పుడు నీకు నిర్లక్ష్యంగా తోచవచ్చును."

"మాటంటే మాటే! మనం ఒకరిని ఒకరం నమ్మకోవాలి."

"ప్రతాపరావ్! కేవలం నమ్మకాలమీద నే ప్రపంచం నడవడంలేదు. భయం కూడా వుండాలి!"

"కావచ్చును."

"అందుకే మనం యిద్దరం కలసి ఫోటో దిగాలి. నువు యే మాత్రం మాట తప్పినా మీ మామయ్య హత్య సందర్భంలో మనం యిద్దరం దొరికిపోవాలి. ఇందిరను నువు చంపాక ఫోటోను నెగెటివ్‌నూ అగ్రిమెంట్‌ను కాల్చిపారేద్దాం!"

"ఇప్పటికిప్పుడు ఫోటో ఎలా వస్తుంది?"

"నా దగ్గర సెల్ఫ్ కెమెరా వుంది. ఇంట్లోకి పద!"

"తప్పదంట్రా?"

"తప్పదురా?"

"కారు రోడ్డుమీదే వుండనియ్యి. ఏమీ ప్రమాదం లేదు."

# 4

నాగార్జున లాడ్జిలోకి అతడు ప్రవేశించాడు. భారీ విగ్రహం. ముసలితనం కావడంవలన కొద్దిగా వంగి నడుస్తున్నాడు. గుబురు మీసాలు తెల్లబడి మొహానికి వింత గాంభీర్యం యిస్తున్నాయి.

కౌంటర్‌లో వున్న వ్యక్తి కునికిపాట్లు పడుతున్నాడు. రూం సర్వీస్ బాయ్స్ తమ గదిలో నిద్రపోతున్నారు. హాలులోని గడియారం పన్నెండు గంటలు కొట్టింది.

ఆగంతకుడు పదో నెంబర్ గదిముందు ఆగాడు. మెల్లగా తలుపు తట్టాడు. లోపల యెవరో కదిలారు. నిమిషం తర్వాత తలుపు తెరచుకుంది.

"ఎవరు కావాలి?" అన్నాడు సుందరరామయ్య.

సుందరరామయ్య భుజాలమీదనుండి లోపలవ

చూశాడు ఆగంతకుడు. మంచంమీద రబ్బర్ బొమ్మ లాగా నిద్రపోతోంది స్వరాజ్యం.

"నన్ను మధులతగారు పంపించారు."

"అమ్మాయా? ఏం?"

"అల్లుడుగారు ఆమెను బాధ పెడుతున్నాడు."

సుందరరామయ్య తలుపు దగ్గరకువేసి బయలుదేరాడు. ఇద్దరూ లాడ్జి దాటి రోడ్డుమీద నడుస్తున్నారు.

"నీ పేరేమిటి?" అడిగాడు సుందరరామయ్య.

"గోవిందు."

"అమ్మాయిని కొడుతున్నాడా ప్రతాపరావు!"

గోవిందు చుట్టూ చూస్తున్నాడు. రోడ్డు నిర్మానుష్యంగా వుంది.

"ఈ ప్రక్క సందులో ఆటో లుంటాయి!" అన్నాడు గోవిందు తన ధోరణిలో. ఇద్దరూ సందులోకి తిరిగారు. సందు చీకటిగా వుంది. రోడ్డుమీద పడే వెలుతురు లీలగా మాత్రమే ప్రతిఫలిస్తోంది.

సుందరరామయ్యకు యేదో తెలియని భయంగా వుంది. గోవిందు ముందు నడుస్తున్నవాడల్లా అక్కడే ఆగి, "త్వరగా రండి" అన్నాడు.

సుందరరామయ్య చురుకుగా ముందుకు కదిలాడు. వూహించని మెరుపు వేగంతో సుందరరామయ్య పొట్టలో పదునైన కత్తి గుచ్చాడు గోవిందు. సుందరరామయ్య కాలు నిలదొక్కుకోలేకపోయాడు. పొట్టలో ప్రేగులు ఉంగలు చుట్టుకుపోయాయి.

సుందరరామయ్య నోట మాటలేకుండా పడిపోయాడు. కత్తిని అతడి బట్టలకే తుడిచాడు గోవిందు. అతడి చేతి వాచీ, ఉంగరాలు వొల్చుకొన్నాడు. మెడలోని పులి

గోరు పతకం లాక్కున్నాడు. కత్తిని మడిచి జేబు రుమాలులో చుట్టి జేబులో పెట్టుకొన్నాడు.

తిరిగి లాడ్జివైపు నడిచాడు గోవిందు.

కౌంటర్‌లో వున్న వ్యక్తి హాయిగా నిద్రపోతున్నాడు. హాలులో గడియారం అరగంట కొట్టింది. పన్నెండున్నర. పదో నెంబర్ గదిలో చొరబడ్డాడు గోవిందు.

స్వరాజ్యం మగతగా ఇటు తిరిగింది. గోవిందు తలుపు లోపలివైపు గడియపెట్టి జీరో బల్బుకూడా ఆర్పేశాడు. మీదపడి స్వరాజ్యాన్ని ఆక్రమించుకొన్నాడు.

స్వరాజ్యం అటూ ఇటూ గింజుకోబోయింది. గోవిందు ఆమెకు యెలాంటి అవకాశమూ యివ్వదల్చుకోలేదు. ఆమె అరవబోయింది. ఫలితం లేకపోయింది. ఆమె నోరు నొక్కిపెట్టాడు గోవిందు.

చీకట్లో చెయ్యి చాపి టెలిఫోన్ అందుకొన్నాడు. రిసీవర్‌ను ప్రక్కగా పెట్టి డయల్ చేయసాగాడు___

కరుణా నర్సింగ్ హోంలో టెలిఫోన్ గణగణలాడింది. భార్య ప్రక్కనుండి ఒక్క ఉరుకులో ప్రతాపరావు వరండాలో వున్న టెలిఫోన్ సెట్టువైపు పరుగెత్తాడు.

డ్యూటీలో వున్న నర్స్ కునికిపాట్లు పడుతోంది.

రిసీవర్ చెవి దగ్గర వుంచుకొన్నాడు ప్రతాపరావు.

"కరుణా నర్సింగ్ హోం___మీరేనా?" అన్నాడు ప్రతాపరావు. ముందే నిర్ణయించుకొన్న కోడ్ మాటగా.

"అవును.... నేనే.... రేపు కలుసుకుందాం!"

"థాంక్స్" ప్రతాపరావు చెయ్యి వణికింది. రేపు కలుసుకుందాం అని గోవిందు అన్నాడు. అంటే అతడు

తనకు చెయ్యవలసిన పని విజయవంతంగా ముగిసింది.

రిసీవర్ జారిపోబోతుంటే రెండు చేతులతో దాన్ని క్రెడిల్ చేశాడు ప్రతాపరావు.

# 5

మధులత అతడివైపు సంశయంగా చూచింది.

"మీకేం ఫరవాలేదమ్మా! మీ రహస్యాలు ఎక్కడా వెల్లడిచేయను. కేసు టేకప్ చేసినా, చెయ్యకపోయినా అది మావంటి ప్రైవేట్ యిన్వెస్టిగేటర్ల నియమం!" అన్నాడు డిటెక్టివ్ శరీఫ్.

మధులత గాఢంగా నిట్టూర్చింది. "ఈ రోజు ఉదయం మా నాన్నగారి శవం నాగార్జున లాడ్జి సమీపంలో దొరికింది. ఆ విషయం మీకు తెలిసే వుండాలి!" అంది.

"సుందరరామయ్యగారు మీ నాన్నగారా?"

"అవునండి. నేను ఒక్కతెనే సంతానం."

"అంటే ఆయన అనంతరం ఆస్తికి వారసురాలు మీరేనన్నమాట."

"అలాగే అయివుండేది స్వరాజ్యం మా మధ్యకు రాకుండా వుంటే?"

"స్వరాజ్యం—ఆమె ఎవరు?"

"మా నాన్నగారు ముసలి వయసులో తిరిగి పెళ్ళి చేసుకోవాలనుకున్నారు...." అంటూ మధులత తనకు తండ్రి లేఖలు రాయడం లగాయతూ చనిపోయే రాత్రి తన యింటికి రావడంవరకూ వివరించింది.

శరీఫ్ ఆమె చెప్పిన విషయాలు మననం చేసుకున్నాడు.

"కూతురు యిక్కడ వుంది. అయినా ముసలాయన లాడ్జిలో దిగారు. తన కాబోయే భార్యతో ఏకాంతంగా

గడపడానికి అయివుండాలి!" అన్నాడు శిరీష్.

మధులత యేడుస్తోంది. కొంతసేపటికి తానే తేరుకుంది.

"కాదు సార్! ప్రతాపరావుకు నాన్నగారు రెండో పెళ్ళికి సిద్ధపడటం యిష్టం వుండదు."

"ఎందుకని?"

"నాకు రావలసిన ఆస్తి రెండు ముక్కలవుతుందని."

"అలా అని ప్రతాపరావు యెన్నడయినా వ్యక్తపరిచాడా?"

"రెండో పెళ్ళి విషయం తెలిస్తేకదా—ఆ విషయం తెలిసేది?"

"మరి ప్రతాపరావు మనసులో వున్నమాట ఎలా వూహించారు?"

"ఆయన మన స్తత్వం నాకు తెలుసును సార్! మామగారి ఆస్తిమీదనే ఆయన అన్ని ఆశలూ పెట్టుకున్నారు."

"స్వరాజ్యంతో కలసి మీ నాన్నగారు మీ యింటికి వచ్చారు. మీవారు అప్పుడు నిద్రపోతున్నారు. ఆయనకు మీ నాన్నగారి విషయం తెలిసే అవకాశంలేదు. అవునా?"

"అప్పుడు లేచి మా వారు సంగతి విన్నారని నా అనుమానం."

"మీరు ఆయన వినడం చూశారా?"

"లేదు."

"మీరు వెళ్ళి చూచేసరికి ఆయన నిద్రపోతున్నారా?"

"అవును సార్! అది కపటనిద్ర అని నా అనుమానం!"

"మీరు నర్సింగ్ హోంలో యెందుకు చేరవలసి

వచ్చింది?"

మధులత మొహం విప్పారింది. "అదే సార్! అక్కడే ప్రతాపరావు మీద దొరికిపోతాడు" అంది.

"ఎలా?"

"నేను మా నాన్నగారినీ స్వరాజ్యాన్నీ పంపి గది లోకి వచ్చాను. నిద్రపోయేముందు మంచినీళ్ళు తాగు తాను. కిటికీలోని గ్లాసు అందుకున్నాను. తాగాను. అంతే తెలుసు. తర్వాత నర్సింగ్ హోమ్‌లోనే కళ్ళు తెరిచాను."

"వూఁ!"

"మావారు ప్రతాపరావు ఆ నీళ్ళలో నిద్రమందు కలిపి వుంటారని నా అనుమానం!"

"నిద్రపోయే మందు కలిపి తానే నర్సింగ్ హోంకి తీసుకు వెళ్ళారా?"

"అవును."

"ఎందుకు?"

"దారిలో మా నాన్నను హత్య చేయాలి. హత్య చేయాలి అంటే బయటపడాలి. నర్సింగ్ హోం పనిమీద వెళ్తూ నాగార్జున లాడ్జి బయట నేనున్న వాహనం ఆపి, మా నాన్నను బయటికి రప్పించి వుంటాడని నా అను మానం. హత్య ముగిశాక నన్ను నర్సింగ్ హోంలో చేర్చి తన అమాయకత్వం ప్రదర్శించుకొన్నాడు అని నా అను మానం!"

శిరీష్ ఆమెను జాలిగా చూశాడు. "మీవారు మిమ్మల్ని బాగా చూసుకుంటారా?" అన్నాడు.

"నన్ను అనేకంటె నా వెనుక వున్న ముప్ఫయి

లక్షలను!"

"మిమ్మల్ని ఏమీ అనరుకదా! అంటే డబ్బుకోసం బాధపెట్టడం, అత్యాశ ప్రదర్శించడం వంటిది!"

"లేదు."

"మీకు మీవారంటే యిష్టమేనా?"

"ఏ భార్యకు భర్త అంటే ఇష్టం వుండదు సార్?"

"మీవారిమీద హంతకుడిగా అనుమానం రావడం గురించి ఏం చెబుతారు?"

"మా నాన్నగారితో మాట్లాడుతూ కిటికీవద్ద నీడ చూచినట్టు అనుమానం."

శిరీష్ కళ్ళు మూసుకున్నాడు. మధులత యిన్నిరకాల అనుమానపడుతోంది. తాను ఆమెను కేవలం అనుమానాలే వ్యక్తం చేసేదానిలాగా కొట్టిపారెయ్యడం సమంజసమా?

"లతగారూ! మీవారు హంతకుడో, కాదో తేల్చుకోవాలి. అంతేనా?"

"అవును సార్!"

"మీ నాన్నగారిని మరెవరయినా డబ్బుకోసం హత్య చేసివుంటే?"

"మావారే చేసినట్టు నా అనుమానం సార్!"

శిరీష్ మెల్లగా నవ్వి. "మీ అనుమానాల గురించి పరిశోధిస్తాను. నన్ను మాత్రం అనుమానించకండి!" అన్నాడు.

"లేదు సార్...." మధులత కళ్ళలో నీళ్ళుతిరిగాయి.

"సారీ లతగారూ! మీ నాన్నగారు మిమ్మల్ని ఒంటరిదాన్ని చేసిపోయారు."

మధులత కళ్ళు తుడుచుకుంది. హాండ్ బాగ్ లోంచి

చెక్కుబుక్కు తీసింది.

"యిప్పుడు వద్దు లతగారూ! మీ అనుమానాలకు తగిన ఆధారం దొరకాకగానీ నా అనుమానం తీరదు. అంతవరకూ...." చేతో వారించాడు శిరీష్.

మధులత లేచింది.

"ప్రతాపరావుగారు ప్రస్తుతం ఏం పని చేస్తున్నారు?" అడిగాడు శిరీష్.

"కంట్రాక్టులు తీసుకుంటున్నారు."

"లాభాలు బాగా వస్తున్నాయా?"

"ఏవో వస్తున్నాయి సార్! బాంక్ బాలన్సు అంతంత మాత్రంగానే వుంది. యెక్కువ పెట్టుబడిపెట్టి వ్యాపారం చేయాలని వుంది ఆయనకు."

శిరీష్‌కి అర్థమయింది. నుదురు కొద్దిగా పైకి లేచింది.

"మీ అడ్రసు యివ్వండి!" అన్నాడు శిరీష్.

## 6

ఫామిలీ అన్న రూంలో ప్రవేశించారు యిద్దరూ.

గోవిందు ఒక సీటులో కూర్చుంటూ ఎదుటి సీటువైపు చేయి చూపించాడు. ప్రతాపరావు యెదుటి సీటులో కూర్చున్నాడు.

వెయిటర్ వచ్చాడు. "రెండు రవ్వదోశె—రెండు స్వీటు....తొందరలేదు" అన్నాడు ప్రతాపరావు.

వెయిటర్ వెళ్ళిపోయాడు.

ప్రతాపరావు ముందుకు వొంగాడు. "నువు పని ముగించుకొని వచ్చేయ్యవలసింది. మరల లాడ్జికి యెందుకు వెళ్ళావు?" అన్నాడు.

"స్వరాజ్యం కొబ్బరిముక్కలాంటి పిల్ల!" లొట్టలు వేశాడు గోవిందు.

"నాన్సెన్స్....నీ వేలిముద్రలు గదిలో దొరికాయి. నువు భారీమనిషివని స్వరాజ్యం పోలీసులతో చెప్పింది."

గోవిందు వ్యంగ్యంగా నవ్వాడు. "పోలీసులు కాదు కదా, వాళ్ళ తలలో జేజెమ్మలు దిగిరావాలి. నీ ఫ్రెండ్‌నని యెవరికైనా తెలిస్తేకదా యెవరైనా అనుమానించేది."

"నీకు ఆ అతి నమ్మకం పనికిరాదు."

"ఒరేయ్ ప్రతాపరావ్! పాయింట్ మాట్లాడు. అలా చేశావు—ఇలా చేశావు అనక! పని విజయవంతంగా ముగిసినందుకు సంతోషించు."

"అలాగేలే!"

"మరి—ఇందిర చావుకు ముహూర్తం ఎప్పుడు పెడుతున్నావు?"

"అప్పుడేనా—యీ గొడవ చల్లారనియ్యి."

"అవునులే! నీ పని ముగిసింది మరి! నీకు తొందరేముంటుంది? రేపో మాపో నాకు ఇందిర విడాకుల నోటీసు పంపుతుంది—?"

"గోవింద్! ఆడినమాట తప్పను. మా మామయ్య విషయంలో నన్నే యెక్కువగా అనుమానిస్తున్నారు! అందుకని కొంతకాలం ఆగుదామన్నాను."

"నాన్సెన్స్! లోకంకోసం బతక్కు! నీకు బలమైన యాలిబీ వుంది."

"కాదన్నానా? అదే లేకపోతే యీపాటికి నన్ను లోపలికి తోసేవాళ్ళు!"

"పోనీ ఒక పని చెయ్."

"ఏమిటది?"

"హత్య ఈ ఊళ్ళో చేయక!"

"ఎక్కడ చేయను?"

గోవిందు కళ్ళతో సైగచేశాడు. వెయిటర్ స్ప్రింగ్ డోర్ తెరచుకొని ట్రేతో వచ్చాడు. టిఫిన్ ప్లేట్లూ, మంచినీళ్ళ గ్లాసులూ సర్ది వెళ్ళిపోయాడు.

ఇద్దరూ రవ్వదోశెలమీద పడ్డారు.

"మళ్ళీ ఈ రోజు నాడు ఇందిర వరంగల్ నుండి గోదావరి ఎక్స్‌ప్రెస్సుకి వస్తుంది. ఉదయం అయిదింటికి ముందే సామర్లకోట వస్తుంది. ఇంకా చీకటి కావాలంటే ఆమెను యెక్కడ సఫాచేయగలవో నువే నిర్ణయించుకో."

"విజయవాడ బెస్టు. అరరాత్రి అవుతుంది. యేదో ఒక ప్లాట్‌ఫాంమీద పని ముగించుకుంటాను."

"గుడ్, ఆ నిర్ణయం మీద నే వుండు!"

గోవిందు స్వీటు ప్లేటు ముందుకు లాక్కున్నాడు.

వెయిటర్ వచ్చాడు. ప్రతాపరావు రెండు కూల్ డ్రింక్స్ ఆర్డరిచ్చి స్వీటు తినసాగాడు.

"నేను ముందు వెళ్ళిపోతాను. తర్వాత నువు బయలుదేరు" అన్నాడు ప్రతాపరావు.

డ్రింక్స్ తాగారు.

వెయిటర్ బిల్లు తెచ్చాడు. ప్రతాపరావు ప్లేటులో పదిరూపాయలనోటు వుంచి బయటకు నడిచాడు. చుట్టూ చూచుకుంటూ కారు సమీపించాడు. తనను యెవరూ వెంటాడటంలేదని నిర్ణయించుకున్నాడు. కారు బయలుదేరతీశాడు.

## 7

క్రయిమ్‌బ్రాంచ్ ఆఫీసుముందు కారు ఆపి ఆఫీసులోకి నడిచాడు ప్రతాపరావు. క్రయిమ్ బ్రాంచ్ ఇన్‌స్పెక్టర్

కుమార్ ప్రక్కనే శిరీష్ కూర్చుండి వున్నాడు. వాళ్ళకు యెదుటి సీటులో మధులత కూర్చుంది. ఆమెను చూస్తూ మొహంలో విచారం పులుముకున్నాడు ప్రతాపరావు.

"కూర్చోండి ప్రతాపరావుగారూ!" అన్నాడు కుమార్.

మధులత ప్రక్కనే కూర్చున్నాడు ప్రతాపరావు.

"మీ మామగారి మరణంపట్ల మీ అభిప్రాయం ఏమిటి?" అడిగాడు క్రయిమ్ బ్రాంచ్ యిన్‌స్పెక్టర్ కుమార్.

ప్రతాపరావు పళ్ళు నూరాడు. "హంతకుడిని పట్టుకొని ఉరికంబం యెక్కించండి సార్! యెంత ఖర్చయినా నేను భరిస్తాను" అన్నాడు.

కుమార్ మామూలుగా చూచి, "అక్కరలేదు ప్రతాపరావుగారూ! ప్రభుత్వమే హంతకులను తన ఖర్చుతో పట్టుకుంటుంది. మీరు మీకు తెలిసిన విషయాలు చెప్పండి చాలును" అన్నాడు.

"అడగండి సార్! తెలిసినంతవరకూ చెబుతాను."

"రాత్రి మీరు యెక్కడ వున్నారు?"

"మామూలుగా భోజనం ముగించుకున్నాను. బెడ్ మీద వాలాను. వెంటనే నిద్రపట్టేసింది. టయిమ్ ఎంత అయిందో తెలియదు కానీ యెక్కడో దబ్బున శబ్దమయింది. నిద్రబద్దకంతోనే కళ్ళు తెరిచాను. ప్రక్క మీద లత లేదు. బెడ్ దిగాను. కాలికి లత తగిలింది. ఆమె స్పృహతప్పి వుంది. ప్రక్కనే గ్లాసు తిరగబడి వుంది. నేలమీద తడిగా వుంది. లతను కుదిపాను. ఆమెకు మెలకువ రాలేదు. భయపడ్డాను. కారులో నర్సింగ్ హోంకి తీసుకువెళ్ళాను."

"మధులతగారు అంతకుముందు యెప్పుడయినా అలా పడిపోయారా?"

"లేదు. అలా ఎందుకు పడిపోయిందో వూహించుకో లేకపోయాను."

"నర్సింగ్ హోంలో ఏం చేశారు?"

"స్మెల్లింగ్ సాల్ట్ వాసన చూపారు. లత మేల్కొంది. కాని నీరసంగా వుంది. లతకు నీరసంగా వుందని తెల్లవారాక తీసుకువెళ్ళమని లేడీ డాక్టరు అన్నారు. తెల్లారేదాకా అక్కడే లత పక్కన కూర్చున్నాను."

"నాగార్జున లాడ్జిలో మీ మామగారు సుందర రామయ్యగారు దిగినట్టు మీకు తెలుసా?"

"తెలియదు."

"సుందరరామయ్యగారు మీ యింటికి రాకుండా లాడ్జిలో యెందుకు దిగారు?"

"ఆయనకే తెలియాలి. మా యింటికి రావడంలో ఆయనకు అభ్యంతరం వుండవలసిన పనిలేదు."

"మీ మామయ్యగారు స్వరాజ్యం అనే స్త్రీని పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నారని మీకు తెలుసా?"

"తెలియదు. అయినా ఆ వయసులో ఆయనకేం పెళ్ళి?"

"స్వరాజ్యం మీకు తెలుసా?"

"ఎలా తెలుసుంది సార్?"

"రాత్రి 11-30 — 12 గంటల మధ్య సుందర రామయ్యగారి ప్రాణం పోయింది. సరిగ్గా ఆ సమయంలో మీరు యెక్కడున్నారో చెప్పగలరా?"

"లత బెడ్ ప్రక్కనే కుర్చీ వేసుకొని కూర్చున్నాను. లతని అడగండి. ఇన్ని ప్రశ్నలు ఎందుకడుగుతున్నారో

నేను తెలుసుకోవచ్చునా?"

"తెలుసుకోవచ్చును. సుందరరామయ్యగారు లాడ్జి లోంచి యివతలకు ఎందుకు వచ్చారు? సందులో నడుస్తోంటే అతడిని యెవరో కత్తితో పొడిచి చంపారు. రాత్రి 11-30 ప్రాంతంలో ఆయన అటు యెందుకు వెళుతున్నారు? ఎవరయినా రప్పించారా? రప్పించినవాళ్ళే హత్య చేశారా?"

ప్రతాపరావు బరువుగా ఊపిరి పీల్చాడు. "ఇన్స్పెక్టర్ గారూ! చనిపోయిన వాళ్ళ గురించి చెడు మాట్లాడకూడదు. కాని ఒక విషయం చెప్పక తప్పదు" అని చుట్టూ చూసి, "ఆయన పరమ ఛాందసుడు. జేబులో డబ్బు పెట్టుకొని తిరుగుతాడు. ఎందుకంటే వినడు. డబ్బుకోసం ఎవరయినా ఈ ఘాతుకం తలపెట్టారేమో!" అన్నాడు.

కుమార్ తలూపాడు. "మీ మామగారిని చివరిసారిగా ఎప్పుడు చూశారు?" అన్నాడు.

"సంక్రాంతికి ఆయన మమ్మల్ని తీసుకు వెళ్ళారు. అంతే. నాలుగు నెలలయి వుంటుంది."

"ప్రతాపరావుగారూ! కేవలం మా రొటీన్ లో యీ ప్రశ్నలడిగాం. సుందరరామయ్యగారి శవాన్ని రేపు ఒప్పచెలుతాం. మీరు వెళ్ళి రావచ్చును. మీరు కూడా మధులత గారూ!"

బతుకు జీవుడా అని లేచారు భార్యాభర్తలు.

దారిలో ప్రతాపరావు అడిగాడు. "నీకు కబురు పెట్టాడా కుమార్?"

"అవును. మీరు వచ్చాక వస్తానని చెప్పాను. సెటిల్ మెంట్ నిమిత్తంకాదు అని బలవంత పెట్టాడు సార్జెంట్.

వెళ్ళాను."

"ఏం అడిగారు?"

"మిమ్మల్ని అడిగినవే! మీరు చెప్పినట్టే నేనూ చెప్పాను."

"కుమార్ ప్రక్కగా అతడెవరు?"

"డిటెక్టివ్ శిరీష్ అట!"

# 8

"కుమార్! నీకు ప్రతాపరావు గురించి అనుమానం బలంగా వుంది. అతడో హంతకుడు అయివుంటే ఆ సమయంలో నర్సింగ్ హోంలో ఎలా వుండగలడు?" అన్నాడు శిరీష్.

కుమార్ తల విదిలించాడు. "సుందరరామయ్య మరణంవలన లాభించింది ప్రతాపరావు దంపతులే! మరొకరు సుందరరామయ్యను ఎందుకు చంపుతారు?" అన్నాడు.

"సుందరరామయ్య శరీరంమీద వున్న ఉంగరాలూ, పులిగోరు పతకమూ, జేబులో వున్న డబ్బూ హంతకుడు ఎత్తుకుపోయాడు. వాటికోసమే హత్య జరిగిందేమో!"

"వాటికోసం హత్య జరిగిందనుకుందాం. స్వరాజ్యాన్ని రేప్ చేసిన వారెవరు?"

"లాడ్జికి సంబంధించిన వాళ్ళెవరైనా ఏమో...."

కుమార్ నుదురు అరచేతితో రాసుకున్నాడు. "స్వరాజ్యం గదిలో నిద్రపోతోంది. చీకట్లో భారీ విగ్రహం ఆమెమీద పడింది. ఆమె నోరు నొక్కింది. ఆకారం టెలిఫోన్ చేసింది."

"స్వరాజ్యం సంభాషణ వినివుండాలి."

"అవును విన్నది. అందులో విశేషం యేమీలేదు

'అవును.... నే నే.... రేపు కలుసుకుందాం!' యింతే ఆ సంభాషణ."

"రేపిస్టు కావాలనే ఎవరికో టెలిఫోన్ చేశాడు. ముందు నిర్ణయించుకొన్న విషయం గురించి నిర్ధారించుకోవడానికి చేశాడు. ఎవరికి చేశాడో తెలిస్తే బాగుండును."

"లాడ్జికి వెళ్ళివద్దాం పద!"

"అన్నట్టు టెలిఫోన్ సెట్టుమీది వ్రేలిముద్రలు పట్టుకొని వెళదాం. లాడ్జి వర్కర్స్ గురించి కూడా మనం అనుమానం తీర్చుకోవచ్చును."

"ఆల్ రైట్!" కుమార్ కదిలాడు. టేబులు సొరుగు లోంచి కవర్ తీసుకొని బయలుదేరాడు.

శరీఫ్ డాట్సన్ కారులోనూ, కుమార్ జీపులోనూ బయలుదేరారు. నాగార్జున లాడ్జి ప్రొప్రయిటర్ యిద్దరినీ రిసీవ్ చేసుకొన్నాడు.

"రూం నెంబర్ 10 డబుల్ రూమా?" అడిగాడు శరీఫ్.

కుమార్ తలూపి, "మేనేజర్‌గా రాత్రి డ్యూటీలో ఎవరున్నారు?" అన్నాడు.

"అతడు యిప్పుడు కూడా డ్యూటీలో ఉన్నాడు సార్!"

"ఒక్కసారి పిలిపించండి."

ప్రొప్రయిటర్ స్వయంగా వెళ్ళి మేనేజర్‌ను తీసుకు వచ్చాడు. మేనేజర్ నమస్కారం పెట్టి నిలబడిపోయాడు.

"రాత్రి సుందరరామయ్య బయటికి వెళ్ళడం చూశారా?" అడిగాడు కుమార్.

"లేదు సార్!" అన్నాడు మేనేజర్.

"ఏం?"

"రాత్రి నిద్ర అపుకోలేకపోయాను సార్!"

"ఎన్ని గంటలకు మెలకువ లేకుండా పోయిందో చెప్పగలరా?"

"పదకొండు తర్వాత రూం సర్వీసు వుండదు సార్. అందువలన బాయ్స్ ఎక్కడెక్కడో నడుంవాల్చుతారు. ఆ సమయంలో వచ్చే కొత్త ఖాతాదారులు కూడా ఎవరూ లేరు. అంతగా ఉండరు కూడా."

"కౌంటర్ ముందునుండే రూం నెం. 10 కి రేపిస్టు వెళ్ళాడు. అయినా మీరు చూడలేకపోయారు."

"సారీ సార్!"

"మీ పనివాళ్ళలోనే రేపిస్టు కూడా ఒకరేమో!"

"కాదనుకుంటాను సార్!"

"ఒక్కసారి స్టాఫ్‌ని హాజరు పెట్టండి!"

మేనేజర్ వురుకుల పరుగులతో యేర్పాట్లు చేశాడు.

శిరీష్ మౌనంగా అన్నాడు. "స్టాఫ్‌లో యెవరూ భారీ విగ్రహాలున్నవాళ్ళు లేరు" అన్నాడు.

"ప్రొప్రయిటర్ తప్పించి."

"అయితే అతడిమీద నిఘా వెయ్యి" నవ్వాడు శిరీష్.

"ముద్దాయి దొరికేవరకూ అందరూ అనుమానితులే!"

శిరీష్ రూం నెం. 10 వైపు నడిచాడు. సర్వీస్ బాయ్ వైపు చూశాడు.

"రాత్రి నువు 11 గంటల తర్వాత నిద్రపోతున్నావా?" అన్నాడు.

"అవును సార్."

"ఎక్కడ?"

"ఈ వరండాలోనే సార్!" చోటు చూపించాడు

బాయ్.

"రూం నెం. 10 ఈ చోటుకు దగ్గరగానే కదూ వుంది."

బాయ్ తలూపాడు.

"రాత్రి 11-30 తర్వాత ఈ గదిలోంచి యేలాంటి చప్పుళ్ళూ వినిపించలేదా?"

"లేదు సార్!"

"11 గంటలకుముందు గది ముందుకు యెవరయినా వచ్చారా?"

బాయ్ ఆలోచనలో పడ్డాడు. "ఎవరో ముసలాయన. అవును సార్! యిటే వచ్చాడు. కాని ఏ గదిముందు ఆగాడో చూడలేదు."

"బాగా గుర్తుకు తెచ్చుకో!"

"చెప్పలేను సార్!"

"ముసలతను ఎలా వుంటాడు?"

"పెర్సనాలిటీగా వున్నాడు సార్!"

"ఇంకా?"

"కొద్దిగా వంగి నడిచాడు సార్! పెద్ద మీసాలు."

"వూఁ!"

"అంతేసార్! అప్పటికే నాకు కళ్ళు మూసుకు పోతున్నాయి."

"అతడే మళ్ళ వచ్చాడు. నీకు అడుగుల సవ్వడి వినిపించే వుండాలి."

బాయ్ తల అడ్డం తిప్పాడు.

షరీఫ్ అతడి భుజం తట్టి కుమార్ వద్దకు వెళ్ళాడు. "కుమార్! క్రింద గదులలో రాత్రి వున్నవాళ్ళే యిప్పుడూ వున్నారా? యెవరయినా గదిని విడిచిపెట్టి

వెళ్ళారా! రాత్రి 11 గంటల ప్రాంతంలో వొంగి నడిచిన ముసలాయనను యెవరయినా చూశారా? అతడికి గుబురు మీసాలు కూడా వుంటాయని చెప్పాలి. ఈ వివరాలు తెలుసుకో. ముఖ్యం. బాయ్‌కి పోలీసు రక్షణ యివ్వాలి. నా అనుమానం నిజమై వుంటే హంతకుడిని చూచిన ఒకే ఒక సాక్షి ఈ బోయ్" అన్నాడు.

కుమార్ పాయింట్లు నోట్ చేసుకున్నాడు. చకచక టెలిఫోన్ వైపు నడిచాడు. సిబ్బందికి తగిన సూచన లిచ్చాడు.

# 9

ప్రతాపరావు ఆసుపత్రి భవనంలోకి నడిచాడు. స్వరాజ్యం వున్న బెడ్ సమీపించాడు. స్వరాజ్యం మెల్లగా లేచి బెడ్ మీద కూర్చుంది.

"మీరు...." అంది స్వరాజ్యం.

"ప్రతాపరావు. చనిపోయిన సుందరరామయ్యగారి అల్లుడిని."

స్వరాజ్యం నమస్కారం చేసింది.

"మీకు జరిగిన అన్యాయానికి చింతిస్తున్నాను."

స్వరాజ్యం గుడ్ల నీరు కుక్కుకుంది.

ప్రతాపరావు స్టూలు లాక్కుని కూర్చున్నాడు.

"రాత్రి మీమీద అత్యాచారం చేసినవాళ్ళను గుర్తుపట్టారా?"

"చీకటి. భారీ ఆకారం, గుబురు మీసాలు. అంతే తెలుసు."

"పోలీసులకు అంతవరకే చెప్పారా?"

ఆమె తలూపింది.

"అతడు అంతకుముందు ఎప్పుడయినా మీ గదికి

వచ్చాడా?"

"ఎవరూ రాలేదు. వారు లాడ్జిలో గది తీసుకున్నట్టు గానీ ఎవరికీ చెప్పలేదు."

"లాడ్జిలో పనిచేసేవాళ్ళే మీమీద అత్యాచారం తలపెట్టారేమో!"

"అదీ చెప్పలేను."

"జరిగింది మర్చిపోండి. మా యింటికి రండి. ఎంత కాలం కావలిస్తే అంతకాలం వుండండి!"

స్వరాజ్యం అభిమానంగా చూచింది. "మీ కెందుకు శ్రమ? వారే పోయాక యిక యీ నగరంలో ఏం పని? మావాళ్ళ వద్దకు వెళ్ళిపోతాను" అంది.

ప్రతాపరావు విచిత్రంగా చూశాడు. "మీకు సుందరరామయ్యగారు ఏమని చెప్పి యిక్కడకు తీసుకువచ్చారో చెబుతారా?"

"అదంతా ఎందుకులెండి?"

"ఏం?"

"గతంతో నాకు యిప్పుడు పనిలేదు. యేదో ఆశ పెంచుకున్నాను. చిన్నతనంలోనే నన్ను వైధవ్యం వరించింది. ఇప్పుడు దురదృష్టం! అంతే! యిక నాకు ఎలాంటి ఆశా లేదు."

ప్రతాపరావు అక్కడ్నుంచి ఇంటికి వెళ్ళాడు.

మధులత ముభావంగా వంటింట్లో పని చేసుకుంటుంది.

ప్రతాపరావు ఆమెను సమీపించి, "స్వరాజ్యం తన వాళ్ళ వద్దకు వెళ్ళిపోతానంటూంది. పాపం! ఆమెకు ఎంతో కొంత సహాయం చేద్దామా?" అన్నాడు.

మధులత అర్థంగానట్టు చూచింది.

"మీ నాన్నగారు బతికివుంటే సగం ఆస్తి ఆమెకు

వెళ్ళిపోయేది కదా, ఆమె కూడా ఆశపెట్టుకొని వుండ వచ్చును."

"ఆస్తి యింకా స్వాధీనం కాలేదు కదా!"

"అదా! అదెంత సేపు?"

"విల్లు మార్చే లోపుగానే హంతకుడు పొట్టన పెట్టు కున్నాడు కదా!"

"విల్లు మార్చడం యేమిటి?"

"ప్రతాప్! బుకాయించక!"

"లతా! యేమయింది నీకు?"

మధులత చెయ్యి చాపింది. ఆమె చేతిలో చిన్నసైజు సీసా వుంది.

"ఇది ఘాటయిన నిద్రమందు కదా!" అంది మధులత.

"అది.... ఏమో...."

"నీ పెట్టె అడుగున దొరికింది."

"నాన్సెన్స్...."

"నువ్వు నన్ను చంపలేవు. ఆస్తి నా పేర రాశారు మా నాన్న. నేను యే రకంగా చచ్చినా నీ మెడకు ఉరి బిగిస్తాను."

"లతా! నిన్ను చంపడం యేమిటి?"

"అయితే ఈ మందు నాకు రాత్రి మంచినీళ్ళలో కలిపావు. నిద్రపోయేముందు ఆ నీళ్ళు తాగితీరతానని నీకు తెలుసు."

ప్రతాపరావు చటుక్కున ఆమె చేతిలోని సీసా లాక్కున్నాడు.

మధులత అరచేతులతో మొహం కప్పుకొని యేడు స్తోంది.

డ్రాయింగ్ రూంలోని టెలిఫోన్ మ్రోగింది. ప్రతాపరావు చకచక అటు పరుగెత్తాడు.

"నేను...." అవతల వినిపించింది.

"వూఁ!"

"కొంప మునిగింది."

"వూఁ!"

"ఇందిర రేపు రాత్రి హైదరాబాద్ నుండి బయలు దేరే గోదావరి ఎక్స్‌ప్రెస్‌లో వస్తోంది."

"వరంగల్లులో ఎక్కుతుంది కదా!"

"అవును."

"అలంకార్ గేటు దగ్గర వుండు వస్తున్నాను."

రిసీవర్ పెట్టేసి బయటకు పరుగెత్తాడు ప్రతాపరావు.

అయిదు నిమిషాల ఆలస్యంగా గోవిందు అలంకార్ గేటు వద్దకు వచ్చాడు. ఇద్దరూ టిక్కెట్లు తీసుకొని బాక్స్‌లో కూర్చున్నారు.

తెరమీద సినిమా అప్పటికే జరుగుతోంది.

"రాత్రి లతమీద నిద్రమందు ప్రయోగించినట్టు తెలిసి పోయింది."

"ఎలా?"

"ఇదిగో....ఈ సీసా....నా బట్టల పెట్టెలోంచి దొరకబుచ్చుకుంది."

"సీసా దాచి రహస్యం బట్టబయలు చేశావన్న మాట!"

మిగతా బాక్స్‌లన్నీ ఖాళీగా వున్నాయి. సినిమా బలవంతంగా ఆడిస్తున్నారు.

"లత వూహించుతుందనుకోలేదు."

"ఇప్పుడెలా?"

"ఏం చెయ్యమంటావు? నాకయితే యేమీ తోచడం లేదు."

గోవిందు తలపట్టుకు కూర్చున్నాడు.

"ఈ సమయం దాటితే నువ్వు నా పని చేసిపెడతా నన్నా పామీ లేదు."

"ఛ ... ఛ ...."

"ప్రతాప్! ధైర్యంచెయ్యి. ఈ అవకాశం తప్పితే నీకు మరల ఆమె అంత సులువుగా దొరకదు."

"నువ్వు ఎలిబీ ఎలా ఏర్పాటు చేసుకుంటావు?"

"ఈ రోజే జనరల్ ఆస్పత్రిలో ఎడ్మిటవుతాను."

"స్పెషల్ రూం తీసుకో!"

"అలాగేలే. నువ్వు ఆమెకు ఎదురు వెళ్ళడానికి నిశ్చయించుకొన్నావు కదా!"

"రేపు మధ్యాహ్నం మెయిలుకి విజయవాడ వెళ్తాను. అక్కడ గోదావరి ఎక్స్‌ప్రెస్‌కోసం కాచుక్కూచుంటాను."

"ఇక్కడ ఎలా సర్ది చెబుతావు!"

"అదే అర్థంకావడంలేదు."

స్నేహితులిద్దరూ ఎవరి ధోరణిలో వాళ్ళు ఆలోచనలో పడ్డారు.

"మధులతను ఆసుపత్రిలో చేరేలాగా చేస్తే?"

"అంటే?" ప్రతాపరావు ముందుకు వంగాడు.

గోవిందు గుసగుసలాడాడు.

"బాగుంది. ప్రాణాలకు మోసం రాకూడదు. వస్తే మన బతుకులు ఘోరంగా వీధిన పడతాయి."

"నాకు తెలియదా?" అన్నాడు గోవిందు.

# 10

కరుణా నర్సింగ్ హోం ఆవరణలో డాట్సన్ కారు ఆగింది. డిటెక్టివ్ శిరీష్ కారు దిగి నర్సింగ్ హోంలోకి వచ్చాడు. లేడీ డాక్టర్ నవ్వుతూ చూచింది.

"ప్రతాపరావు భార్య మధులత రాత్రి యిక్కడ అడ్మిటయింది. ఆ విషయంలో కొన్ని ప్రశ్నలడుగుతాను" అన్నాడు శిరీష్.

లేడీ డాక్టర్ అతడికి కుర్చీ చూపించి, "అడగండి" అంది.

"మధులత ఎన్ని గంటలకు నర్సింగ్ హోంకి వచ్చిందో చెప్పగలరా?"

ఆమె డైరీ తిరగవేసింది. "రాత్రి పదిన్నర. తెల్లవారాక అయిదు గంటలకు వెళ్ళిపోయింది" అంది.

"రాత్రి పదిన్నరనుండి తెల్లవారుజామువరకూ ప్రతాపరావు ఆమె ప్రక్కనే వున్నాడా?"

"అవును."

"సరిగ్గా గుర్తు తెచ్చుకోండి డాక్టర్! మధ్యలో యెప్పుడయినా బయటికి వెళ్ళాడేమో!"

"లేదు. గేటు దాటలేదు."

"ఎవరయినా అతడికోసం వచ్చారా?"

"లేదు."

"ఎవరయినా ఫోన్ చేశారా?"

"అతడికే ఎవరో ఫోన్ చేశారు."

శిరీష్ ఎగిరి గంతేశాడు. "ఎన్ని గంటలకో చెప్పగలరా?" అన్నాడు.

"పన్నెండు గంటల కనుకుంటాను."

"అతడికే ఫోన్ వచ్చినట్లు ఎలా చెప్పగలరు?"

"అతడే వెళ్ళి అందుకొని మాట్లాడి పెట్టేశాడు."

"ఏం మాట్లాడాడు?"

"ఏమో....ముక్తసరిగా రెండు ముక్కలు!"

"ఫోన్ దగ్గరకు హుషారుగా వెళ్ళాడా?"

"అంతగా గమనించలేదు."

"ఫోన్ వచ్చాక అతడి ప్రవర్తనలో మార్పు కనిపించిందా? అంటే తొట్రుపాటు కనిపించడం వంటిది."

"లేదు. ప్రశాంతంగా వున్నాడు."

శరీష్ కొన్ని నిమిషాలపాటు నిశ్శబ్దంగా వున్నాడు. వాచీ చూసుకున్నాడు. రాత్రి ఏడు కావస్తోంది.

సుందరరామయ్యను హత్యచేసిన వ్యక్తి స్వరాజ్యాన్ని రేప్ చేశాడు. సుందరరామయ్య ముక్కూ మొహం తెలియని వ్యక్తితో రాత్రివేళ ఒంటరిగా బయటకు వెళ్ళాడు. ఎలా వెళ్ళాడు? అతడికి బాగా కావలసిన వ్యక్తినుండి యేదో కబురు వస్తే తప్ప ఎందుకు వెళ్తాడు?

అతడిని హత్యచేసినవాడు మధులత పంపినట్టు చెప్పి వుంటాడు. హత్య జరిగిన సంగతి హంతకుడు టెలిఫోన్ లో చెప్పాడు. యెక్కడనుండయితేగాని ప్రతాపరావు నర్సింగ్ హోంలో ఫోన్ అందుకున్నాడు.

నర్సింగ్ హోంలో ప్రతాపరావు వున్నట్టుగా హంతకుడికి తెలుసు. ప్రతాపరావు తన మామగారిమీద ఎవరిని నియోగించాడు?

పోర్టికోలో కారు ఆగిన చప్పుడయింది. యెవరో మూలుగుతున్నారు. మరో నిమిషంలో మధులతను చేతుల మీద యెత్తుకొని ప్రతాపరావు లోపలకు వచ్చాడు.

"డాక్టర్....డాక్టర్!" అరిచాడు ప్రతాపరావు.

లేడీ డాక్టర్ అటు పరుగెత్తింది. అతడిని ఎమర్జన్సీ

గదిలోకి నడిపించింది. ప్రక్క గదుల్లోంచి నర్సులు అతడికి సహాయం చేశారు.

ప్రతాపరావును బయట వుంచి లేడీ డాక్టర్ తలుపు వేసుకొంది. ప్రతాపరావు బల్లమీద కూర్చున్నాడు. విచారంగా కళ్ళు మూసుకొన్నాడు. డిటెక్టివ్ శిరీష్ అతడిని సమీపించాడు.

"ఏం జరిగింది ప్రతాపరావుగారూ?" అడిగాడు శిరీష్.

"ఇద్దరమూ మార్చ్యురీకి బయలుదేరాం. ఆసుపత్రి సమీపంలో మధులత ముందుగా కారు దిగింది. ఎవడో చాల రాష్‌గా మోటారుసైకిలు మీద వచ్చి ఆమెను ఢీకొట్టాడు. మనిషి తుళ్ళి రోడ్డుమీద పడింది" ప్రతాప రావు తల దించుకొన్నాడు.

డిటెక్టివ్ శిరీష్ నుదురు చిట్లించాడు. మరో పథకం అమలు జరుగుతోంది. మధులతను ప్రమాదంలో యిరి కించడం కేవలం పథకం ప్రకారమే జరిగింది. ప్రతాప రావును రిమాండ్‌లోకి తీసుకొనేలాగా చెయ్యాలి.

• • •

గోవిందు ఆఫీసులో అడుగుపెట్టాడో లేదో టెలిఫోన్ గణగణలాడుతోంది. గోవిందు రిసీవరందుకొన్నాడు.

"నువ్వూ, ప్రతాపరావూ కలసి దిగిన ఫోటో హత్యల అగ్రిమెంట్ నా చేతిలో పడింది."

"ఎవరు నువ్వు?"

అవతల క్లిక్‌మంది.

గోవింద్ పిచ్చెత్తిపోయాడు. గారేజిలో వున్న కారు తీసుకొని యింటికి క్షణంలో వెళ్ళాడు. రత్తి అవుట్ హవుస్‌లో పనిలో వుంది. గోవిందు భవనంలోకి ప్రవే

శించి బీరువా వెతికాడు.

వెలుగుతూన్న బల్బువైపు తీక్షణంగా చూశాడు.

భద్రంగా వుంచిన నెగెటివ్ ఫిల్మ్, ఫోటోలూ అగ్రిమెంట్ కాగితం లేవు. గోవిందు మంచంమీద కూల బడ్డాడు. తనకి ఫోన్ చేసిందెవరు? అది ఆడగొంతు. రతి కాదు కదా! అవును రతి అయివుండాలి. నిన్న ప్రతాప రావు యిక్కడికి రావడం రతికే తెలుసు.

ఆమెకు యింటి తాళంచెవులు యెలా వచ్చాయి.

ఇందిర హత్యను వాయిదా వేయాలి. లాభంలేదు. ప్రతాపరావుకు భార్యను ఆసుపత్రిలో వదిలి వెళ్ళే వీలు కల్పించాడు తను. కాని అతడు యిప్పుడు ఇందిరను ప్రయాణంలో హత్యచేస్తే తన పీకకు ఉరి తగులుకుం టుంది.

గోవిందు అవుట్ హౌస్ వైపు వెళ్ళాడు.

రతి నవ్వుతూ చూచింది. ఆ నవ్వులో కల్మషంలేదు.

"రతీ! నేను లేకుండా యింట్లోకి యెవరయినా వచ్చారా?" అడిగాడు గోవిందు.

"లేదు మామా!" అంది రతి.

## 11

ప్రతాపరావు ఆమెకు బత్తాయి తొనలు ఒలిచి అం దించాడు. మధులత అటు తిరిగింది.

"నీకు నామీద కోపం యేమిటి లతా?" అన్నాడు ప్రతాపరావు.

"………"

"ప్లీజ్ ….తిను."

"నన్ను ఒక్కసారే చంపెయ్యకూడదా? ఇలా యాక్సిడెంట్లు చేసేకంటె….?" మధులత యేడుస్తోంది.

"యాక్సిడెంట్లు చేయడం ఏమిటి? ఎలా ప్రమాదం జరిగిందో నాకేం తెలుసు?"

"............"

"పోలీస్ కంప్లయింట్ కూడా ఇచ్చాను. దుర్మార్గుడు దొరకలేదు."

ఉదయం వెలుగు గదిలో పడుతోంది. తలుపుమీద చప్పుడయింది. ప్రతాపరావు లేచివెళ్ళి తలుపుతీశాడు.

"లోపలకు రావచ్చునా?" అన్నాడు శిరీష్.

ప్రతాపరావు దారిచ్చాడు.

"మధులతగారిని కొన్ని ప్రశ్నలడగాలి. మీకు అభ్యంతరమా?"

"నెవ్వర్."

"అయితే ప్లీజ్...." బయటికి దారి చూపించాడు శిరీష్.

ప్రతాపరావు బయటికి వెళ్ళిపోయాడు. శిరీష్ తలుపు మూశాడు.

"మిమ్మల్ని ఢీకొట్టిన డ్రైవర్‌ను గుర్తుపట్టగలరా?" అడిగాడు శిరీష్.

"లేదు సార్. గుర్తుపట్టలేను. ఆసుపత్రి ప్రాంతంలో. అక్కడ అంతా చీకటిగా వుంది."

"మధులతగారూ! మీరు అభిప్రాయ పడినట్టుగా హత్య ఒక పథకం ప్రకారంగానే అమలు జరిగింది. అలాగే ప్రమాదం కూడా!"

"శిరీష్‌గారూ! నాదొక మనవి."

"చెప్పండి!"

"మా నాన్నగారిని ఎవరు చంపించారో నిర్ధారణ అయింది. నామీద ప్రమాదం ఎవరు సృష్టించారో తెలు

స్తోంది. ఆయనకు నామీద ప్రేమ వుండవలసిందిపోయి యింత కక్ష వున్నపుడు యేం చేసి యేం లాభం?"

"అయితే—యేమంటారు మీరు?"

"దయచేసి పరిశోధన వదలివేయండి. మీ శ్రమకు ఫీజు చెల్లిస్తాను."

"మధులతగారూ! హంతకుడి పోలికలు దొరికాయి. హంతకుడు తన పని ముగియగానే మీవారికి ఫోన్ చేశాడు. యాక్సిడెంట్ ఎందుకు చేశాడో తెలియడం లేదు. ఈ సమయంలో మీరు విత్ డ్రా కావడం బాగుండదు."

మధులత నిశ్చలంగా చూసింది.

"మధులతగారూ!"

ఆమె తల వొంచుకొని ఏడుస్తోంది. నేరస్తురాలిలాగా ఆమె మోకాళ్ళ మధ్య తలవొంచుకొని యేడుస్తోంది. శరీఫ్ జాలిగా చూశాడు. ఆమె ఆస్తి ప్రతాపరావుకు దక్కింది. ఆమె తండ్రిని ప్రతాపరావు నియోగించిన హంతకుడు పొట్టన పెట్టుకున్నాడు. చివరకు మధులతను గాయాలతో ఆసుపత్రిపాలు చేశాడు.

హంతకుడెవడు? హంతకుడికి ప్రతిఫలం యేం యిచ్చి వుంటాడు.

"మధులతగారూ! ఈ మధ్య పెద్ద మొత్తంలో ప్రతాపరావు డబ్బు తీసుకోవడం జరిగిందా?"

"లేదు సార్! ఆ వివరం ఎందుకడిగారు?"

"మీ యింటికి ఎవరయినా కొత్తవారు కానీ పాతవారు కానీ వచ్చారా.... యిటీవల కాలంలో....అంటే ఒక వారం పదిరోజులుగా."

మధులత ఆలోచనలో పడింది. తల అడ్డంగా

త్రిప్పింది.

"పోనీ ప్రతాపరావుగారి స్నేహితుల జాబితా తయారుచేద్దాం. ఆయన స్నేహితులతో నాకు పని పడింది."

మధులత అయోమయంగా తలూపింది. ఆమె జాబితా చెబుతూంటే శిరీష్ తయారుచేయసాగాడు.

ప్రతాపరావు గదిబయట కాలుకాలిన పిల్లిలాగా తిరగసాగాడు. శిరీష్ తన భార్యను ఏం ప్రశ్నలు అడుగుతున్నాడో అతడికి అంతుపట్టలేదు. ఈ సమయంలో గోవిందు తన ప్రక్క వుంటేగాని ధైర్యం చాలదు. ప్రతాపరావు బయటికి వెళ్ళాడు.

కారులో గోవిందు ఇంటికి వెళ్ళాడు. ఇంట్లో గోవిందు లేడు.

"ఆఫీసులో వుంటారు" అంది రతి.

ప్రతాపరావు గోవింద్ అండ్ ఇందిరా ఎంటర్ప్రయిజెస్ ఆఫీస్ ముందు కారాపాడు.

గోవిందు తల పట్టుకు కూర్చున్నాడు. ప్రతాపరావును చూచి నోరావులించి, "నువ్వా? ఏమిటి యింత వుదయాన్నే వచ్చావు?" అన్నాడు.

ప్రతాపరావు కళావిహీనంగా మొహం పెట్టి "శిరీష్ నా భార్యను ఏవో ప్రశ్న లడుగుతున్నాడు. నాకు భయంగా వుంది. ఇందిరను కలుసుకోవడానికి వీలు కుదురుతుందని యాక్సిడెంట్ చేశాం. తీరా చూస్తే యీరోజు బయలు దేరే పరిస్థితి లేదు" అన్నాడు.

"ఏం? యెందుకు లేదు?" యేదో ప్రశ్న వేశాడు గోవిందు.

"నా భార్య యాక్సిడెంట్ విషయంలో అనుమాన

పడింది."

"ఇందిర కోసం నువు వెళ్ళవద్దులే!"

"ఏం? ఏమయింది?"

"మనం యిద్దరం కలిసి రాసుకున్న అగ్రిమెంట్, తీయించుకున్న ఫోటో — నెగిటివ్‌తో సహా మాయమయింది."

ప్రతాపరావు మొహంలో కత్తివాటుకు నెత్తురు చుక్క లేదు. "ఎలా మాయమవుతుంది?" అన్నాడు చివరకు.

"వేసిన తాళాలు వేసినట్టే వున్నాయి. ఒక ఆడ గొంతు ఫోన్ చేసేవరకూ నాకు ఆ విషయం తెలియదు."

"ఆడగొంతా? ఆమె ఎవరు?"

"అదే తెలియాలి!"

గోవిందు మాట పూర్తికాకముందే బల్లమీది టెలిఫోన్ మ్రోగింది. ప్రతాపరావు రిసీవర్ అందుకున్నాడు.

"నువ్వూ ప్రతాపరావూ కలిసి దిగిన ఫోటో రాసుకున్న అగ్రిమెంట్ కావాలంటే రెండు లక్షల రూపాయలు యివ్వాలి. సాయంకాలం చెప్పు. నాలుగు గంటలకు ఫోన్ చేస్తాను" అవతల క్లిక్‌మంది.

ప్రతాపరావు క్రెడిల్ చేసి, తలను చేత పట్టుకున్నాడు.

గోవిందు అతడిని పిచ్చివాడిలాగా చూడసాగాడు.

## 12

ఇన్‌స్పెక్టర్ కుమార్ చిరాకుగా చూశాడు.

"శిరీష్! మనం ప్రతాపరావు జాబితా ప్రకారంగా వెతుక్కోవడం వలన పెద్ద వుపయోగం కనిపించడం

లేదు. అతడు ఎవరో కిరాయి మనుషులను నియోగించుకుని వుంటేనో....” అన్నాడు కుమార్.

“ప్రతాపరావు కిరాయి మనుషులకు అవకాశం యివ్వడు. అతడు యెవరితోనో లాలూచీపడ్డాడు.”

“లాలూచీయా?”

“అవును. సుందరరామయ్య హత్య జరిగిన నాటి రాత్రి మధులతను ఆసుపత్రిలో చేర్చి ఎలిబీ ఏర్పాటు చేసుకున్నాడు. అతడి పరోక్షంలో సుందరరామయ్యను హత్య చేశాడు హంతకుడు.”

“అవును.”

“ఇప్పుడు మరల మధులతను గాయపరచి ఆసుపత్రిలో చేర్చాడు ప్రతాపరావు. అతడు ఎలాంటి ఎలిబీ కోసం ఆసుపత్రిలో వుంటున్నాడు?”

“పాయింటే!”

“సుందరరామయ్యను హత్య చేసినందుకు ప్రతాపరావు హంతకుడికి బాంక్ బాలన్స్‌లోంచి ఎలాంటి పారితోషికమూ డ్రా చేయలేదు. అందువలన కిరాయి హంతకుడు అయివుండడని నా అనుమానం.”

“మరి ఎవరితో అతడు లాలూచీపడ్డాడని నీ అనుమానం?”

“బాగా తెలిసిన స్నేహితుడితో.”

కుమార్ ఆలోచనలతో సతమతమయ్యాడు. “స్నేహితుడు ఎవరని చెప్పుకోగలం?”

“కుమార్! హంతకుడు భారీమనిషి. నాగార్జున లాడ్జి సర్వీసింగ్ బాయ్ చూశాడు. స్వరాజ్యం అతడిని చీకట్లో చూచింది. మధులత మొత్తం మూప్ఫయి చిరునామాలు యిచ్చింది. మనం మారువేషాలలో, బాయ్ కూడా మారు

వేషంలో బయలుదేరతాం. నువ్వూ, బాయ్ మారంగా వుంటారు. నాతో ప్రతాపరావు స్నేహితుడు మాట్లాడు తుంటాడు. బాయ్ గురుపట్టి నీకు చెబుతాడు."

"దీని బదులు ప్రతాపరావును సెల్ లో వేసి థర్డ్ డిగ్రీ ట్రీట్ మెంట్ యిస్తే చాలదా?"

శిరీష్ నవ్వి, "ప్రతాపరావు కావాలని యెక్కడా కమిట్ కాలేదు. ఈ రోజున మామగారి ఆస్తి కలసి లక్షాధికారి అయ్యాడు. అతడిమీద ఆరోపణలు రుజువు కాని పక్షంలో థర్డ్ డిగ్రీ ట్రీట్ మెంటు యిచ్చి మాట పడటం తప్ప ఫలితం ఏముంటుంది?" అన్నాడు.

కుమార్ తిరిగి ఆలోచనలో పడ్డాడు.

"ఒక క్రైంబ్రాంచ్ ఏజంటును ప్రతాపరావు వెంట ఫాలోఅప్ చేయించు. హడావుడి తగ్గాక అతడు తన హంతక మిత్రుడిని కలియకుండా వుండడు."

శిరీష్ మాట ముగిసేలోగా సార్జంట్ లోపలకు వచ్చాడు.

"మేకప్ సామగ్రీ, లాడ్జ్ బాయ్ సిద్ధం సార్!" అన్నాడు సార్జెంట్. శిరీష్, లాడ్జ్ బాయ్, ఇన్ స్పెక్టర్ కుమార్ మారువేషాలు వేసుకున్నారు. డిటెక్టివ్ శిరీష్ అడ్రస్సులు చూసుకుంటూ, "డాబాగార్డెన్స్ లో ఒక డున్నాడు. నేను మోటార్ సైకిల్ మీద వెళ్తుంటాను. మీరు టాక్సీలో ఫాలో అవండి" అన్నాడు.

ప్రతాపరావు కోసం ఏజంటును యేర్పాటు చేసి కుమార్ ఒక టాక్సీని పిలిపించాడు.

మోటార్ సైకిలు డి.ఇ.టి. ఆఫీస్ ప్రక్క లైన్లో ఒక యింటి ముందు ఆగింది.

అర్జునరావు, రైస్ మర్చెంట్ అని నేంబోర్డు వుంది.

శిరీష్ మోటార్ సైకిలు దిగి యింటిముందు నిలబడ్డాడు. అర్జునరావు సులువుగానే యింట్లో దొరికాడు. భారీ మనిషి. బొజ్జ వూపుతూ శిరీష్‌వైపు వచ్చాడు. టాక్సీ అంత దూరంలో ఆగింది.

"ఆ రాత్రి వచ్చినవాడికి యింత బొజ్జలేదు సార్!" అంటున్నాడు బాయ్.

కుమార్ చిరునామాల జాబితాలోంచి అర్జునరావు పేరు కొట్టేశాడు.

శిరీష్‌ను ఎగాదిగా చూచి, "ఎవరు కావాలండి?" అన్నాడు అర్జునరావు.

శిరీష్ అప్పటికే కుమార్ పంపిన సంకేతం అందు కున్నాడు.

"ప్రతాపరావు యింట్లో కనిపించడంలేదు. స్నేహి తుల యింటికి వెళ్ళున్నట్టు చెప్పాడు. మీ యింటికి వచ్చాడేమోనని వచ్చాను" అన్నాడు శిరీష్.

"మా యింటికి అతడు వచ్చి యేడాదయివుంటుంది."

"అలాగా ఈ మధ్య ఎవరితోనయినా కలసివుండగా ప్రతాపరావును చూశారా?"

"నిన్న ఒక హోటలులోకి గోవిందుతో కలిసి వెళ్ళడం చూశాను."

"అడ్రసు చెప్పండి. గోవిందుగారిని కలుసుకుంటాను" అన్నాడు శిరీష్. మధులత చెప్పిన లిస్టులో గోవిందు పేరు లేదు.

అతను అడ్రసు చెప్పాడు.

## 13

రాత్రి పదయింది. గోవిందు టాక్సీదిగి స్ప్రింగ్ రోడ్లో నడవసాగాడు. అతనికి మనసంతా చికాకుగా వుంది.

ప్రతాపరావు తుని స్టేషన్‌లో ఇందిరను హత్య చేస్తాడు. కారులో బయలుదేరాడు. ఉదయం 6 గంటలకు తునిలో గోదావరి ఎక్స్‌ప్రెస్సు ఆగుతుంది.

ఇందిరకు అతడు తెలుసు. "గోవిందుకు తునిలో యాక్సిడెంటయింది. నీ టెలిగ్రాం యిక్కడికి డైరెక్ట్ అయింది" అంటాడు ప్రతాపరావు.

ఇందిర అతడితో బయలుదేరుతుంది. కారులో నిర్జనంగా వున్నచోట ఇందిరను పీక నులిమి హత్య చేస్తాడు ప్రతాపరావు. నగలూ, నట్రా దోచుకుంటాడు. రైల్వే ట్రాక్ ప్రక్కగా శవాన్ని పారవేస్తాడు.

గోవిందుకు తాత్కాలికంగా మనస్సుకు ప్రశాంతత చిక్కింది. తను యింట్లో వుంచిన నెగటివ్ ఫిల్మ్, ఫోటోలూ, అగ్రిమెంట్ యేమయాయో అర్థమయింది. తనతో రత్తి ఎంత నాటకం ఆడింది?

సాయంకాలం తనకు ఆమె నుండి ఫోన్ వచ్చింది. ముందే జాగ్రత్త పడివుండటం వలన తనకు ఆ ఫోన్ ఎక్కడినుండి వచ్చిందో తెలిసిపోయింది. తన ఇంటినుండే ఫోన్ వచ్చింది.

అవుట్ వావుసు ముందు ఆగాడు గోవిందు. "రత్తీ!" అన్నాడు.

అవుట్ హవుస్‌లో లైటు వెలిగింది. తలుపు తెరుచుకుంది. గోవిందు స్థిరమైన నిశ్చయం వచ్చినవాడిలాగా లోపలికి వెళ్ళి తలుపు గడియపెట్టాడు. ఆమె అప్పటికే ప్రక్క గదిలోకి నడిచింది. ఆ గదిలో డ్రిమ్మర్ వెలుగుతోంది.

గోవిందు ఒక్క వురుకులో ఆమెను సమీపించాడు. వెనుకవాటుగా ఆమె గొంతు పట్టుకున్నాడు. ఆమె పట్టు

విడిపించుకుని స్విచ్ నొక్కింది. గదిలో ప్రకాశవంతమైన వెలుగు పరచుకుంది.

ఆమె విసురుగా వెనక్కి తిరిగింది. గోవిందు ఆమెను చూస్తూ ఆశ్చర్యపోయాడు.

"ఇందిరా!" అన్నాడు గోవిందు.

"ఏం ఆశ్చర్యంగా వుందా?" అంది ఇందిర.

"నువ్వు....నువ్వు....ఎప్పుడు వచ్చావు?"

"మొన్న రాత్రి."

"అంటే?"

"సుంతరరామయ్య హత్య జరిగాక" ఆమె విచారంగా అంది.

"రాజమండ్రివరకూ ట్రెయిన్‌లో వచ్చాను. రత్తి నా మనిషి. నామీద నువు వెడలగ్రక్కే ద్వేషం గురించి ఎప్పటికప్పుడు నాకు తెలియపర్చుతూంది. అందుకే నీకు తెలియకుండా ప్రయాణమై వచ్చాను."

"రత్తి...." అతడి గొంతు పొడారిపోయింది. "నువు రాజమండ్రి నుంచి ఎలా వచ్చావు?"

"సూపర్ ఎక్స్‌ప్రెస్ బస్సులో."

"నెగటివ్ ఫిలిం, ఫోటో ప్రింట్‌లూ, అగ్రిమెంట్ యేం చేశావు?"

"వేలాది కాపీలు తీయించాను. నాకు అపకారం జరిగిన తక్షణం అవి అన్ని పోలీస్ స్టేషన్లకూ, అన్ని పత్రికా కార్యాలయాలకూ అందించే యేర్పాటు చేశాను...."

"రత్తి ద్వారానా?"

"అవును."

తలుపుమీద టకటక చప్పుడయింది.

గోవిందు వులిక్కిపడ్డాడు.

"ఫరవాలేదు. నీ స్నేహితురే! రమ్మని ఫోన్ చేసింది రత్తి."

"ఎందుకు?"

"నువు ముందుగా నిర్ణయించుకున్నట్టుగా జనరల్ ఆస్పత్రిలో చేరలేదనీ, ఇందిరను హత్య చేస్తుంటే స్వయంగా చూడాలని వుబలాట పడుతున్నావనీ ఫోన్ చేసింది."

గోవిందు అయోమయంగా చూచి తలుపు తెరిచాడు. ప్రతాపరావు లోపలకు వచ్చాడు. గదిలోవున్న ఇందిరను చూచి వులిక్కిపడ్డాడు. పాలమారినట్టుగా యిబ్బంది పడి తిరిగి గోవిందును చూశాడు. ప్రతాపరావుకు తడారి పోయింది.

ఇందిర మౌనంగా నడిచి పెరటిగుమ్మం తలుపు తెరచింది. క్రయిమ్‌బ్రాంచ్ ఇన్‌స్పెక్టర్ కుమార్, డిటెక్టివ్ శిరీష్ లోపలకు వచ్చారు. ప్రతాపరావు చటుక్కున గుమ్మంలోకి వెనక్కి గెంతి తలుపు తెరిచాడు.

తలుపు అవతల క్రయింబ్రాంచ్ ఏజంటు వున్నాడు. అతడి రెండు చేతులలో పిస్తోళ్ళున్నాయి.

డిటెక్టివ్ శిరీష్ నవ్వి, "ప్రతాపరావూ! నీ ఆట కట్టింది. గోవిందుతో అతడి భార్యను చంపేటట్టు ఒప్పందంపడి మీ మామయ్యను చంపించావు. గోవిందు అంతటితో ఆగకుండా స్వరాజ్యాన్ని రేప్ చేశాడు. టెలిఫోన్ సెట్టుమీద వ్రేలిముద్రలు దొరికాయి.

నీ స్నేహితుల జాబితా తయారుచేశాం. అర్జునరావు నిన్నూ, గోవిందునూ కలిపి నిన్న ఒక హోటల్‌లోకి

వెళ్ళడం చూశాడు. గోవిందు షాపుమీద నిఘా వేశాం. లాడ్జ సర్వీసింగ్ బాయ్ గోవిందును గుర్తుపట్టాడు. నీ వేలిముద్రలు సేకరించాం. అయినా నాగార్జున లాడ్జలో దొరికిన వేలిముద్రలు కావు. గోవిందు వేలిముద్రలకోసం ప్రయత్నించాం. రత్తి మాకు పరిచయమయింది. ఇందిర వచ్చినట్టు చెప్పి ఆమెమీద జరుగుతూన్న హత్యా ప్రయత్నం గురించి చెప్పింది" అన్నాడు.

గోవిందు తల వాల్చుకున్నాడు.

కుమార్ సంకెళ్ళు తీసి ప్రతాపరావుకూ, గోవిందుకూ కలిపి తగిలించాడు.

"థాంక్స్ టూ రత్తీ అండ్ ఇందిరా!" అన్నాడు కుమార్.

• * •

ప్రతాపరావు సెల్‌లో గోడకి చేరగిలపడి కూర్చు న్నాడు. సెల్‌లో అతడిప్రక్క గోవిందు పడుకొని వున్నాడు. ప్రతాపరావు ఒంటిన జెయిలు అధికారు లిచ్చిన బనీనూ, డ్రాయరూ వున్నాయి. బనీనుమీద 74 అని నెంబర్ వుంది. గదిలో పదిహేను కాండిల్ బల్బు వెలుగుతోంది.

ప్రతాపరావు నెంబర్ తడుముకుంటూ గోడవైపు చూశాడు.

గోడమీద రెండు బల్లులు పాకుతున్నాయి. రెండూ ఎదురెదురుగా పాకుతున్నాయి. వాటికి మధ్యగా కీటకం వాలివుంది. రెండు బల్లులూ ఒడుపుగా ముందుకు వస్తు న్నాయి. కూచి కూచి అడుగులు వేస్తున్నాయి. కీట కాన్ని సమీపించాయి.

రెండూ ఒకేసారి నాలుకలు విసిరాయి.

కీటకం ఎగిరిపోయింది. బల్లుల జిగురు నాలుకలు ఒక దాని కొకటి అంటుకున్నాయి. నాలుకలు లాక్కో బోయాయి. కింద దబ్బున పడ్డాయి.

ప్రతాపరావు కళ్ళు మూసుకున్నాడు. "జీవిత కాలం తమ యిద్దరూ ఈ బల్లులను చూస్తూ చావాలి!" గొణుక్కున్నాడు.

—:అ యి పో యిం ది:—

# తళ తళ మెరిసే కత్తి

## ప్రతాప రవిశంకర్

ఆ వీధిలో దీపాలు గుడ్డిగా వెలుగుతున్నాయి. నిర్మానుష్యంగా వున్నది రోడ్డంతా....రోడ్డుకు రెండువైపులా వున్న యిళ్ళలో దీపాలు యెప్పుడో ఆరిపోయాయి.

నిశ్శబ్దంగా వున్న వీధిలోకి చిన్నగా—తాపీగా నడుస్తూ వచ్చాడతను. అతని దృష్టి రోడ్డుకు పక్కగా వున్న ఇళ్ళమీదనే వుంది.

దాదాపు ప్రతి ఇంటికీ బయట నేమ్ బోర్డులు కనపడుతున్నాయి.

అతను చప్పుడు చెయ్యని మెత్తని బూట్లు వేసుకున్నాడు.

సన్నగా వున్నాడు. అయినా బలంగా వున్నాడు. అతడి జుట్టు చిందరవందరగా వున్నది. అతడి కళ్ళు కొంచెం ఎర్రగా వున్నాయి.

కొంచెం చలిగా వుండడంవల్ల అతడి రెండు చేతులను ప్యాంటు జేబుల్లోకి దోపుకున్నాడు.

అతను ఆ వీధి చివరికి వచ్చాడు.

ఎడమవైపుగా వున్న ఆ మేడ ముందు ఆగిపోయాడు. ఎదురుగా వున్న వీధిదీపం వెలుతురులో ఆ యింటి గేటుకు వేల్లాడుతోన్న నేమ్ బోర్డు ఆతనికి బాగానే కనిపించింది.

యస్. రాజన్ పారిశ్రామికవేత్త.

అక్కడే నిలబడి అతను ఒక్కసారి అటూ యిటూ చూశాడు. లైటు స్తంభం వెనకవైపు బాగా చీకటిగా వున్నది. అంతే కాకుండా ఆ వెనుక వున్న యింట్లో వున్న యేదో పువ్వుల చెట్టు గోడమీదగా కిందకు వాలి వున్నది.

అతడి దృష్టి మేడమీది ఓ గదిలో వెలుగుతున్న లైటు మీద పడింది. సగంవరకు తెరిచివున్న కిటికీ అద్దాలనించి వెలుతురు బయటకు పడుతోన్నది.

అతను చేతినున్న వాచీకేసి చూసుకున్నాడు.

ఐదునిముషాలు తక్కువ పన్నెండు గంటలు కావస్తోంది.

అతను ఆలోచిస్తున్నాడు....

లోపల గదిలో రాజన్ ఏం చేస్తున్నాడు?

ఇంకా ఎందుకు దీపం వెలుగుతోంది?

లోపల అతనొక్కడే వున్నాడా? ఇంకెవరైనా వున్నారా?

నిమిషం తర్వాత అతడికి ఆ గదిలోనించి గాజులు గలగల—గ్లాసుల చప్పుడు వినిపించాయి.

అతనికి అర్థమయ్యింది.

రాజన్ గదిలో ఎవరో ఆడది వుంది.

మరో ఇరవై నిముషాలు గడిచాయి.

కొంచెం దూరంలో మెయిన్ రోడ్డుమీద వున్నట్టుండి సందడి మొదలయ్యింది.

సెకండ్ షో సినిమా వదిలినట్టున్నారు. మనుషులు మాట్లాడుకొంటూ వెళుతున్న సందడి వినిపిస్తోంది. వాహనాలు రివ్వున దూసుకు వెళుతున్న చప్పుడవుతోంది.

ఇంకా మేడమీది గదిలో దీపం ఆరిపోలేదు.

అతడికి విసుగనిపించింది.

ఇంకో పది నిముషాలు అవలీలగా గడిచిపోయాయి.

సందడి కూడా తగ్గిపోయింది.

చీకట్లోనించి రెండు అడుగులు ముందుకు వేశాడు.

ప్యాంటు జేబులో చెయ్యిపెట్టాడు.... పొడుగాటి కత్తి చేతికి తగిలింది.

అతను గబగబా ముందుకు నడిచి ప్రహరీ గోడదగ్గరకు వెళ్ళాడు.

గోడమీద చేతులు ఆనించి నిముషంలో లోపలకు దూకాడు.

అతడి అదృష్టం.... ఆ మేడమీదకు బయటనించి కూడా మెట్లు వున్నాయి.

తోటలో చెట్లు గాలికి తలలు వూపుతున్నాయి అక్కడ దీపం లేకపోవటం వల్ల అంతా చీకటిగా వున్నది.

మెల్లెక్కి పైకి చేరుకున్నాడు. మెట్ల పక్కనే వున్న గదిలోనే దీపం వెలుగుతోంది.

అద్దాలకిటికీ తలుపుల మధ్యనించి లోపలి దృశ్యం కనపడుతోన్నది.

రాజన్ సోఫాలో కూర్చునివున్నాడు. అతడి పక్కనే

ఓ యువతి అర్ధనగ్నంగా వుండి అతడి గ్లాసులో విస్కీ వొంచి పెదవులకు అందిస్తోంది.

అతను ఆమె భుజాలను నిమురుతున్నాడు.

ఆమె నవ్వుతోంది కిల కిలా—

ఉన్నట్టుండి అతను ఆమె పెదవులను అందుకుని ముద్దు పెట్టుకున్నాడు....

చిన్నగా అరిచింది ఆమె—

"నీ పెదవుల్లో అమృతం వుంది." అన్నాడు....

"మైకంలో అలాగే అనిపిస్తుంది....తర్వాత మీకు నే నసలు గుర్తే వుండను" అన్నది....

"డోంట్ బి సిల్లీ....నువ్వు ఎప్పుడూ నా గుండెల్లోనే వుంటావు....యిది నిజం" గ్లాసులో విస్కీని గొంతులోకి వంచుకుని ఆమెకు గ్లాసును అందిస్తూ అన్నాడు రాజన్....

"అదే నిజమైతే నేను యిప్పటికీ ఓ ఫ్లాటులో అద్దెకు వుండాల్సిన అవసరం యెందుకు వుంటుంది?" అతడి కళ్ళలోకి చూస్తూ అన్నదామె—

అతను యేదో మాట్లాడబోయాడు.

కాని ఇంతలోనే ఆ గది తలుపులు భళ్ళున తెరుచుకున్నాయి. అతను లోపలకు అడుగుపెట్టి వెంటనే తలుపులను మూశాడు.

ముందుగా—అతడిని చూసిన ఆమె భయంతో బిగుసుకుపోయింది.

అతడి చేతిలో పొడవాటి కత్తి వున్నది. ఆ కత్తి చాలా పదునుగా వుంది. తళతళమని మెరుస్తోంది. దాని పిడి నల్లగా వుంది.

రాజన్ కళ్ళు ఆశ్చర్యంతో పెద్దవైనాయి.

మైకంతో మూతలు పడుతున్న కళ్ళను బాగా తెరిచి చూశాడు....

ఎదురుగా—మృత్యువులా నిల్చుని వున్న అతను—కత్తి పట్టి బిగుసుకున్న అతడి చెయ్యి.

క్షణం తర్వాత అతడి నోరు పెగిలింది.

"ఎవరు నువ్వు?" అడిగాడు రాజన్.

నవ్వాడు అతను అదోలా—

నవ్వి "నేనెవరో నీకు చెప్పిన వెంటనే గుర్తు రాదు. ఒక్కటిమాత్రం నిజం.... నేనే నీ పాలిట మృత్యువును" అన్నాడు.

అప్పుడు రాజన్ కళ్ళలో భయం కనపడింది. ఆ యువతి కవ్వున అరవబోయింది.

"ష్.... అరవకు.... తెరిచిన నోరు మూసుకోక ముందే నీ ప్రాణాలు పైకిపోతాయి. ఈ కత్తి ముందుగా నీ గుండెల్లోకి దూసుకుపోతుంది" అన్నాడతను వేగంగా—

అంతే.... ఆమె పెదవుల మధ్యనించి శబ్దం బయటకు రాలేదు.

"నువ్వెవరో నాకు తెలీదు.... నేను నీకు యెలాంటి ద్రోహమూ చెయ్యలేదు" అన్నాడు రాజన్ గొంతు పెగుల్చుకుని....

అతను మళ్ళీ నవ్వి "నేనెవరో నీకు తెలియక పోయినా నువ్వెవరో నాకు తెలుసు.... రాజన్ అంటే నువ్వే కదూ?" అన్నాడు.

అవునన్నట్లు తలాడించాడు.

"అయితే నువ్వే నాకు కావలసిన మనిషివి.... నిన్ను హింసించి చంపటమే నా ధ్యేయం."

"వద్దు .. నన్నేమీ చెయ్యొద్దు.... ఇంతకీ నువ్వెవరు?

నువ్వెవరివో చెప్పకుండా నన్ను చంపుతానని బెదిరించటం న్యాయమేనా?" అన్నాడు రాజన్ ఎలాగైనా అతడి నించి తప్పించుకోటానికి ఆలోచిస్తూ—

"హు ... న్యాయం.... న్యాయం.... న్యాయం గురించి మాట్లాడే అర్హత నీకు లేదు. మరోసారి నువ్వు న్యాయం అంటే నీ నాలుక కోసేస్తాను....నువ్వెంత దుర్మార్గుడివో నాకు తెలుసు....నీతో కబుర్లు పెట్టుకుని టైము వేస్టు చెయ్యటానికి రాలేదు" అని ప్యాంటు జేబులోనించి నైలాన్ తాడును బయటకు తీశాడు.

ఆ తాడును ఆ యువతికి ఇచ్చి రాజన్ రెండు చేతులనూ వెనక్కి విరిచి కట్టెయ్యమన్నాడు.

ఆమె భయంతో అతను చెప్పినట్లే రాజన్ని కట్టేయబోయింది....

"యూ ఫూల్ ....నువ్వు నన్నే కట్టేస్తావా?" అన్నాడు రాజన్ కోపంగా అక్కడినించి లేవటానికి ప్రయత్నం చేస్తూ.

"కదలకు రాజన్ .... నేను పాము లాంటివాడిని.... క్షణంలో నిన్ను అంతం చేస్తాను....నువ్వు ఎన్ని ప్రయత్నాలు చేసినా నా నించి తప్పించుకోలేవు. చెప్పాను కదూ? నిన్ను ఒక్కసారిగా చంపను. భయపెట్టి, హింసించి నెమ్మదిగా చంపుతాను...."

ఆ యువతి రాజన్ చేతులు కట్టేసింది. తర్వాత ఆ యువతి చేతులను వెనక్కి వంచి అతను కట్టేశాడు. టేపు బయటకు తీసి యిద్దరి పెదవులకూ అంటించాడు....

ఆ యువతి కళ్ళలోనించి నీళ్ళు బయటకు వచ్చి

చెక్కిళ్ళమీదకు కారాయి....

"భయపడకు....నిన్నేమీ చెయ్యను....నా జాగ్రత్త కోసం ఇలా చేశాను....సారీ...." అంటూనే అతను కత్తిని అందుకున్నాడు....

"డియర్ రాజన్....జీవితంలో నువ్వు పదునైన కత్తి పోటును ఎప్పుడూ తినలేదేమో....ఇదిగో ఇలా వుంటుంది. రుచి చూడు" అంటూ కత్తిని విసురుగా రాజన్ భుజంలోకి దించేశాడు.

కెవ్వుమన్నాడు రాజన్.

నోటికి టేపు వుండటంతో శబ్దం బయటకు రాలేదు. మూలుగు వచ్చింది.

ఆ యువతి అదిరిపడింది.

కత్తి సగంవరకు దిగిపోయింది.

నెత్తురు రివ్వున బయటకు చిమ్మింది.

క్షణాల్లో షర్టంతా తడిసిపోయింది.

రాజన్ కళ్ళలో నీళ్ళు వచ్చాయి....

సోఫాలో పక్కకు పడిపోయాడు....

అతడికి నిమిషంలో స్పృహపోయింది.

బయటకు లాగిన కత్తికి అంటిన నెత్తురును రాజన్ షర్టుకే తుడిచాడు అతను.

తర్వాత ఆ యువతి చేతికట్లు విప్పదీసి "నేను వెళ్ళిపోయిన పది నిముషాలకు డాక్టర్‌కు ఫోన్ చెయ్యి....పది నిముషాలలోపల నువ్వు నోరు విప్పితే నిన్ను ప్రాణాలతో వదలను" అని అక్కడినించి బయటకు వచ్చి మెట్లు దిగి కిందికి వచ్చాడు.

గోడ దూకి రోడ్డుమీదకు వచ్చాడు.

# 2

రూప 'సిల్కు కళామందిరం'లో నించి చేతిలో ప్యాకెట్టుతో బయటకు వచ్చింది. వయ్యారంగా నడుస్తూ రోడ్డు పక్కనే పార్కు చేసి వున్న ఎరుపురంగు ఫియట్ కారు దగ్గరకు నడిచింది.

ఆమె అందమైన కళ్ళు నిర్మలంగా వున్నాయి. ఆమె షిఫాన్ చీర కట్టుకుంది. స్లీవ్ లెస్ బ్లవుజు వేసుకున్నది. పాదాలకు హైహీల్ చెప్పులు.

కుడిచేతికి ఎలక్ట్రానిక్ గడియారం....

ఆమె చేతిలోవున్న ప్యాకెట్టును వెనుక సీట్లోకి చిన్నగా విసిరి ముందు డోర్ తెరిచి స్టీరింగ్ వీలు ముందు కూర్చుంది.

సరిగ్గా అప్పుడే—అప్పటివరకూ రోడ్డుకు అవతల వున్న ఖాళీ ప్రదేశంలో ఓ చెట్టుకింద నిలబడిన అతను గబగబా ఆమె దగ్గరకు వచ్చాడు.

వచ్చి "ఎక్స్‌క్యూజ్ మి మేడమ్" అన్నాడు....

ఆమె అతడికేసి ఆశ్చర్యంగా చూసి "ఎవరు మీరు? యేం కావాలి?" అని అడిగింది కనురెప్పలను టపటప లాడిస్తూ—

"మీరు లక్షాధికారి జనార్దనంగారి అమ్మాయే కదూ" అని అడిగాడు.

"అవును....అయితే యేమిటి?"

"మీ పేరు?"

"రూప...." అంటూనే ఆమె ఫియట్‌ను స్టార్టు చేసింది.

"నేను మీతో ఓ ముఖ్యమయిన విషయం గురించి మాట్లాడాలి రూపగారూ....మీకు అభ్యంతరం లేకపోతే

మీ కార్లో కొంతవరకు నేను కూడా వస్తాను" అన్నాడు అతడు ఇంగ్లీషులో—

ఒక్కసారి రూప అతడి కళ్ళలోకి చూసింది. చాలా మామూలుగా వున్నాయి అతడి కళ్ళు—అతడి మాటల్లో సభ్యత—గౌరవం ఆమె గ్రహించి "దయచేసి యే విషయం గురించి మాట్లాడాలో చెబుతారా....?" అన్నది.

"మీ నాన్న గురించి....ఆయన గురించి మీతో ఓ సంగతిని చెప్పాలి....యిక్కడ దగ్గరలో ఓ పార్కు కూడా లేదు. అందుకని మనం కార్లో వెళుతూ మాట్లాడుకోవటమే బావుంటుంది."

క్షణం ఆలోచించి "ఆల్ రైట్ ....రండి...." అన్నది రూప.

ఆమెకు థాంక్స్ చెప్పి, అతను బ్యాక్ డోర్ తెరుచుకుని ఫియట్‌లో ఎక్కాడు.

వెంటనే కారు బాణంలా రివ్వున ముందుకు దూకింది.

"దయచేసి కారును వీలయినంత నెమ్మదిగా నే పోనివ్వండి" అన్నాడతను.

"ఎందుకు? మనం మా యింటికి వెళ్ళయినా మాట్లాడుకోవచ్చు. మా డాడీకి సంబంధించిన విషయం అన్నారు కాబట్టి ఆయనతో కూడా మాట్లాడవచ్చు" అన్నది రూప వేగం తగ్గించకుండా నే.

"ప్లీజ్ .... నేను చెప్పినట్టు చెయ్యండి .... నేను చెప్పిన విషయాన్ని మీ నాన్నాతో మీరు చెబితే నే బావుంటుంది...."

"ఆల్ రైట్ ....అలాగే....మీరు చెప్పినట్టే చేస్తాను. ముందు మీరు చెప్పదల్చుకున్నదేమిటో చెప్పండి" అన్నది

స్పీడు తగ్గిస్తూ.

"నేను మీకు ఎలా కనిపిస్తున్నాను?" అడిగా డతను వెంట నే—

ఆమె ఆశ్చర్యపడింది. ఎందుకంటే ఆమె అతనలా అడుగుతాడని వూహించలేదు.

"మంచి మనిషిలా సంస్కారవంతుడిలా అగుపడు తున్నారు" అని చెప్పింది.

అతను నవ్వాడు.

"నిజమే .... నేను సంస్కారవంతుడినే .... కాని యిప్పుడు నేను రాక్షసుడిని. త్వరలో హంతకుడిని కూడా కాబోతున్నాను" అన్నాడు నవ్వటం ఆపేసి....

సడన్‌గా కారుకు బ్రేకు వేసింది రూప.

"ప్లీజ్ .... బ్రేకు వెయ్యకండి.... మీరు భయపడవల సిన అవసరం లేదు. నేను మంచివాళ్ళకు మంచి వాడినే...."

మళ్ళీ ఫియట్ ముందుకు దూకింది.

"ఇంతవరకు నేను ఒక్క హత్య కూడా చెయ్యలేదు. కాని త్వరలోనే కొన్ని హత్యలు చెయ్యబోతున్నాను. అందులో మీ నాన్న కూడా వున్నాడు."

రూప వులిక్కిపడి మళ్ళీ బ్రేకు నొక్కింది.

"ప్లీజ్ .... కారును పోనివ్వండి.... ఇంకా వివరంగా చెప్పాలి."

ఆమె అప్రయత్నంగానే యాక్సిలేటర్ మీద కాలును నొక్కుతూ "మీరు నిజంగానే మాట్లాడుతున్నారా? జోక్ చేస్తున్నారా?" అని అడిగింది.

"జోక్‌లా వుంటే నవ్వండి.... కాని యిది నిజం.... అయితే హత్య చెయ్యదల్చుకున్న మనిషి ముందుగా ఆ

విషయాన్ని యెవరికీ చెప్పడు. కాని నేను అలా కాదు. మీ నాన్నను ఒక్కసారిగా చంపటం నా ధ్యేయం కాదు. భయపెట్టి-హింసించి మరీ చంపుతాను. అందువల్ల నే ముందుగా చెబుతున్నాను."

రూప మొహం నిండా చెమట పట్టింది. చేతులు చిన్నగా వణికాయి.

ఎదురుగా వున్న మిర్రర్‌లో అతడి రూపం క్లియర్‌గా అగుపడుతోంది. ఇప్పుడు అతని కళ్ళలో ఆమెకు కార్య దీక్ష—పట్టుదల ఓ విధమయిన గట్టి నిర్ణయం కనిపించాయి.

అతను జోక్ చెయ్యటంలేదని అనుకుంది.

క్షణం తర్వాత ఎలాగో నోరు తెరచి "మా నాన్న మీద మీ కెందుకు కోపం? ఆయన్ని హత్య చెయ్యాలని మీ రెందుకు అనుకుంటున్నారు?" అన్నది.

"సారీ....మీ ప్రశ్నలకు నేను జవాబులు చెప్పను. ఏ కారణమూ లేకుండా ఓ మనిషిని హత్య చెయ్యాలని అనుకోటానికి నా మతి చలించలేదు. నేను పూర్తి ఆరోగ్యంగా వున్నాను. నాదో రిక్వెస్టు....మీరు యింటికి వెళ్ళగానే ఓ మనిషి ఆయన్ని హత్య చెయ్యటానికి పొంచి వున్నట్టుగా చెప్పండి. ఆయన చేసిన నేరం యేమిటో ఆయన్నే అడగండి...." అన్నాడతను.

రూప మాట్లాడలేదు.

ఆలోచిస్తూనే ఎదురువస్తున్న వాహనాలను తప్పుకుంటూ జాగ్రత్తగా డ్రయివ్ చేస్తోంది.

ఎవరీ మనిషి?

ఎందుకు తన తండ్రిమీద పగబట్టాడు?

నిజంగా ఆయన్ని హత్య చేస్తాడా?

ఇంత ధైర్యంగా యెందుకు చెబుతున్నాడు? తనని యెవరైనా పట్టుకుంటారనే భయంలేదా?

ముందుగా చెబితే తగిన జాగ్రత్తలు తీసుకొంటారనే ఆలోచన రాలేదా?

ఏమిటిదంతా?

ఆమె ఆలోచనలకు అంతరాయం కలిగిస్తూ "ఒక్కసారి ఇలా చూడండి" అన్నాడు.

తలతిప్పి చూసింది రూప.

అతడి చేతిలో తళతళమని మెరుస్తున్న పొడుగాటి నల్లని పిడివున్న పదునైన కత్తి.

"ఈ కత్తి త్వరలోనే పిడివరకూ నూటిగా మీనాన్న గుండెల్లో దిగబడుతుంది."

భయంతో చిన్నగా అరిచింది రూప.

కారు సడన్ బ్రేకుతో ఆగిపోయింది.

"థాంక్ యూ రూపా" అని అతను ఆమె వూహించనంత వేగంగా డోర్ తెరుచుకొని కిందికి దూకాడు.

రూప భయంనించి తేరుకొని చూసేసరికి అతను జనంలో కలిసిపోయాడు.

## 3

"రండి .... ఇన్ స్పెక్టర్ ...." అని ఆహ్వానించాడు స్వరూప్. అతను రాజన్ కొడుకు. ఇంజనీరింగ్ చదువు కొన్నాడు.

పోలీసు ఇన్ స్పెక్టర్ జగన్ లోపలకు వచ్చాడు.

అది ప్రయివేటు నర్సింగ్ హోం. అందులో వున్న ఓ గదిలో బెడ్ మీద మూలుగుతూ పడివున్నాడు రాజన్.

లోపలకు వచ్చిన ఇన్ స్పెక్టర్ని చూడగానే అతడి బాధ మరింత యెక్కువయ్యింది.

అక్కడే వున్న కుర్చీలో కూర్చున్నాడు ఇన్‌స్పెక్టర్ జగన్.

అప్పుడు ఉదయం తొమ్మిది గంటలయ్యింది.

రాజన్ భుజానికి బ్యాండేజితో పెద్ద కట్టు వున్నది.

రాజన్‌కు ఓ గంట క్రితమే స్పృహ వచ్చింది.

ఆ రాత్రి అతను వెళ్ళిపోగానే ఆ యువతి కూడా ఎవరినీ పిలవకుండానే తన నివాసానికి వెళ్ళిపోయింది— పోలీసులను పిలిస్తే ఆ గొడవలో తను కూడా ఇరుక్కోవలసి వస్తుందని—

తెల్లారుజామున రాజన్ కొడుకు స్వరూప్ ఏదో ఊరు వెళ్ళి వచ్చేవరకు అతనలా పడేవున్నాడు.

అప్పుడు అతను కార్లో డాక్టర్ దగ్గరకు తీసుకొని వచ్చాడు.

"ఏమయ్యింది?" అడిగాడు జగన్.

నెత్తురు చాలావరకు కారిపోయి రాజన్ పరిస్థితి దయనీయంగా వున్నది. ఇంకో గంటలోపల అతడికి నెత్తురు ఎక్కించటం జరక్కపోతే అతను స్పృహ రాకుండానే ప్రాణాలు పోగొట్టుకొనే వాడని డాక్టర్ వజ్రదంతం అన్నాడు.

రాజన్—ఇన్‌స్పెక్టర్‌కు చెప్పిన మాటల సారాంశం ఇది.

'రాత్రి నేను నిద్రపోతుంటే ఎవరో తలుపు తట్టారు. తెరిచేసరికి యెవరో సన్నగా వున్న యువకుడు లోపలకు వచ్చి, తనని చంపుతానని బెదిరించి, వెంటనే కత్తితో భుజంమీద బలంగా పొడిచి పారిపోయాడు. వెంటనే తనకు స్పృహ తప్పింది.'

"ఆశ్చర్యంగా వుంది? యెవరా మనిషి? అతనికి

మీ మీద యెంతో పగ—కసి వున్నాయని ఈ సంఘటన వల్ల చాలా క్లియర్‌గా తెలుస్తోంది. చెప్పండి. ఎవరతను? అతన్ని ఇంతకుముందు యెప్పుడయినా చూశారా? అతను మీ మీద పగబట్టటానికి కారణం ఏమిటి?" అని అడిగాడు జగన్.

డాక్టర్ వజ్రదంతం దగ్గి, "పేషంట్ చాలా నీరసంగా వున్నాడు. ప్రస్తుతానికి అతడిని మాట్లాడించటం అంత క్షేమం కాదు. దయచేసి ఈ ఒక్కరోజు ఓపిక పట్టండి. రేపటికి కొంచెం కోలుకోవచ్చు" అన్నాడు.

జగన్ విసుక్కున్నాడు.

"డాక్టర్....ఆలస్యం చేస్తే ఆ ప్రతీకార హంతకుడు తప్పించుకొనే అవకాశాలు ఎక్కువ అవుతాయి. అతడిని వెంటనే పట్టుకోవాలంటే నేనడిగిన ప్రశ్నలకు జవాబులు కావాలి...."

రాజన్ చిన్న గొంతుతో "ఇన్‌స్పెక్టర్! ముందు మీరు ఆ మనిషిని పట్టుకొనే ప్రయత్నం చెయ్యటం ఎంతయినా ముఖ్యం. ఎందుకంటే అతను మళ్ళీ వచ్చి నన్ను గాయపర్చవచ్చు. లేదా ప్రాణం తీయవచ్చు.... అతడి గురించిన వివరాలు నేను ఇస్తాను" అని యెలాగో మూలుగుతూనే అతడిని వర్ణించి చెప్పాడు రాజన్—ఓవైపు డాక్టరు గొడవ పెడుతున్నా.

అన్నింటినీ చిన్న బుక్‌లో నోట్ చేసుకొని "థాంక్ యూ మిస్టర్ రాజన్.,ఇక మీరు నిశ్చింతగా వుండండి. ఆ హంతకుడిని పట్టుకొనే ప్రయత్నాలు మొదలు పెడతాం. అతను యెక్కడికీ పోలేడు. మరో విషయం. రేపు ఉదయం మిమ్మల్ని నేను మళ్ళీ కలుస్తాను. అప్పటికి ఈ మనిషి మిమ్మల్ని హత్య చెయ్యటానికి ప్రయత్నించ

టానికి తగిన కారణం ఏదయినా గుర్తువస్తే నాతో చెప్పేందుకు సిద్ధంగా వుండండి. దయచేసి ఏదీ దాచవద్దు. అలా చేస్తే మీకే ప్రమాదం.... బై" అని బూట్లు టకటక లాడించుకుంటూ వెళ్ళిపోయాడు ఇన్‌స్పెక్టర్ జగన్.

"డాక్టర్ ఏమిటిదంతా? నాకెందుకో భయంగా వుంది" అన్నాడు స్వరూప్ ఇన్‌స్పెక్టర్ వెళ్ళగానే—

"భయపడకు బోయ్.... నా శాయశక్తులా కృషి చేసి మీ ఫాదర్‌ని బతికిస్తాను" అన్నాడు డాక్టర్ వజ్రదంతం.

"మీరు బతికిస్తారు నిజమే డాక్టర్. కాని మళ్ళీ ఆ పగబట్టిన మనిషి మా నాన్నను హత్య చెయ్యటానికి మరో సారి ప్రయత్నం చెయ్యొచ్చు కదా!" అన్నాడు.

"నిజమే. ఇందుకు నువ్వు తగిన జాగ్రత్తలు తీసుకోక తప్పదు. అయినా నాదో అనుమానం. మిష్టర్ రాజన్ ఆ యువకుడికి చేసిన ద్రోహం యేమిటి? ముందు మనం ఈ విషయం తెలుసుకుంటే మంచిది."

"కరెక్టు డాక్టర్.... నాన్నను ఈ విషయం గురించి అడగాలి" అన్నాడు స్వరూప్.

"సారీ మిష్టర్ స్వరూప్. ఈ పరిస్థితిలో మీ ఫాదర్‌ను యెక్కువగా మాట్లాడించటానికి డాక్టర్‌గా నేను ఒప్పుకోను" అంటూ వెనక్కు తిరిగాడు వెళ్ళి పోయాడు.

గదిలోపల రాజన్ బాధగా చిన్నగా మూలుగు తున్నాడు.

## 4

జనార్ధనం ఆశ్చర్యంతో నోరు తెరిచాడు.

అతడి యెదురుగా సోఫాలో రూప కూర్చుని వున్నది.

ఆమె తండ్రికి కార్లో ఎక్కి తనని భయపెట్టిన అతడి గురించి వివరంగా చెప్పింది.

రెండు నిమిషాల తర్వాత "అతను జోక్ చేశాడేమో" అన్నాడు.

"కాదు డాడీ. అతను జోక్ చెయ్యటం లేదని కూడా చెప్పాడు. నేనూ అప్పుడు నీలాగే అనుకున్నాను. కాని అతడినిచూస్తే ప్రాక్టికల్ మనిషిలాగానే అనిపించాడు."

"రియల్లీ వండర్....బహుశా అతను పొరపాటుపడి వుంటాడు. జనార్దనం పేరు వున్న లక్షాధికారులు ఈ మహానగరంలో ఎంతమంది లేరు. నువ్వు పొరపాటు చేశావు. అతన్ని వివరాలు అడిగి వుంటే బావుండేది."

"అడిగాను డాడీ....కాని అతను ఏమీ చెప్పనని అన్నాడు. అతను పొరపాటుపడి వుంటాడని కూడా నేను అనుకోను. ఎందుకంటే ఓ మనిషిని హత్యచెయ్యాలని ఎవరైనా అనుకున్నప్పుడు తనకు కావలసిన మనిషి అతనో కాదో పూర్తిగా రుజువు చేసుకున్న తర్వాతనే నిర్ణయించుకుంటారు. అందుకే నాకు ఇప్పుడు భయంగా వుంది డాడీ....దయచేసి నువ్వు బాగా గుర్తుచేసుకో. నీకు తెలిసి కాని పొరపాటునగాని యెవరికయినా ద్రోహం చేశావేమో" అన్నది రూప.

ఆమె కళ్ళలో నీళ్ళు వచ్చాయి భయంతో—ఇంకా ఆమె కళ్ళముందు అతడి రూపం—అతడు చూపిన తళతళ మెరిసే పొడుగాటి కత్తి కదులుతూనే వున్నాయి.

"లేదు రూపా .... యెంత ప్రయత్నం చేసినా నేను ఎవరికీ ద్రోహం చేసినట్టు గుర్తు రావటంలేదు. ఆలోచిస్తుంటే నాకు మతి పోతోంది. చీమకు కూడా

అపకారం చెయ్యని నన్ను హత్య చెయ్యటానికి ఓ చదువు కున్న యువకుడు ప్రయత్నం చేస్తున్నాడంటే నమ్మలేక పోతున్నాను. ఒకవేళ అతను మతిలేని మనిషేమోనని నాకు అనుమానంగా వుంది" అన్నాడు జనార్దనం.

"కాదు డాడీ....అతను పూర్తిగా మన లోకంలోనే వున్నాడు. పైగా అతను ఎంత పగలేనిదే మీ తండ్రిని హత్య చెయ్యాలని అనుకుంటాను అని కూడా అన్నాడు. దాన్నిబట్టి తప్పకుండా నువ్వు అతడికి ఏదో అన్యాయం యెప్పుడో చేసివుండాలి అనిపిస్తోంది. ప్లీజ్ .... డాడీ.... బాగా గుర్తుచేసుకో..ఎప్పుడయినా...ఎన్నెళ్ళక్రితమైనా నువ్వు ఏ మనిషికయినా ద్రోహం చేశావేమో....ఒకవేళ నువ్వు అలాంటిది యేదయినా చేసివుంటే అతడిని నేను క్షమాపణ అడుగుతాను" అన్నది రూప వస్తున్న దుఃఖాన్ని ఆపుకుంటూ.

"రూపా...." అన్నాడు జనార్దనం బాధగా. అతడికీ కన్నీళ్ళు వచ్చాయి.

"బాధపడకు రూపా .... నిజంగానే నేను నాకు తెలిసి ఎలాంటి అన్యాయమూ చెయ్యలేదు. అయినా అతను నామీద పగబట్టాడంటే అది నా దురదృష్టం.... ఐతే అతను నా యెదురుగా వస్తే తను పొరపాటు పడ్డాడని సులభంగా గ్రహించగలడనే నమ్మకం నాకు వుంది."

"నిజమే డాడీ. నాకూ ఆ నమ్మకం వుంది. ఏమయినా మనం మన జాగ్రత్తలో వుండాలి. ఈ విషయాన్ని మనం పోలీసులకు తెలియజేయటం ఎంతయినా మంచిది" అన్నది రూప.

"అవును. ఇప్పుడే మనం ఇన్స్పెక్టర్ని కలుద్దాం"

అని లేచి నిల్చున్నాడు జనార్దనం.

రెండు నిమిషాల తర్వాత వాళ్ళిద్దరూ పోలీసుస్టేషన్ కు బయల్దేరారు.

## 5

ఇన్ స్పెక్టర్ జగన్ కారు దిగి లోపలకు వస్తున్న జనార్దనాన్నీ—రూపనీ చూసి "రండి....రండి" అని నవ్వుతూ లోపలకు ఆహ్వానించాడు.

ఇద్దరూ చెరో కుర్చీలో కూర్చున్న తర్వాత "చెప్పండి. మీరు యేదో అవసరమయిన పనిమీద నే వచ్చారని అను కుంటున్నాను" అన్నాడు జగన్.

"అవును ఇన్ స్పెక్టర్. ముఖ్యమైన విషయం చెప్ప టానికే వచ్చాం" అంటూ విషయాన్నంతా అతడికి వివరంగా చెప్పేశాడు జనార్దనం.

వెంటనే ఇన్ స్పెక్టర్ కొయ్యబారి పోయాడు.

ఒక్క నిమిషం తర్వాత "మై గాడ్...ఐతే మీరు నిజంగా నే గొప్ప ప్రమాదంలో వున్నారు" అన్నాడు.

"ఏమిటి ఇన్ స్పెక్టర్ మీర నేది?" అని అడిగింది రూప.

అప్పుడు జగన్ ఆ మనిషి రాజన్ భుజంలోకి కత్తిని దించి చేసిన గాయం గురించి వివరంగా చెప్పాడు.

భయంతో తండ్రీ కూతుళ్ళు మొహాలు చూసుకు న్నారు.

"రెండు కేసులూ ఒక్కటే—వర్ణ సుబట్టి మీ ఇద్దరినీ ఒకే వ్యక్తి హత్య చెయ్యటానికి కంకణం కట్టుకున్నాడు. ఇంతకీ మీకు పారిశ్రామిక వేత్త రాజన్ గారితో పరి చయం వున్న దా?" అనడిగాడు జగన్.

"లేదు. అతన్ని ఎప్పుడో యేదో మీటింగ్ లో ఒక్క

సారి చూశాను. అంతే" అన్నాడు జనార్దనం.

"వింతగా వుంది. ఇద్దరు అసిపరుల్ని ఓ యువకుడు ఎంతో ప్రతీకారంతో హత్య చెయ్యటానికి పూనుకున్నాడంటే నిజంగా ఇందుకు తగిన కారణం యేదో వుండే వుంటుంది. కాని మీరిద్దరు ఆ కారణాన్ని మరచిపోయి వుంటారు. ఒక్కసారి బాగా గుర్తుచేసుకోండి. ప్లీజ్" అన్నాడు జగన్.

"సారీ ఇన్‌స్పెక్టర్...ఎంత గుర్తుచేసుకున్నా నాకు ఏమీ గుర్తురావటంలేదు. నన్నో మనిషి హత్యచేసేంతటి ద్రోహాన్ని నేను ఎవరికీ చెయ్యలేదు" అన్నాడు జనార్దనం.

"ఆల్‌రైట్. అతను పొరపాటు పడ్డాడనే అనుకుందాం. అయినా మీరు మీ ప్రాణాలను గురించి ఎన్నో జాగ్రత్తలు తీసుకోవాలి. కొన్ని రోజులపాటు మీరు ఒంటరిగా ఎక్కడికీ తిరగకండి. కొత్త వ్యక్తులను పూర్తిగా చెక్ చేయించకుండా మీ ఇంట్లోకి రానివ్వకండి."

"నా జాగ్రత్తలు నేను తీసుకుంటాను. కాని నాకు కొన్నాళ్ళపాటు పోలీసు ప్రొటెక్షన్ కావాలి."

"గుడ్. అలాగే. ఈ రోజునించే రాత్రి యేడు గంటలనించి మీ ఇంటి బయట తెల్లవారేవరకూ ఓ కానిస్టేబుల్ కాపలా వుంటాడు. పగటిపూట మీరు జాగ్రత్తగా వుండండి."

"థాంక్‌యూ ఇన్‌స్పెక్టర్. యిప్పుడు నాకెంతో ధైర్యంగా వుంది. బయట ఓ పోలీసు మనిషి కాపలా వుంటే ఆ మనిషి లోపలకు రావటానికి ప్రయత్నం చేస్తాడని నేను అనుకోను. వెళ్ళొస్తాం" అని లేచి నిల్చు

న్నాడు జనార్దనం.

రూప కూడా నిల్చుంది.

వెళుతున్న వాళ్ళని చూసి భారంగా నిట్టూర్చాడు ఇన్ స్పెక్టర్ జగన్.

# 6

నాలుగు రోజుల తర్వాత—

తన ఇంట్లోనే బెడ్ మీద పడుకొనివున్నాడు రాజన్. ఆయన నీరసంనించి కోలుకున్నాడు కాని-అతనికి ప్రాణ భయంవల్ల బలహీనంగా కనపడుతున్నాడు.

అంతకుముందు రెండు రోజులక్రితమే ఇన్ స్పెక్టర్ జగన్ వచ్చి ఆ మనిషి పగబట్టడానికి కారణం యేమిటో చెప్పమని వేధించి వెళ్ళిపోయాడు.

ఇన్ స్పెక్టర్, రాజన్ తో—జనార్దనంకి వచ్చిన బెదిరింపు గురించి, అతను పోలీసు ప్రొటెక్షన్ అడిగిన విషయాన్ని కూడా చెప్పాడు.

రాజన్ ఆశ్చర్యపోక తప్పలేదు.

ఆ మనిషి లక్షాధికారి జనార్దనంమీద కూడా పగబట్టాడా? అతడిని కూడా చంపుతానని బెదిరించాడా?

ఇంతకీ అతను ఇలా పగబట్టడానికి కారణం యేమిటి?

ఎంత ఆలోచించినా రాజన్ కి గుర్తు రాలేదు. కాని యేదో ఓ కారణం వుండే వుంటుందని అతని అంతరాత్మ ఓ వైపు గొడవపెడుతూనే వుంది.

అయితే—యేమిటా కారణం?

రాజన్ విపరీతమైన ఆలోచనలలో మునిగిపోయినప్పుడే నౌకరు రంగన్న పైకి వచ్చాడు. అతడి చేతిలో రెండు ఉత్తరాలు వున్నాయి.

అందులో మొదటి ఉత్తరం ఎవరో ఓ స్నేహితుడి

దగ్గరినించి యేదో బిజినెస్ విషయమై రాసింది.

రెండో ఉత్తరం—

చదువుతుంటే రాజన్ చేతులు వణికాయి. అందులో ఈ విధంగా వున్నది.

డియర్ రాజన్

నువ్వు కొంచెం కోలుకున్న తర్వాత నే మళ్ళీ నీ దగ్గరకు రావాలనుకున్నాను. యిప్పుడు నీ ఆరోగ్యం కొంచెం మెరుగయిందనుకుంటాను. త్వరలోనే నా పదునైన కత్తి నీ శరీరంలో దిగబడుతుంది. నువ్వు ఎన్ని జాగ్రత్తలు తీసుకున్నా నా కత్తి దెబ్బనించి తప్పించుకోలేవు. ఇది నిజం. నువ్వు చెయ్యగలిగింది ఒక్కటే. అదే చావుకోసం ఎదురుచూడటం

డై—నీ పాలిట మృత్యువు.

సరిగ్గా అప్పుడే రాజన్ కొడుకు స్వరూప్ పైకి వచ్చాడు. తండ్రి చేతిలోని ఉత్తరాన్ని అతను కూడా చదివాడు.

"డర్టీ డెవిల్. ఈసారి వీడు ఈ ఇంట్లో అడుగు పెట్టాడంటే ప్రాణాలతో బయటకు వెళ్ళలేడు" అన్నాడు పళ్ళు కొరికి.

"స్వరూప్....నువ్వు వెంటనే వెళ్ళి ఇన్‌స్పెక్టర్ని కలుసుకో. అతనికి ఈ ఉత్తరం చూపించి నాకూ్కడా పోలీసు ప్రొటెక్షన్ యేర్పాటు చెయ్యమని చెప్పు" అన్నాడు.

తలవూపి స్వరూప్ వెళ్ళిపోయాడు.

రాజన్ మనసులో దేవుడ్ని ప్రార్థిస్తున్నాడు. ప్రాణభయం అతడిలో బయల్దేరింది. కళ్ళముందు పదునైన

అతడి చేతిలోని కత్తి కనపడుతోంది.

ఏమిటీ నరకం? అనుకున్నాడు జుట్టు పీక్కుంటూ—

# 7

రాత్రి — పదకొండు గంటలు దాటి పదినిమిషా లయ్యింది.

ఆ వరుసలో వున్న ఇళ్ళన్నీ నిద్రలోకి జారుకున్న ట్టుగా వున్నాయి.

అప్పటి వరకూ యేవో వ్యాపార సంబంధమైన ఎకౌంట్లు చూసుకున్న జనార్దనంకి నిద్ర ముంచుకువచ్చింది.

గోడకున్న గడియారంలో టైము చూసి గదిలోనించి బయటకు వచ్చి కంపౌండు హాలు పక్కనే నిలబడి బీడీ కాల్చుకుంటున్న కానిస్టేబులు దగ్గరకు వెళ్ళి అతడిని పలకరించాడు.

"మీరు భయపడవలసింది యేమీలేదు సార్, కన్ను ముయ్యకుండా కాపలా కాస్తున్నాను. ఈ నాలుగు రోజులనించి ఈ వీధిలోకి రాత్రిపూట ఎవ్వరూ రాలేదు. తలుపులు బిగించుకొని హాయిగా పడుకుని నిద్రపోండి" అన్నాడు కానిస్టేబుల్ కనకయ్య.

"నువ్వు అలా ధైర్యం చెబితే చాలు. ఎందుకైనా మంచిది—నువ్వు బాగా ఎలర్టుగా వుండు. అతను సాధారణమైన మనిషి కాదు. పగబట్టిన పాము. యేదోవిధంగా ఇంట్లోకి ప్రవేశించే ప్రయత్నం చేస్తాడు. నువ్వు ఇక్కడ కాపలా వున్నావనే ధైర్యంతోనే నేను వెళ్ళి పడుకుంటున్నాను" అని లోపలకు వెళ్ళిపోయాడు జనార్దనం. నవ్వుకున్నాడు కానిస్టేబులు.

మనుషులకు ప్రాణభయం ఎక్కువగా వుండటం కూడా మంచిదే. అతడికి రోజూ ఉదయమే జనార్దనం నిద్ర

పోకుండా కాపలా వున్నందుకు బాగానే డబ్బులు ఇస్తున్నాడు.

'పాపం.... ఈ లక్షాధికారి ఎంత భయపడుతున్నాడో' అనుకున్నాడు.

తలుపులన్నీ బిగించి పడుకున్న అరగంటలోనే జనార్దనంకి గాఢమైన నిద్రపట్టింది.

అప్పటివరకు ఆ గదిలో వున్న పెద్ద బీరువా వెనుకనే నిలబడి వున్న అతను చిన్నగా బయటకు వచ్చి—ప్రశాంతంగా నిద్రపోతున్న జనార్దనంని చూసి నవ్వుకున్నాడు.

జేబులోనించి చిన్న సీసా తీసి కర్చీఫ్‌మీద అందులోని మత్తుమందును వంచి జనార్దనం ముక్కు దగ్గర కొంచెంసేపు వుంచాడు.

రెండు నిమిషాల తర్వాత అతడిని అటూ ఇటూ కదిలించాడు. కాని జనార్దనం కదలలేదు. అతడికి స్పృహ పోయిందని అనుకున్న తర్వాత జేబులోనించి నైలాన్ తాడును తీసి అతడిని బెడ్‌కేసి గట్టిగా బిగించాడు కొంచెం కూడా కదలటానికి వీల్లేకుండా.

తర్వాత అతడి నోటికి పూర్తిగా గమ్‌టేప్ అంటించాడు.

పది నిముషాలు గడిచాయి.

అప్పుడు మరో బాటిల్లోని ద్రవాన్ని జనార్దనంకి వాసన చూపించి స్పృహ తెప్పించాడు.

చిన్నగా కళ్ళు తెరిచి యెదురుగా వున్న అతడిని చూసి భయపడిపోయాడు జనార్దనం. అరవబోయాడు. కాని సాధ్యం కాలేదు. చిన్నగా మూలిగాడు. కాని ఆ మూలుగు బయటకు రాలేదు.

"భయపడు....ఆ తర్వాత చావుకి సిద్ధపడు. బయట పోలీసు మనిషి కాపలావున్నా నేనెలా లోపలకి వచ్చానని ఆశ్చర్యపోతున్నావు కదూ? పగబట్టిన పామును ఎవ్వరూ ఆపలేరు జనార్దనం. నేనే నీ పాలిట మృత్యువును. నా నించి తప్పించుకోటం నీకు సాధ్యం కాదు."

అతడి మాటలు వింటున్నప్పుడు జనార్దనం కళ్ళు భయంతో నిండిపోయాయి. తనని చంపవద్దంటున్నట్టు అతనికేసి ప్రాధేయపడుతున్నట్టు చూశాడు.

అతను నవ్వి, "నువ్వు దుర్మార్గుడివి....జాలి—దయ లేని మనిషివి....నీలాంటి నీచుడిని చంపకుండా వదలను. నీకు చావు తప్పదు....అయితే యిప్పుడే కాదు. నిన్ను హింసించి మరీ చంపుతాను...." అంటూ జేబులోనించి ఓ చిన్న సీసా తీశాడు.

దాన్ని చూడగానే భయంగా అటూ ఇటూ కదిలాడు జనార్దం.

అతను నవ్వుతూ ఆ బాటిల్‌కి వున్న మూత తీసి అందులో వున్న యాసిడ్‌ని జనార్దనం కుడిచేతిమీద వంచేశాడు.

అంతే. జనార్దం ఎగిరిపడ్డాడు.

యాసిడ్ అతడి చేతిని ముత్తం కాల్చివేసింది. బుస బుసమని పొంగింది. సన్నని పొగ పైకి లేచింది. చేతిమీది చర్మమంతా వుడికిపోయింది.

బాధతో విలవిల్లాడిపోయాడు. కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. మొహంలో బాధ స్పష్టంగా అగుపడింది.

జనార్దనం మెలికలు తిరిగిపోవటాన్ని చూసి నవ్వాడు అతను.

"ఎలావుంది జనార్దనం? బావుందా? బాగా బాధగా

వుందా? అవును ...అలాగే వుంటుంది....నువ్వు ఈ గాయంనించి కోలుకునే లోపలే నిన్ను అంతం చేస్తాను....చావు కోసం యెదురుచూస్తుండు" అంటూ చిన్నగా తలుపు తెరుచుకుని బయటకు వెళ్ళిపోయాడు అతను.

ఇంకా జనార్దనం చెయ్యి కాలుతూనే వుంది.

అతను ఇంటి వెనకవైపున వున్న గోడమూకి సందులో నించి చీకట్లో కలసిపోయాడు.

# 8

"మైగాడ్....ఎంత ఘోరం జరిగిపోయింది! ఇంత దారుణం జరుగుతుంటే మా కానిస్టేబులు ఏం చేస్తున్నాడు" అన్నాడు ఇన్‌స్పెక్టర్ జగన్ రావటంతోనే—

బాధగా కళ్ళు తెరిచాడు జనార్దనం.

"సారీ....బయట పోలీసుమనిషి కాపలా వున్నా ఆ ఇడియట్ వచ్చి మిమ్మల్నిలా బాధ పెడతాడని నేను కల్లో కూడా వూహించలేదు...."

"చెయ్యి చాలా ఘోరంగా కాలిపోయింది. చాలా శక్తివంతమయిన యాసిడ్‌ను వుపయోగించాడు ఆ వ్యక్తి. ఇంకా నయం మొహంమీద చల్లలేదు. గొప్ప ప్రమాదం తప్పిపోయింది" అన్నాడు డాక్టరు నిరంజనం.

రూప అక్కడే వున్న కుర్చీలో కూర్చుని సన్నగా యేడుస్తోంది....దుఃఖంతో ఆమె గుండెలు యెగిరిపడుతున్నాయి.

"ప్లీజ్....యేడవకండి....ఒక్కోసారి మనం నిమిత్త మాత్రులుగానే వుండిపోవాలనిపిస్తూ వుంటుంది....ఇక ఆ మనిషి మీ నాన్న దగ్గరికి రాకుండా అవసరమయిన చర్యలన్నీ తీసుకుంటాం....బాధపడకండి" అన్నాడు ఇన్

స్పెక్టర్—రూపను ఓదారుస్తూ—

"హు....ఏం పోలీసులు మీరు? పోలీసులు కాపాలా వున్నప్పుడే హంతకులు ఇలా తిరుగుతుంటే ఇంకా పోలీసులు ఎందుకు? ఇలా ఏడుస్తున్న మనుషులను ఓదార్చటానికా?" అన్నది రూప విసురుగా.

"మిస్ రూపా....మీ కో విషయాన్ని గుర్తించాలి. పోలీసులు కూడా మీలాంటి మనుషులే....కాని ప్రభుత్వం ఇచ్చిన కొన్ని బాధ్యతల దృష్ట్యా వాళ్ళు సాధారణమైన మనుషుల కంటె ధైర్యంగా వుంటారు. ఒక్కో సారి దొంగతనాలు—హత్యలు చేసే మనుషులు పోలీసుల కంటే తెలివైనవాళ్ళు—బలవంతులు వుంటారు. ఇప్పుడు అలాగే జరిగింది. ఆ మనిషి ఎవరో తెలివైనవాడు....అందుకే మా కానిస్టేబుల్ కళ్ళు కప్పి లోపల ప్రవేశించి మీ నాన్నను యిలా గాయపరిచాడు. వినా అసలు మనుషులు మాతో సహకరించకపోతే మేము ఏం చెయ్యగలం?" అన్నాడు విచారంగా.

"అంటే మీ ఉద్దేశం ఏమిటి?"

"ఆ వ్యక్తి కి మీ నాన్నమీద పగబట్టటానికి—హత్య చెయ్యాలని అనుకోటానికి ఏదో బలమైన కారణం వుండి వుండాలి. అదేవో నాతో చెబితే హంతకుడిని పట్టుకోవటం సులభమవుతుంది....కాని జనార్ధనంగారు మాకు ఏమీ చెప్పటంలేదు" అన్నాడు.

"ఈ విషయమే ఆశ్చర్యంగా వుంది. నాన్నను ఈ విషయం గురించి నేను యెంతగానో అడిగాను. కాని ఆయన తనకు తెలిసి యే కారణమూ లేదని అంటున్నాడు ఇన్‌స్పెక్టర్."

"కాదు, నా అనుమానం ఆయన చెప్పటంలేదని....

ఏదో బలమయిన సంఘటన జరిగివుండనిదే ఓ మనిషి మరో మనిషిని చంపాలని అనుకోడు. అంత కసి అతడికి ఎందువల్ల యేర్పడింది.... అందుకు తగిన కారణమే వుండి వుంటుంది. కాని జనార్దనంగారు మనకు చెప్పటంలేదు" నిట్టూర్చాడు ఇన్‌స్పెక్టర్.

జనార్దనం అందరి మాటలూ వింటూనే వున్నాడు. అయినా అతడికి మాట్లాడే ఓపిక లేదు. రాత్రి షాక్ నించి అతను ఇంకా పూర్తిగా తేరుకోలేదు. అతడిలో భయం కొంచెం కూడా తగ్గలేదు. అందుకే మవునంగా వుండిపోయాడు.

"ఇంకో విషయం....పారిశ్రామిక వేత్త రాజన్ గారికి ఆ మనిషి త్వరలోనే వచ్చి చంపుతానని ఓ బెదిరింపు ఉత్తరం కూడా రాశాడు. దాన్నిబట్టి అతను ఎంత సిన్సియర్‌గా వున్నాడో అర్థమవుతోంది. అతని ధ్యేయం ఒక్కటే అనుకుంటాను—ఈ యిద్దరినీ హత్య చెయ్యటం" చెప్పాడు జగన్.

# 9

అతను అక్కడే నిలబడి వున్నాడు. ఎక్కడంటే— మొదటిసారిగా అతను రాజన్ కోసం వచ్చినప్పుడు యే లైటు స్తంభం వెనుక వున్న నీడలో నిల్చున్నాడో— అక్కడే!

అప్పుడు కూడా సమయం పన్నెండు గంటలు కావస్తోంది. అతడి పాదాలకు చప్పుడు చెయ్యని మెత్తని బూట్లు వున్నాయి.

అతడి కళ్ళు ఎర్రగా వున్నాయి.

జరిగినదంతా తల్చుకుంటే అతడి గుండె మండిపోతోంది.

దుర్మార్గులు....

ఇంకా వీళ్ళని బతకనివ్వకూడదు.

అతడి పిడికిళ్ళు బిగుసుకున్నాయి.

ప్యాంటు జేబులోకి చేతిని పోనిచ్చి కత్తిని బయటకు తీశాడు. ఒక్కసారి దానికేసి చూసి "నీకు కొన్ని నిము షాల్లో ఆహారం దొరకబోతుంది" అన్నాడు తనలోతనే—

తర్వాత దాన్ని మళ్ళీ జేబులో పెట్టుకుని గోడ మీదుగా రాజన్ ఇంట్లోకి దూకాడు.

ఎదురుగా వున్న ముందు గదిలో ఇద్దరు మనుషులు కూర్చుని బాగా మందు కొడుతున్నారు.

ఆ ఇద్దర్లో ఒకడు—రాజన్ కొడుకు స్వరూప్. రెండోవాడు కిరాయి గూండా.

వాడిని స్వరూప్ తన తండ్రికి అంగరక్షకుడుగా తీసుకువచ్చాడు. పోలీసులమీద నమ్మకం పోవటంతో స్వరూప్ యీ ఏర్పాడు చేశాడు.

ఆ కిరాయిగూండా బాగా బలిసిన ఎద్దులా—సీమ పందిలా వున్నాడు. ఎత్తుగా పైకిలేచిన జుట్టు—చారల పట్టుతో భయంకరంగానే వున్నాడు. వాడు డబ్బు కోసం యే పనయినా చేస్తాడు. యెన్నోసార్లు జైలుకు కూడా వెళ్ళి వచ్చాడు.

ఇంతకీ వాడి పేరు వీరేశం.

వాడిని చూసి నవ్వుకున్నాడు అతను.

నిజానికి వాడితో తలపడి తాను గెలవలేడు. అందుకే వీలున్నంతవరకు వాడి కంట పడకుండానే తన పని ముగించుకోవాలి.

అందుకే వాడు బాగానే సహకరిస్తున్నాడు. మందు లేనిదే ఆ వీరేశం నిమిషం కూడా వుండలేడు.

స్వరూప్ కూడా వాడి మనసు తెలుసుకొని కావలసి నన్ని సీసాలను అక్కడ యేర్పాటు చేశాడు.

కాని పీకలవరకూ తాగితే మెదడు పని చెయ్యదనీ—నిద్రపోవటమే జరుగుతుందని వాళ్ళిద్దరు మరచిపోయినట్టున్నారు.

కొన్ని క్షణాలు నవ్వులతో—గ్లాసులు నింపుకోవటంతో గడిచిపోయాయి.

కాని—మరి కొంత సమయం గడిచేసరికి యిద్దరూ సీసాలన్నీ ఖాళీ చేసి ఒకరిమీద ఒకరు పడి నిద్రపోయారు.

అప్పుడు అతను నవ్వుకుని హుషారుగా ముందుకు నడిచి ఒక్క గెంతులో గోడదూకి లోపల ప్రవేశించాడు.

గబగబా మెట్లెక్కి పైకి చేరుకున్నాడు.

గదిలో నిద్రపోతున్నాడు రాజన్.

తలుపులను నెట్టిమూశాడు. లోపల బోల్టు వేసి వున్నాయి.

ఒక్క నిముషం అక్కడే నిలబడి అటూ యిటూ చూశాడు. అతనికి చువ్వలు లేని పొడుగాటి అద్దాల తలుపులున్న కిటికీలు కనిపించాయి.

వాటి దగ్గరగా నడిచాడు. జేబులోనించి అద్దాలను కోసే రవ్వను తీశాడు.

ఐదు నిముషాల తర్వాత ఓ అద్దాన్ని కోసి చప్పుడు అవకుండా తీశాడు.

క్షణంలో ఆ గదిలోకి వెళ్ళాడు అతను.

నిద్రలో రాజన్ గుండె ఎగిరిపడుతోంది. హాయిగా నిద్రపోతున్నాడు—బయట తనని కాపాడే కిరాయి గూండా వున్నాడనే ధైర్యంతో—

కాని అతడి యెదురుగా యిప్పుడు ప్రత్యూవు నిలబడి వున్నది.

అతను జేబులోనించి కత్తిని బయటకు తీశాడు. సన్నగా పడుతున్న దీపం కాంతిలో తళతళమని మెరిసింది పదునైన కత్తి—అది వేడివేడి రక్తంకోసం ఎదురు చూస్తున్నట్టు వుంది.

ముందుకు వొంగాడు.

చటుక్కున రాజన్ నోటిని అరచేత్తో మూశాడు—

ఉలిక్కిపడి పళ్ళు తెరిచాడు రాజన్—

ఎదురుగా—యముడిలా అతను.

అతని చేతిలో విసురుగా పైకి లేచిన పొడుగాటి కత్తి.

రాజన్ పెద్దగా ఆర్తనాదం చెయ్యబోయాడు భయంతో—

కాని—అతని ఆర్తనాదం బయటకు రాకముందే విసురుగా పైకిలేచిన కత్తి అతడి గుండెల్లోకి పిడివరకు దిగిపోయింది.

ఒకే ఒక్క పోటు—

రాజన్ అరవకుండానే—చిన్న మూలుగుతో తల వాల్చేశాడు. అతడి ప్రాణం ఎటో ఎగిరిపోయింది.

నెత్తురు విసురుగా పైకి చిమ్మింది.

క్షణం తర్వాత అతను కత్తిని బయటకు లాగి రాజన్ కప్పుకున్న దుప్పటికి నెత్తురును పూర్తిగా తుడిచి "రాజన్....ఇప్పుడు నా తండ్రి ఆత్మ శాంతిస్తుంది" అని రాజన్ గొంతువరకు దుప్పటి కప్పి కత్తిని ప్యాంటు జేబులో పెట్టుకుని బయటకు వచ్చాడు.

గోడ దూకుతుంటే ముందు గదిలో రాజన్ ప్రాణా

లను కాపాడటానికి వచ్చిన కిరాయి గూండా గురక విన పడుతోంది అతనికి—

# 10

"ఇప్పుడు టైమెంతయ్యింది?" అడిగాడు కానిస్టేబులు డ్యూటీలో వున్న నర్స్‌ని.

"ఎందుకు? టైముతో నీకేమిటి పని? నిద్రవస్తోందా?" అన్నది నర్స్ నవ్వుతూ—

"నిద్రా....ఎదురుగా నువ్వు కనపడుతుంటే నిద్ర వస్తుందా నర్సమ్మా...." అన్నాడు చిలిపిగా కానిస్టేబులు అన్నారావు.

ఇన్‌స్పెక్టర్ జగన్—కావాలని అన్నారావు బాగా డ్యూటీ చేస్తాడని హాస్పిటల్లో జనార్దనంకి కాపలా వుంచాడు.

అన్నారావు బాగానే డ్యూటీ చేస్తాడు కాని— అతనికి వయసులో వున్న ఆడదాన్ని చూస్తే మనసు నిలవదు.

నర్స్ నవ్వి "పోలీసు ఉద్యోగమంటే కాపలా కాయటమేనా జీవితాంతం?" అని అడిగింది.

"అవును. నీలాంటి అందమైన నర్స్‌లను చూస్తూ జీవితాంతం కాపలా కాయటం అంత కష్టమైన పనికాదు...." అన్నాడు కన్ను గీటుతూ—

ఆ సమయంలో వాళ్ళిద్దరే అక్కడ మెలకువగా వున్నారు.

"అంత అందంగా వున్నానా నీ కళ్ళకు?"

"నా కళ్ళకే కాదు....అందరి కళ్ళకి నువ్వు అందంగానే వుంటావు. ముందు టైమెంతయ్యిందో చెప్పు...." అన్నాడు.

కుడిచేతికి వున్న వాచీ చూసుకుని "ఒంటిగంట దాటు తోంది" అన్నది.

"ఒంటిగంటా....అయితే ఇక ఇవ్వాల్టికి జనార్దనం గారికి ఎలాంటి ప్రమాదమూ లేదు" అన్నాడు.

"అదేమిటి?" అన్నది నర్స్.

"అదంతే....ఎక్కువగా హత్యలన్నీ రాత్రి ఒంటిగంట లోపలే జరుగుతూ వుంటాయి. ఇదొక రూలు. తర్వాత హంతకులైనా నిద్ర పోవాలి కదా?....అందు వల్ల నువ్వు ముందు వెళ్ళి జనార్దనంగారు ఎలా వున్నారో ఒకసారి చూసిరా" అన్నాడు సిగరెట్టు ముట్టిస్తూ రక్షక భటుడు.

నర్స్ వెళ్ళి రెండు నిముషాల్లోనే తిరిగివచ్చి "ఆయన నువ్విక్కడ కాపలా వున్నావనే ధైర్యంతోనే బాగా నిద్రపోతున్నాడు....తలుపులు మూసి బయట గడియ పెట్టి వచ్చాను" అన్నది.

"గడుసుదానివే....అయితే పద" అన్నాడు కానిస్టే బులు.

"ఎక్కడికి?" అన్నది ఆమె కొంటెగా నవ్వుతూ.

"మన ప్రణయ సామ్రాజ్యాన్ని ఏలటానికి." అన్నా డతను ఆమె భుజంమీద చెయ్యి వేసి.

ఒక్క నిమిషంలో వాళ్ళిద్దరు ఆ హాస్పిటల్ వెనుక వైపుకు వెళ్ళిపోయారు.

అప్పటివరకూ గోడదగ్గర నిల్చున్న అతను వాళ్ళటు వెళ్ళగానే గోడ దూకి లోపలకు వచ్చాడు—మాటు వేసిన పులిలా.

వరండాలో కొంచెం దూరం నడిచి గడి వేసివున్న

తలుపుల ముందు ఆగిపోయాడు.

అతని షర్టుమీద, ప్యాంటుమీద నెత్తురు మరకలు వున్నాయి. అతడి జుట్టు చిందర వందరగా వుంది.

గడియతీసి తలుపులు తెరిచి పిల్లిలా లోపలకు నడిచాడు.

వెల్లకింతలా పడుకుని నిద్ర పోతున్నాడు జనార్దనం.

నిమిషంసేపు అతడికేసి చూశాడు.

వెంటనే అతడిచేతిలో తళతళ మెరిసే కత్తి ప్రత్యక్షమయ్యింది.

ఒకచేతో జనార్దనం నోరునొక్కి విసురుగా కత్తిని అతడి గుండెల్లోకి దించేశాడు పిడివరకు—

ఒక్క పోటు—

జనార్దనం ప్రాణం నిద్రలోనే గాల్లో కలిసి పోయింది....

"ఈ హత్య నా తల్లి ఆత్మ శాంతికోసం" అని కత్తి తీసి అతడికూడా గొంతువరకు దుప్పటి కప్పి బయటకు వచ్చేశాడు అతను తలుపులను మూసి గడియపెట్టి—

# 11

తెల్లవారింది—

ఒకే రాత్రి....రెండు హత్యలు.

నగరంలో ఈ వార్త గొప్ప సంచలనాన్ని లేవదీసింది. ఇన్‌స్పెక్టర్ జగన్‌కు ఐతే నిజంగా మతి పోయింది.

ఆ మనిషి యింత అర్జంట్‌గా ఒక్క రాత్రిలోనే రెండు హత్యలను అవలీలగా చేస్తాడని కొంచెం కూడా వూహించలేదు.

రెండు శవాలనూ మార్చురీకి పంపించాడు జగన్.

అప్పటికి మధ్యాహ్నం ఒంటిగంటయ్యింది.

రెండు హత్యలూ ఒకే కత్తితో, ఒకే విధంగా జరిగాయి.

హంతకుడు తనని పట్టుకోటానికి అవసరమయిన యే ఒక్క ఆధారాన్నీ వదలకుండా వెళ్ళిపోయినందుకు ఇన్‌స్పెక్టర్‌కి ఎంతో విచారం కలిగింది.

మొత్తానికి అతను తన పగ సాధించాడు.

సాయంత్రం నాలుగు గంటలకు ఇన్‌స్పెక్టర్ పోలీసు స్టేషన్‌కు వెళ్ళేసరికి అతడికోసం యెదురుచూస్తూ ఓ మనిషి కూర్చుని కనిపించాడు.

"ఎవరు మీరు? ఏం పనిమీద వచ్చారు?" అని అడిగాడు విసుగ్గా.

అతను అదోలా నవ్వి "నా పేరు విద్యాసాగర్. రాజన్‌నీ—జనార్దనంనీ హత్యచేసిన మనిషి నేనే.... నా అంతట నేనే మీకు లొంగిపోవాలని వచ్చాను" అన్నాడు ఎంతో సౌమ్యంగా.

ఆ మాటలు వినగానే కుర్చీలో పెద్ద బాంబు పేలినట్టు ఎగిరిపడ్డాడు ఇన్‌స్పెక్టర్ జగన్.

ఆశ్చర్యంగా అతడికేసి చూశాడు.

సన్నగా—పొడుగ్గా వున్నాడు. నీటుగా దువ్వుకున్న జుట్టు....నిర్మలంగా వున్న కళ్ళు.

"ఏమిటీ....మీకేమైనా మతిపోయిందా? లేకపోతే జోక్ చేస్తున్నారా?" అని అడిగాడు జగన్.

"మతిపోలేదు. మతి సరిగా వుండబట్టే ఆ రాక్షసులిద్దరినీ చంపగలిగాను. ఇది నిజం. ఇదిగో చూడండి. ఈ కత్తితోనే ఆ ఇద్దరి గుండెల్లో పొడిచి చంపాను" అంటూ ప్యాంటు జేబులోనించి పొడుగాటి కత్తిని తీసి

ఇన్ స్పెక్టర్ కు చూపించాడు.

అప్పుడు జగన్ నమ్మక తప్పలేదు.

"మీరు ఎందుకీ హత్యలు చేశారు?" అన్నాడు నిమిషం తర్వాత.

"చెబుతాను. నిజానికి ఆ ఇద్దరినీ ఎందుకు హత్య చేసిందీ వాళ్ళకు కూడా చెప్పలేదు. నేనెవరో వాళ్ళకు తెలీను కూడా — బహుశా వాళ్ళు చేసిన ఘోరాలను వాళ్ళు యెప్పుడో మరచిపోయి వుండాలి. ఇక నా కథ చెబుతాను.

నా తండ్రి ఉదయగిరి జమీందారు దగ్గర పనిచేసే వాడు. ఒకసారి యెవరో కొంతమంది దుండగులు ఆ ఆ జమీందారును హత్యచేసి అయన దగ్గర వున్న ఎంతో విలువైన వజ్రాల్ని దోచుకున్నారుట. ఆ మనుషుల్లో నా తండ్రి కూడా వున్నాడనే వదంతి బయటకొచ్చింది.

ఈ విషయం తెలిసిన మా నాన్న నన్ను మా అమ్మను తీసుకొని ఉదయగిరినించి పారిపోయాడు. ఆ రాత్రి మేము ఓ పాడుబడిన ఇంట్లో పడుకున్నాము.

ఒక రాత్రివేళ నాకు మెలకువ వచ్చి చూస్తే మా అమ్మ—నాన్న కనిపించలేదు. అప్పుడు నా వయసు ఏడేళ్ళు. ఎంత వెతికినా వాళ్ళు ఏమయ్యారో అర్థం కాలేదు. బహుశ జమీందారు మనుషులు వాళ్ళను ఎత్తుకుపోయి వుంటారని అనుకున్నాను.

ఆ తర్వాత నేను గాలికి పెరిగాను. చిన్న చిన్న పనులు చేసుకుంటూ డబ్బులు సంపాదించి చదువు కున్నాను. ఐనా నిరంతరం నేను నా తల్లిదండ్రుల కోసం వెతుకుతూనే వున్నాను.

నా అదృష్టం. నెల రోజుల క్రితం ఈ ఊళ్ళోనే

చావు బతుకుల్లో వున్న నా తల్లి కనపడింది. నేనెంతో సంతోషపడిపోయాను. ఆమె జరిగిన కథనంతా కన్నీళ్ళతో నాకు చెప్పి నా ఒడిలోనే కన్ను మూసింది. ఆమె యేనాటికయినా నేను కనపడతానని తనకు జరిగిన అన్యాయానికి ప్రతీకారం తీర్చుకొనేలా చెయ్యాలనే బతికి వుంది.

మా అమ్మ నాకు జరిగిన కథనంతా చెప్పింది. రాజన్ తన మనుషులతో వచ్చి మా నాన్నను అమ్మను బంధించి తీసుకుపోయి యెక్కడో రహస్యంగా దాచి, మా నాన్నను ఆ జమీందారు దగ్గర దొంగిలించిన వజ్రాలు ఎక్కడ దాచారో చెప్పమని హింసించాడుట. తనకే పాపమూ తెలీదన్నాడుట మా నాన్న. కాని ఆ దురాత్ముడు వినకుండా మా అమ్మను—నాన్నను ఎన్నో చిత్రహింసలు పెట్టాడుట. చివరకు ఆ హింసలతోనే మా నాన్న చనిపోయాడుట.

మా అమ్మ ఎలాగో అక్కడినించి తప్పించుకొని కొన్నాళ్ళ తర్వాత అక్కడా అక్కడా పనులు చేసుకొని బతుకుతూ చివరకు జనార్ధనం ఇంటికి చేరిందట. ఆ నీచుడు ఒకరోజు యెవ్వరూ లేని సమయం చూసి ఆమెను బలవంతంగా పశువులా నాశనం చేశాడుట.

నా తల్లి చెప్పినదంతా వినగానే నాలోని రక్తమంతా సలసల మరిగిపోయింది. నా తల్లిదండ్రులకు అంత ఘోరమైన అన్యాయం చేసిన ఆ ఇద్దరినీ ఆ క్షణంలోనే చంపాలనుకున్నాను. నా తల్లి కూడా ఆ ఇద్దరిమీదా పగ సాధించమని చెప్పి కళ్ళు మూసింది. అందుకే ఆ నరరూప రాక్షసులను ఘోరంగా నా కత్తిపోటుకు గురిచేసి చంపాను.

నా మనస్సాక్షికి నేను నిర్దోషినే ఐనా చట్టం దృష్టిలో నేను నేరస్థుడిని. నన్ను మీరు పట్టుకోలేరని నాకు తెలుసు.

నా పగ చల్లారింది. ఇక నాకు ఈ ప్రపంచంలో నా మనుష్యులంటూ యెవ్వరూ లేరు. అందువల్ల నా బ్రతుకును గురించి నాకు దిగులేదు. జీవితంమీద ఆశలేదు. బహుశా నాకు ఉరిశిక్ష పడుతుందని అనుకొంటాను. ఉరి కంబం ఎక్కటానికి నేను సిద్ధంగానే వున్నాను" అన్నాడతను వస్తున్న కన్నీళ్ళను తుడుచుకుంటూ.

—: అ యి పో యి ం ది: —

# ప్రాణమిత్రులు

## టెంపోరావ్

మోహన్ కారును శరవేగంగా పోనిస్తున్నాడు. నాగరాజు వెనక్కి చూస్తున్నాడు. పోలీసు జీప్ వెనకనే వస్తోంది.

పట్నందాటి ట్రంక్ రోడ్డమ్మట కారు దూసుకుపోతోంది. రోడ్డుకి యిటూ, అటూ అడవి ప్రదేశం.

"వాళ్ళు మన్ని వదుల్తారనే నమ్మకం లేదు నాకు!" అన్నాడు నాగరాజు.

"కారులో ఎక్కువగా పెట్రోలు లేదు. ఎంతదూరం వెళ్ళగలమో!" అన్నాడు మోహన్.

"మోహన్, మనం ఏదో చేస్తేగాని యీ డబ్బు మనకు దక్కదు. ఈ బాగ్ పట్టుకొని, దిగి, నువ్వు అడవిలోకి పారిపో! నేను కారును పోనిస్తాను. వాళ్ళు యీ కార్ని వెంటాడతారు. నేను దొరికిపోయినా ఫరవా లేదు. డబ్బు నీ చేతిలో వుంటుంది. తర్వాత మనం పంచుకోవచ్చు!" అన్నాడు నాగరాజు.

"నాగా, నీది గొప్ప హృదయం. నువ్వు దిగి అడవి లోకి పారిపో! వాళ్ళను నేను ముప్పతిప్పలు పెడ్తాను" అన్నాడు మోహన్.

"అలాగే చేద్దాం. నీ డబ్బు నా దగ్గర భద్రంగా వుంచుతాను."

"నా కుటుంబాన్ని కూడా నువ్వు జాగ్రత్తగా చూసుకోవాలి!"

"మోహన్, మనం ప్రాణస్నేహితులం. అంతా నేను చూసుకుంటాను" అన్నాడు నాగరాజు.

సడన్ బ్రేకుతో మోహన్ కారు ఆపాడు. నాగ రాజు బాగ్‌తో సహా కిందికి దూకాడు. కారు దూసుకు పోయింది.

అడవి ప్రదేశంలోని చెట్లమధ్యకు నాగరాజు పరు గెత్తాడు. పోలీస్ జీప్ ఆగింది.

"ఎవరో యిక్కడ దిగినట్లున్నారు!" అన్నాడు జీప్ నడుపుతూన్న కాన్‌స్టేబుల్ రామన్.

"వాడికోసం యీ అడవిలో ఎక్కడ వెతుకుతాం? ఆ కార్ను ఆపి, వాడిని పట్టుకుంటే అంతా తెలిసిపో తుంది. జీప్ పోనీ, క్విక్!" అర్చాడు యిన్‌స్పెక్టర్ కాండ్.

జీప్ ముందుకు దూసుకుపోయింది. కారు నడుపు తూన్న మోహన్ రియిర్ వ్యూ అద్దంలో చూస్తున్నాడు. జీప్ దగ్గరకొస్తోంది.

"స్టాప్! టైర్లు షూట్ చేస్తాం!" అర్చాడు యిన్ స్పెక్టర్ కాండ్ లౌడ్‌స్పీకర్ ద్వారా.

కాని మోహన్ ఆపలేదు. తెగించి తనూ, నాగరాజూ పట్టపగలు యిండియన్ బ్యాంకిని రెయిడ్ చేసి డబ్బుతో

బయటపడ్డారు. ఆ బ్యాగ్‌లో ఎంతుందో మోహన్‌కి తెలియదు. కాని పెద్ద మొత్తం వుంటుందని అతడి అంచనా. ఇటువైన యే దోపిడీ చేయకుండా తనూ, నాగరాజూ సుఖంగా జీవించవచ్చు!

ఇన్‌స్పెక్టర్ బాండ్ చేతిలోని పిస్టల్ భయంకరంగా ధ్వనించింది. మోహన్ ఉలిక్కిపడ్డూ యాక్సిలేటర్ని తొక్కాడు. కారు వెనుకనున్న గ్లాసు పగిలి ముక్కలైంది. మోహన్ కారు విమానంలా పోతోంది.

కాని ఎక్కువ దూరం అతడు పోలేక పోయాడు. కారు టాంక్‌లోని పెట్రోలు అయిపోయింది. నిస్సహాయంగా అతడు పోలీసులకు లొంగిపోవలసి వచ్చింది.

ఇన్‌స్పెక్టర్ బాండ్ అతడి చేతులకు బేడీలువేశాడు.

"నీతో వుండే వ్యక్తి ఎక్కడకు పోయాడు?" అడిగాడు ఇన్‌స్పెక్టర్.

"నాకు తెలియదు" అన్నాడు మోహన్.

"అతడి పేరు?"

"సుబ్బరాజు."

"అడ్రెసు?"

"నాకు తెలియదు. అతడూ, నేనూ తాజ్‌లో గీతా హోటల్లో కల్సుకొనే వాళ్ళం" అన్నాడు మోహన్.

అతడివైపు ఇన్‌స్పెక్టర్ బాండ్ కోపంగా చూశాడు.

"డబ్బున్న బాగ్ పట్టుకొని అతడు పారిపోయాడు. అతడు తెలివైనవాడు. నిన్ను జైలుకి తోసేసి వాడు సుఖంగా వుంటాడు!" అన్నాడు బాండ్.

మోహన్ మాట్లాడలేదు. తననీ, నాగరాజునీ శత్రువులుగా చేయాలని యిన్‌స్పెక్టర్ ప్రయత్నం చేస్తున్నాడు. కాని అతడు నెగ్గలేదు. తనూ, నాగరాజు

ప్రాణమిత్రులు!

"స్టేషన్‌కి వెళ్ళాక తోలు ఒల్చి వీడిని మాట్లాడిస్తాను, పదండి" అన్నాడు యిన్‌స్పెక్టర్.

మోహాన్ని జీప్‌లో కూర్చోబెట్టి కాన్‌స్టేబుళ్ళు అతడి యిరువైపులా కూర్చున్నారు.

జీప్ పట్నంవైపు వెళ్ళిపోయింది.

## 2

లాకప్‌లో వున్న మోహాన్ని మాట్లాడించడానికి యిన్‌స్పెక్టర్ శాండ్ శతవిధాల ప్రయత్నించాడు. కాని మోహన్ మాట్లాడలేదు.

పోలీసు జీప్‌లో మోహాన్ని యిండియన్ బ్యాంకికి తీసుకెళ్ళారు. అక్కడి మేనేజర్, గుమస్తాలు మోహాన్ని పోల్చారు.

"కాషియర్ మూర్తి ఎదిరిస్తే ఇతడే అతడిని కత్తితో పొడిచాడు" అన్నాడు మేనేజర్.

"అవును, సార్, యితడే" అన్నాడొక గుమస్తా.

మోహన్ మళ్ళా లాకప్‌లో వుంచబడ్డాడు. పోలీసు లాకప్‌లో వున్న మోహాన్ని చూడ్డానికి అతడి భార్య సుమిత్ర వచ్చింది.

వూచల బయట నిలబడి ఆమె అతడివైపు ఏడుస్తూ చూసింది. అతడామెవైపు సూటిగా చూశాడు. సమీపంలో ఎవ్వరూ లేరని అతడు గుర్తించాడు.

"సుమిత్రా, భయపడకు! జైలుకెళ్ళినా నేను బయటకు వచ్చేస్తాను. అంతవరకూ జాగ్రత్తగా వుండు. మన అబ్బిగాడికి యిదంతా తెలియకుండా చూడు!" అన్నాడతను.

"మీరు లేకుండా నేనెలా బతగ్గలను?" అందామె.

బయట పచార్లు చేసే కానిస్టేబులు దూరమైనదాకా అతడు మౌనందాల్చాడు.

"నాగా నిన్ను చూసుకుంటాడు!" అన్నాడతను.

మరి కొంతసేపు మాట్లాడి ఆమె వెళ్ళిపోయింది.

ఆలోచిస్తూ మోహన్ గోడవారగా నేలమీద కూర్చున్నాడు. అతను ఆలోచిస్తున్నాడు. ఆ బాగ్‌లో ఎంతవుందో మొదట్లో అతడికి తెలియదు. కాని యాభై లక్షలుపైన పోయిందని యిన్‌స్పెక్టర్ బాండ్ తనతో అన్నాడు. తన వాటకు 25 లక్షలు వస్తుంది.

ఈపాటికి నాగరాజు తన యిల్లు వదిలి మరోచోటకు పోయివుంటాడు. ఆ డబ్బును కాపాడగల్గిన శక్తి సామర్థ్యాలు నాగరాజులో ఎక్కువగా వున్నాయి.

బయట బూట్ల చప్పుడు. పోలీసు కానిస్టేబుల్ రైఫిల్ పట్టుకొని పచార్లు చేస్తున్నాడు.

మరో వారం రోజుల్లో బ్యాంకి కాషియర్ హాస్పిటల్లో మరణించాడని మోహన్ విన్నాడు. అతడు గాభరాపడసాగాడు. కాని గాభరాపడి ఇప్పుడు తనేం సాధించగలడు?

రెండు సంవత్సరములు గడచేలోపల మోహన్‌కి యావజ్జీవిత కారాగార శిక్ష విధించబడింది. ప్రఖ్యాత లాయర్ అరుంధతీదేవి ఉరిశిక్ష పడకుండా అతడిని కాపాడింది. అతడి సహచరుడు దొరకలేదు. మొదట్లో కాషియర్ని అతడే పొడిచేడన్నవాళ్ళు ఆఖరికి అతడు కాకపోవచ్చు అన్నారు. బ్యాంకి మేనేజర్ యిద్దరూ పొడిచారన్నాడు.

మోహన్ సెంట్రల్ జైలుకి పంపబడ్డాడు. తన భార్య వచ్చి తనను చూస్తుందని అతడు ఎదురుచూసే

వాడు. కాని ఆమె రాలేదు. తన భార్య యేమైందో అతడికి తెలియకుండా జీవితం సాగిపోయింది.

అతడి భార్య సుమిత్ర ఏమైంది?

సుమిత్ర చదువుకొన్న యువతికాదు. భర్త కేసు సాగుతూండగా నాగరాజు రహస్యంగా ఆమెను కల్సుకున్నాడు.

"ఇప్పటి పరిస్థితుల్లో నువ్వూ, నీ కొడుకూ కలిసి ఉండడం మంచిది కాదు" అన్నాడతను.

"అయితే ఏం చేయమంటారు?"

"వాడిని అనాధాశ్రమంలో వదిలేయి. నువ్వు మరో వూరు వెళ్ళిపో. నేను నీకు కావలసిన డబ్బు అక్కడికొచ్చి యిస్తూ వుంటాను."

ఆమె అలాగే చేసింది. కొడుకును ఒక అనాధశ్రమంలో చేర్పించి దిండివనం వెళ్ళిపోయింది. ఆమెకు నాగరాజు వందరూపాయలు ఇచ్చాడు. తర్వాత దిండివనం వచ్చి యిస్తానన్నాడు.

ఆమె అక్కడకు చేరుకొని అష్టకష్టాలూ పడింది. నాగరాజునుంచి డబ్బు రాలేదు. అతడికోసం మద్రాసు వెళ్ళడానికి ఆమె దగ్గర డబ్బులేదు. ఆ పరిస్థితుల్లో ఆమె ఒక ధనవంతుడి యింట్లో పనిమనిషిగా చేరింది.

ఒకనాటి రాత్రి ఆమెను త్రాచుపాము కాటేసింది. తెల్లారేలోపల ఆమె మరణించింది. చనిపోయేముందు ధనవంతుడు ఆమె సమీపంలో నిలబడి జాలిగా సుమిత్ర వైపు చూశాడు.

"నీవాళ్ళు యెవరేనా వుంటే చెప్పు! వాళ్ళను యిక్కడకు రమ్మంటాను" అన్నాడతను.

"నా కెవ్వరూ లేరు" అని ఆమె శాశ్వతంగా కళ్ళు మూసింది.

## 3

పన్నెండేళ్ళ తర్వాత మోహన్ జైల్లోంచి బయట కొచ్చాడు. ఏళ్ళ తరబడి జైల్లో వున్న అతడికి రోడ్డమ్మట స్వేచ్ఛగా నడుస్తూంటే విచిత్రంగా వుంది.

ఎక్కడ చూసినా ప్రజలు! తను జైల్లో వుండగా జనసంఖ్య బాగా పెరిగివుండాలి. పట్నంలో ఎన్నో మార్పులను అతడు గమనించాడు. పాతబడిన బిల్డింగ్ వుండేచోట నాలగంతుస్తుల భవనం కనబడ్తోంది. పట్నం బాగా మారిపోయింది.

ఆలోచిస్తూ అతడు నడుస్తున్నాడు. తన భార్య, కొడుకు, నాగరాజు రూపాలు అతడి మెదడులో కదులున్నాయి. తన కొడుకు పెద్దవాడయి వుంటాడు. తన భార్య యెలా వుందో!

తిలక్ నగర్‌లో ఒకప్పుడు తను నివశించిన యింటి వైపు అతడు నడిచాడు. కాస్సేపట్లో యిన్నేళ్ళ తర్వాత తన భార్యను చూడబోతున్నాననే ఆశతో అతడి గుండె వేగంగా కొట్టుకోసాగింది.

తిలక్ నగర్ చేరుకున్నాడతను. చిన్న యింట్లో ఒక భాగంలో వుండేవాడతను. ఆ పాత కొంప ఎక్కడా లేదు.

కొత్త బిల్డింగ్స్ అందంగా కనిపిస్తున్నాయి. నాగరాజు కొత్త బిల్డింగ్‌ను కట్టించేదేమో!

కాస్సేపట్లో అతడి ఆశలన్నీ ఎగిరిపోయాయి. ఆ బిల్డింగ్‌లోని ఫ్లాట్లలో అనేకమంది నివశిస్తున్నారు.

సుమిత్ర పేరు యెక్కడా లేదు!

మోహన్ తిలక్ నగర్ అంతటా తిరిగాడు. కాని లాభం లేకపోయింది.

ఒక టీ కొట్టుముందు మోహన్ ఆగాడు. మూడు బన్నులు తిని, వేడి టీ తాగాడు. సిగరెట్ వెలిగించాడు. నీరసంగా రోడ్డమ్మట నడుస్తున్నాడు.

ఒక స్త్రీని చూసి అతడామెవైపు పరుగుత్తాడు.

"మీనాక్షీ! నేను గుర్తున్నానా?" అడిగాడతను.

ఆమె అతడివైపు సూటిగా చూసింది.

"మోహన్‌లా వున్నావు" అందామె.

"అవును. పోల్చావు" అన్నాడతను ఆనందంగా.

ఒకప్పుడు ఆమె అతడింటికి పాలు యిచ్చేది. అనేక మంది ఆమె దగ్గరే పాలు కొనేవారు. పాలల్లో ఎప్పుడూ నీళ్ళు కలపదని అందరూ చెప్పుకొనేవారు.

"నువ్వెక్కడుంటున్నావు?"

"మా ఇల్లు అమ్మేసి కొరటూరు పోయాను."

"ఇంకా పాల వ్యాపారం చేస్తున్నావా?"

"నాకు తెలిసింది అదొక్కటేగా!" అందామె.

"సుమిత్ర ఏమైందో తెలుసా?"

ఆమె ఏం చెపుతుందో అని అతను గాభరాపడ సాగాడు.

"ఆఖరి రోజుదాకా ఆమెకు పాలు నేనే పోశాను. ఆమె దిండివనం వెళ్ళిపోతున్నానని చెప్పింది. ఆ కుర్రాడిని అనాథాశ్రమంలో చేర్చేసింది."

అతను మౌనంగా ఆమెవైపు చూశాడు.

"ఆ యిల్లాలు ఏం చేస్తుంది పాపం? చుట్టుపక్కల వాళ్ళందరూ నీ గురించే మాట్లాడేవారు. దిక్కులేక అలా చేసిందామె."

"బాబుని ఏ అనాథాశ్రమంలో చేర్పించిందో తెలుసా?"

"అయినావరంలో వుందది" అందామె.

అతడామెకు దణ్ణం పెట్టాడు.

"ఈ పట్నం నాకు కొత్తగా అగుపిస్తోంది. నిన్ను చూసినందుకు చాలా సంతోషం. మళ్ళా నిన్ను కలుసుకుంటాను" అని ఆమె అడ్రెసు రాసుకున్నాడు.

మీనాక్షి వెళ్ళిపోయింది. ఆమెవైపు అలాగే చూస్తూ నిలబడ్డాడతను.

తన భార్య దిండివనం యెందుకు వెళ్ళిపోయింది? అది చిన్న ప్రదేశం. అక్కడకు వెళ్ళి ఆమెను గురించి కనుక్కోవాలి.

ఈ పట్నంలో నాగరాజు ఎక్కడున్నాడో అతడు తెల్సుకోవాలి. నాగరాజును కల్సుకుంటే తన భార్య ఎందుకు దిండివనం వెళ్ళిందో తెలుస్తుంది.

కొంతదూరం నడిచి అతడు బస్సులో కూర్చున్నాడు. అతడు ధరించిన దుస్తులు చాలా పాతవి. పక్కకూర్చున్నతడు అతడివైపు అనుమానంగా చూశాడు.

అయినావరంలో అతడు బస్సు దిగాడు. రోడ్డమ్మట నడవసాగాడు. ఆ ప్రాంతంలో ఒక అనాథాశ్రమం వుండాలని అతడికి గుర్తుంది.

ఏదో కారు యెదురుగా వస్తోంది. కారు నడుపుతున్న వ్యక్తి వైపు అతడు చూసి "నాగా!" అని అర్చాడు.

కాని కారు ఆగలేదు. ముందుకు దూసుకుపోయింది. కారు నంబర్ని అతడు గుర్తుంచుకున్నాడు. ఆ నంబర్నిబట్టి నాగరాజు యెక్కడుంటున్నాడో తను తెలుసుకోవచ్చు!

ఆ కారు నంబర్ని వల్లించుకుంటూ అతడు పేవ్మెంటమ్మట నడవసాగాడు.

శారదా అనాథాశ్రమం కాంపౌండులోకి అతడు నడిచాడు. మునుపటిలా లేదు. పెద్ద బిల్డింగ్. కాంపౌండు విశాలంగా వుంది.

మోహన్ సెక్రటరీ గదిముందు నిలబడ్డాడు.

"ఏం కావాలి?" అన్నాడొక నౌఖరు.

"సెక్రటరీతో మాట్లాడాలి."

"నీ పేరు?"

"మోహన్."

నౌఖరు లోపలకు వెళ్ళాడు. కాస్సేపట్లో తిరిగి వచ్చాడు.

"లోపలకు వెళ్ళు!"

అతడు మెల్లిగా లోపలకు నడిచాడు. కుర్చీలో ఒక వృద్ధురాలు కూర్చునివుంది. నవ్వుతూ ఆమె అతడివైపు చూసింది.

"కూర్చో బాబూ" అందామె.

అతడు కుర్చీలో కూర్చున్నాడు. ఆమెవైపు సూటిగా చూశాడు. ఆమె కళ్ళలో యేదో కాంతి! ఆమే యీ అనాథాశ్రమాన్ని స్థాపించి జయప్రదంగా నడుపుతోంది.

"బాగా అలిసిపోయినట్లున్నావు" అని ఆమె బెల్ నొక్కింది.

ఒక యువతి గదిలో కొచ్చింది.

"టిఫిన్, కాఫీ, మంచినీళ్ళు తీసుకొచ్చి అతడికియ్యి" అందామె.

ఆమె పట్టుకొచ్చి యిచ్చింది. ఆకలితో తిని, నీళ్ళు తాగి, కాఫీని సేవించి అతడామెకేసి చూశాడు.

"మీరు దేవతలాంటివారు! మీ సహాయం కావాలి నాకు" అన్నాడతను.

"ఏం కావాలో చెప్పు."

"పది, పన్నెండేళ్ళ క్రితం ఒక పత్రాడిని ఒక స్త్రీ యిక్కడ చేర్చి వెళ్ళిపోయింది. అతడి పేరు రవి. అతడు మీకు గుర్తున్నాడా?"

"అదేమిటి బాబూ అలా అడుగుతావు! రవి పేరు తెలియనివాళ్ళు యీ అనాధాశ్రమంలో లేరు. చిన్న తనంలో రవి యిక్కడికి వచ్చాడు. చాలా బుద్ధిమంతుడు. ఆటల్లో, చదువులో, గుణంలో అందర్నీ మించి పోయాడు" అందామె.

"అతడిక్కడున్నాడా?" ఆత్రంగా అడిగాడతను.

"అతడు వుద్యోగంలో చేరి రెండు నెలలు అయింది. వుద్యోగం వచ్చాక వేరే గది తీసుకుని వుంటున్నాడు."

"అతడి అడ్రెసు తెలుసా?"

ఒక కాగితంమీద అతడి అడ్రెసు రాసి ఆమె యిచ్చింది.

"కాని యిప్పుడు అతను ఆ గదిలో వుండడు. ఆఫీసు పనిమీద తిరుపూర్ వెళ్ళాడు. రెండు మూడు రోజుల్లో తిరిగొస్తానన్నాడు."

"అతడిని చూసి చాలా కాలమైంది. అతడు యిప్పు డెలా వుంటాడో!" వాపోయాడతను.

ఆమె నవ్వుతూ టేబుల్ సొరుగు లాగి ఒక ఫోటో తీసి అతడికిచ్చింది. ఫోటోవైపు అతడు ఆత్రంగా చూశాడు.

"చూశావా బాబూ, అతడు నీలాగే వున్నాడు. వయస్సులో చిన్నవాడు. అంతే తేడా!" అందామె నవ్వుతూ.

ఆమె చెప్పింది నిజమే! రవి తన పుత్రుడని అందరూ క్షణంలో గ్రహించగలరు.

ఆమె అతడివైపు సూటిగా చూసింది.

"అతడి తల్లి సుమిత్ర వచ్చి రవిని యిక్కడ చేర్పించింది. ఆమె మళ్ళా రాలేదు. నువ్వు రావడం ఇదే మొదటిసారి. మీ బిడ్డను నువ్వూ, సుమిత్రా ఎందుకిలా వదిలేశారు?" అడిగిందామె.

అతడు వెంటనే జవాబివ్వలేదు ఆమెవైపు బాధతో చూశాడు. కళ్ళమ్మట నీళ్ళు కారాయి.

"పరిస్థితులలా వచ్చాయమ్మా! అంతకంటె నేనేమీ చెప్పలేను. మీకు చాలా థాంక్స్. మిమ్మల్ని యెన్నడూ మరువను" అని అతడు లేచి బయటకు నడిచాడు.

# 4

తను చూసిన కారు నంబర్ని బట్టి మోహన్ తన పాత మిత్రుడైన నాగరాజు అడ్రెసు కనుక్కోగల్గాడు.

గేటు ముందు నిలబడి లోపలకు చూశాడు. దూరంలో పెద్ద మేడవుంది. కాంపౌండ్‌లో నాలుగైదు కార్లున్నాయి.

గేటు ముందు కూర్చున్న గూర్ఖా అనుమానంగా మోహన్ వైపు చూశాడు.

"ఇక్కడ నుంచో‌కు పో! జావ్!" అన్నాడతను.

మోహన్ కొంచెం వెనక్కు తిరిగాడు. ఒకప్పుడు తనూ, నాగరాజూ ప్రాణమిత్రులు. కాని ఏళ్ళ తరబడి జైల్లో కూర్చుని తిరిగొచ్చాక ఆ భవనంలోకి వెళ్ళే ధైర్యం లేకుండా పోయిందతనికి.

తటాలున గూర్ఖా గేటును తెర్చాడు—ఒక కారు బయటకు వచ్చింది.

"నాగా!" అర్చాడు మోహన్ వుద్రేకంతో.

కారు ఆగింది. కారును నడుపుతూన్న నాగరాజు మాసిన దుస్తుల్లో నిలబడివున్న వ్యక్తివైపు చూశాడు.

"హై, మోహన్, రా కూర్చో!"

కారు ముందు తలుపు తెర్చాడతను. వేగంగా వెళ్ళి మోహన్ కూర్చున్నాడు. తలుపు మూసి నాగరాజు కారుని పోనిచ్చాడు.

పక్క కూర్చున్న మోహన్ చెయ్యిని గట్టిగా పట్టుకున్నాడు. కొంతసేపు యిద్దరూ మౌనంగా వుండిపోయారు.

"మోహన్ యిలా నీ పక్క కూర్చుంటే మన కారు వెనుక పోలీస్ జీప్ వచ్చిన దృశ్యం జ్ఞప్తికొస్తోంది!" అన్నాడు నాగరాజు.

"నాగా, ఎలా వున్నావు?"

"ఇంతవరకూ అన్నీ బాగున్నా, నువ్వు పక్కన లేవని రోజూ విచారించేవాడిని. ఇటుపైన మనం విడిపోకూడదు."

"ఎప్పుడూ కలిసే వుందాం" అన్నాడు మోహన్.

"నిన్ను విడుదల చేస్తారని తెల్సుకుని ఆ రోజు కారులో వచ్చాను—జైలుకి కొంచెం దూరంలో కారాపి కూర్చున్నాను. కాని నువ్వు కనబడలేదు—చూసి, చూసి ఏడుస్తూ వెనక్కి వచ్చాను. అప్పటి నుంచీ పట్నంలో అన్నిచోట్లా నీ కోసం వెతుకుతూనే వున్నాను" అన్నాడు నాగరాజు.

"నేను కుడివైపు రోడ్డమ్మట నడిచిపోయాను" అన్నాడు మోహన్.

"జైలు యెడంవైపు రోడ్డుమీద నా కారుంది."

నాగరాజు కారు స్పీడు హెచ్చించాడు. ఓరగా మిత్రుడివైపు చూశాడు.

"మోహన్, యిటుపైన నీ వేషం మార్చాలి."

"తొందరెందుకు?"

"మోహన్, మన చేతుల్లోకొచ్చిన డబ్బును నేను బాగా పెరిగేటట్లు చేశాను. నీ వాటా యిరవైఐదు లక్షలు యిప్పుడు కోటి పైగా వుంటుంది. అనేక వ్యాపారాల్లో మన డబ్బును పెట్టాను. ఇటుపైన నువ్వు సుఖంగా జీవించవచ్చు!"

"నాగా, సుమిత్ర ఎక్కడుంది?"

"ఆ విషయం నన్ను అడక్కు! నేను నీకు చెప్పలేను!"

సీటుమీద అతడివైపు తిరిగాడు మోహన్. "ఎంత చేదు నిజమైనా నేను భరించగలను, నాగా" అన్నాడతను.

"నువ్వు జైలుకెళ్ళాక ఆమె నిన్ను మర్చిపోయింది. మరొకడితో లేచిపోయింది."

"ఎవరితో?"

నాగరాజు కాసేపు ఆలోచించాడు. కట్టెలమ్మే కన్నయ్య తన వ్యాపారం మానేసి, వూరు విడిచి వెళ్ళిపోయాడని అతడికి తెలుసు.

"కట్టెల కన్నయ్యతో" అన్నాడు నాగరాజు.

"సుమిత్ర తిండివనం వెళ్ళిందని పాలమ్మే మీనాక్షి చెప్పింది" అన్నాడు మోహన్.

"మొదట్లో వాళ్ళు తిండివనం పోయారు. పనిగట్టుకుని ఆ వూరు నేను వెళ్ళాను. ఆమె కళ్ళు తెరవడానికి ప్రయత్నించాను. అక్కడనుంచి మరెక్కడికో పోయారు

వాళ్ళు. ఆమెను నేను మళ్ళా చూడలేదు."

"నా కొడుకును అనాధాశ్రమంలో వదిలేసింది" అన్నాడు మోహన్.

"కామంతో గుడ్డిదైన స్త్రీకి భర్తా, కొడుకు గుర్తు వుంటారా!" అన్నాడు నాగరాజు.

ఒక రెడీ మేడ్ షాపు ముందు నాగరాజు కారును ఆపాడు—దిగి యిద్దరూ లోపలకు వెళ్ళారు. ఒక పాంట్, స్లాక్ కొన్నాడు నాగరాజు.

"ఆ గదిలోకి వెళ్ళి వేసుకు చూడు, సైజు సరిగ్గా వుందో, లేదో" అన్నాడతను.

మోహన్ పక్కనున్న చిన్న గదిలోకి వెళ్ళాడు. పాంటు, స్లాక్ ధరించాడు.

"ఇప్పుడు బాగున్నావు. నీ పాత దుస్తుల్ని కవర్లో వుంచు. ఎవరికేనా యిచ్చేద్దాం" అన్నాడు నాగరాజు.

ఇద్దరూ షాపులోంచి బయటకు నడిచారు. సమీపంలో వున్న చెప్పుల షాపులోకి వాళ్ళు వెళ్ళారు.

"స్లిప్పర్స్ ఫర్ మై ఫ్రెండ్" అన్నాడు నాగరాజు అతడివైపు చూస్తూ. మోహన్‌కి కొత్త చెప్పులు కొన్నాడు నాగరాజు. ఇద్దరూ వెళ్ళి కారులో కూర్చున్నారు. నాగరాజు కారును పోనిచ్చి హోటల్ రియో కాంపౌండులో ఆపాడు.

## 5

నాగరాజు, మోహన్ వుషారుగా లంచ్ సేవిస్తున్నారు.

"ఎన్నేళ్ళ తర్వాత మనం మళ్ళా కలిసి తింటున్నాం! నాకు చాలా ఆనందంగా వుంది" అన్నాడు నాగరాజు.

"నాకూ అలాగే వుంది" అన్నాడు మోహన్.

"మోహన్, ఎంతో కష్టపడి యింతకాలం పాటు నీ డబ్బును జాగ్రత్తగా చూశాను. మనం మన అకౌంట్లు సెటిల్ చేసుకోవాలి. అదంతా రహస్యంగా జరగాలి."

మోహన్ అతనివైపు నవ్వుతూ చూశాడు.

"డబ్బు నా దగ్గరున్నా, నీ దగ్గరున్నా ఒకటే."

"నీది నీకిచ్చేయడం నా ధర్మం. నా బాధ్యత తీరుతుంది. అటుపైన కావలిస్తే మనం కలిసి వ్యాపారం చేయొచ్చు."

"అయితే ఏం చేద్దాం?"

నాగరాజు అతడివంక సూటిగా చూశాడు. "కొందరు పోలీసులు మఫ్టీలో నిన్ను వెంటాడుతూ వుండొచ్చు. జైలు నుంచి నువ్వు తిరిగొచ్చాక బ్యాంకి నుంచి మనం దోచుకున్న డబ్బు ఎక్కడుందో తెలుసుకోవాలని వాళ్ళ తాపత్రయం. అందువలన మనం మరోచోట కలుసుకుందాం."

"ఎక్కడ?"

"ఈ పట్నానికి యాభై కిలోమీటర్ల దూరంలో నేను పెద్ద తోట కొన్నాను. అక్కడ చిన్న యిల్లు కూడా కట్టించాను. అక్కడికి వెళ్ళి రెండు రోజులు వుందాం. అక్కడ నీకు రావలసినదంతా యిచ్చేస్తాను."

"అలాగే చేద్దాం."

"నువ్వు యిప్పుడు ఎక్కడ వుంటున్నావు?"

"చిన్న హోటల్లో. అజంతా లాడ్జి. మెడోస్ రోడ్డు."

"అక్కడే వుండు. రేపు పొద్దుటే నేను అక్కడికొస్తాను. కారులో యిద్దరం నా గార్డెన్స్‌కు వెళ్దాం."

"గుడ్" అన్నాడు మోహన్.

నాగరాజు బిల్లు చెల్లించాడు. ఇద్దరూ ఇంకా సెల్లెంట్ వాళ్ళిద్దరూ బయటకు నడిచారు.

నాగరాజు కారును పోనిచ్చాడు.

"ఇప్పుడు మనం అంతగా భయపడ నక్కరలేదు. మంత్రులతో, ఎమ్.ఎల్.ఏ.లతో నాకు బాగా పరిచయముంది. నా దగ్గరకు రావడానికి పోలీసులు భయపడ్తారు" అన్నాడు నాగరాజు.

"నువ్వు చెప్పింది విన్నాక నాకు ధైర్యంగా వుంది. ఈ లోకంలో జయించాలంటే డబ్బూ, హోదా రెండూ వుండాలి," అన్నాడు మోహన్.

నాగరాజు టైమ్ చూశాడు.

"నేను ఒక మంత్రిని కల్సుకోడానికి వెళ్ళాలి. ఆయనతో గంటసేపు మాట్లాలి. నిన్ను యెక్కడ దింపను?"

"ఇక్కడే దిగిపోతాను."

నాగరాజు కారు ఆపాడు. మోహన్ కిందకు దిగాడు. జేబులోంచి ఒక కార్డు తీసి అతడు మోహన్‌కి ఇచ్చాడు.

"రేపు నిన్ను కల్సుకుంటాను. ఈ లోపల యేదేనా కావలిస్తే ఈ నంబరుకి ఫోన్ చేయి."

"అలాగే" అన్నాడు మోహన్.

నాగరాజు కారును పోనిచ్చాడు. రోడ్డువారగా నిలబడి వుండిపోయాడు మోహన్.

కొంతసేపయ్యాక అతడు రోడ్డమ్మట నడవసాగాడు.

అరగంట పైగా అతడు నడుస్తూనే వున్నాడు. పేవ్‌మెంట్ పక్కన కట్టెలమ్మే కొట్టుంది. ఆ కొట్టును చూడగానే అతడికి కన్నయ్య, సుమిత్ర గుర్తొచ్చారు.

కొట్టు బయట ఒకతను నిలబడి వున్నాడు. అతడిని చూసి మోహన్ ఆశ్చర్యపోయాడు. కట్టెల కన్నయ్య!

కోపంగా అతడు కన్నయ్యవైపు వెళ్ళాడు. కన్నయ్య అతడికేసి సూటిగా చూశాడు.

"మోహనా?" అన్నాడతను.

"అవును, నేనే. సుమిత్ర, యెక్కడుంది?" అన్నాడతను.

అతడిని చూడగానే తలెత్తిన కోపం మరుక్షణంలో అణగిపోయింది. పదేళ్ళపైన తన్ని వదిలేసిన సుమిత్రకోసం తనెందుకు కోపం తెచ్చుకోవాలి!

"మీ రడిగేది ఏమిటి సార్?" అన్నాడతను.

"నువ్వూ, నా భార్య సుమిత్రా లేచిపోయారని విన్నాను. ఆమెను ఎక్కడ వదిలేశావు?"

కన్నయ్య కోపంతో ఎగిరాడు.

"అలా నీకు చెప్పిన ఆ దొంగనాకొడుకు యెక్కడున్నాడు?"

"ఈ పట్నంలోనే."

"వాడిని యిక్కడకు తీసుకురా? చెప్పుతీసి కొడ్తాను. అబద్దానికి కూడా హద్దుంటె. ఆరుగురు పిల్లల తండ్రిని నేను. నీ భార్య మంచిది. మా యిద్దరి గురించీ అలా చెప్పడం అన్యాయం. నువ్వూ, నేనూ సహించకూడదు. ఎవడా దొంగ విధవ?"

కట్టెల కన్నయ్య రెచ్చిపోయాడు. అతడి చేయి పట్టుకున్నాడు మోహన్.

"నేను విన్నది నీకు చెప్పి నిన్ను బాధపెట్టినందుకు నన్ను క్షమించు. జైలుకెళ్ళి పన్నెండేళ్ళు అయ్యాక తిరిగొచ్చాను. ఎవడో దుర్మార్గుడు అలా చెప్పాడు. నీ

మూలంగా అతడు దుర్మార్గుడని నేను తెల్సుకోగల్గి నందుకు సంతోషిస్తున్నాను.”

కన్నయ్య అడివైపు జాలిగా చూశాడు.

“నా మూలంగా నువ్వు మరొకటి కూడా తెల్సుకో గలవు. ఇక్కడి వ్యాపారం మూసేసి నేను దిండివనం వెళ్ళాను. అక్కడ ఒక ధనవంతుడి యింట్లో నీ భార్య పనిమనిషిగా వుండేది. ఒక రాత్రి త్రాచుపాము కర్చి ఆమె మరణించింది” అన్నాడతను.

“బతికుండగా ఆమె నీతో ఏదేనా చెప్పిందా?” అడి గాడు మోహన్.

“ఒకసారి మాట్లాడాను. ఎవడో దుర్మార్గుడు నిన్ను మోసగించాడని ఆమె చెప్పింది. కొంతకాలం తర్వాత నేను మద్రాసుకు తిరిగొచ్చి యిక్కడ వ్యాపారం పెట్టాను.”

కన్నయ్యను అతను అమాంతంగా కౌగలించు కొన్నాడు.

“కన్నయ్యా, ఎంతో చెప్పి నా కళ్ళు తెరిచావు! నువ్వు యిదంతా చెప్పకపోతే మనుషులను మునుపటిలాగే నమ్మి మోసపోయేవాడిని” అన్నాడు మోహన్.

“లోపలకొచ్చి కాఫీ తాగి వెళ్ళు” అన్నాడు కన్నయ్య.

ఇద్దరూ లోపలకు వెళ్ళారు. ఒక కుర్రాడిని పిల్చి కన్నయ్య కాఫీ తెమ్మన్నాడు.

కుర్చీల్లో వాళ్ళు ఎదురెదురుగా కూర్చున్నారు.

“నీకలా చెప్పినవాడిని కసితో తన్నాలనిపిస్తోంది” అన్నాడతను.

“ఆ పని నేను చస్తానులే. మనిద్దరి తరఫునా నేను

వాడికి బుద్ధి చెప్తాను."

కాఫీ వచ్చింది. ఇద్దరూ కాఫీ తాగారు. కన్నయ్య అతడివైపు సూటిగా చూశాడు.

"పేపర్లలో నీ గురించి ఎంతో రాసేవారు. యాభై లక్షలు పైన పోయిందటగా? అదంతా ఏమైంది?"

మోహన్ అదోలా నవ్వాడు.

"అదంతా చేసినవాళ్ళు యెందరో వున్నారు. నేను దొరికాను. నన్ను జైల్లో పడేశారు. తతిమావాళ్ళు యేమయ్యారో, డబ్బు ఏమైందో నీకెంత తెలుసో నాకూ అంతే తెలుసు."

"అలా వచ్చిన డబ్బు నిలవదు! లక్ష్మిని జుత్తు పట్టుకొని బలాత్కారంగా లాక్కొస్తే మనింట్లో వుండదు. మరుక్షణంలో జారిపోతుంది" అన్నాడు కన్నయ్య.

"ఎన్నో నిజాలు ఆలస్యంగా నేర్చుకున్నాను" అని మోహన్ లేచాడు.

మెల్లిగా బయటకు నడిచాడు. నాగరాజు ముఖం అతడి మనోఫలకంమీద కదలాడింది. అతడు తనని మోసం చేశాడు. సందేహం లేదు! అతడిని శిక్షించాలి!

# 6

అజంతా లాడ్జిముందు నాగరాజు కారును ఆపాడు. అతడు దిగేలోపల ప్లాస్టిక్ బాగ్ పట్టుకొని మోహన్ కారువైపు నడిచాడు.

"రెడీగా వున్నావన్నమాట!" అన్నాడు నాగరాజు టైమ్ చూస్తూ.

మోహన్ ముందుసీటులో కూర్చుని తలుపు మూశాడు. నాగరాజు కారును పోనిచ్చాడు.

"ఈ లాడ్జిలోని గది ఖాళీ చేశావా?"

"వాళ్ళ బిల్లు సెటిల్ చేసేశాను. మళ్ళా యిక్కడ వుండవలసిన అవసరం నాకు రాకపోవచ్చు" అన్నాడు మోహన్.

"వెల్ సెడ్ మై ఫ్రెండ్!" అన్నాడు నాగరాజు.

టైమ్ ఏడుకావస్తోంది. తన తోటవైపు నాగరాజు కారును పోనిచ్చాడు.

"మోహన్, ఇప్పుడు మనం రహస్యంగా మాట్లాడుకోవచ్చు. నువ్వు జైల్లో వుండగా మన డబ్బును కాపాడ్డానికి నేను ఎంతో కష్టపడ్డాను. రెండేళ్ళదాకా నేను ధనవంతుడిలా యెవ్వరికీ కనిపించలేదు."

కారును ఆపి సిగరెట్ కేసు తెర్చి మోహన్ కి సిగరెట్ ఇచ్చి నాగరాజు మరో సిగరెట్ వెలిగించాడు.

"మోహన్, యిప్పుడు నీ చేతిలోకి చాలా డబ్బు వస్తుంది. ఏం చెయ్యదల్చావు? మళ్ళా పెళ్ళాడ్తావా?" అడిగాడు నాగరాజు.

"నేనింకా ఆలోచించలేదు" అన్నాడు మోహన్.

"నీకొక పెద్ద మేడ నేను యిస్తాను. అది ప్రస్తుతం మరొకరి పేరులో వుంది. నీకోసం అది నేను కొన్నాను. అంత పెద్దింట్లో నువ్వు ఒంటరిగా వుంటే పిచ్చెక్కిపోతుంది. నీ భవిష్యత్తును గురించి నువ్వు అంతా ప్లాన్ చెయ్యాలి" అన్నాడు నాగరాజు.

"ఆలోచిస్తాను" అన్నాడు మోహన్ క్లుప్తంగా.

నాగరాజు తోటలో కారును ఆపాడు. చిన్న బంగళా వుంది. హాలు, రెండు పడగ్గదులు, వంట గది, బాత్ రూమ్, ఎలెక్ట్రిక్ అన్నీ ఆధునికంగా అమర్చబడ్డాయి.

ఇద్దరూ హాల్లో కూర్చున్నారు. పైన ఫాన్ తిరుగుతోంది.

"ఇక్కడ కరెంటులేదు. అందుకని యమాహా జన రేటర్ కొన్నాను" అన్నాడు నాగరాజు.

అరగంట తర్వాత యిద్దరూ నలువైపులా తిరిగి తోటను చూశారు. అక్కడ అరడజనుమంది పని చేస్తు న్నారు.

ఒంటిగంట ప్రాంతంలో ఇద్దరూ భోజనాలు చేశారు. కేరియర్లలో పెట్టించి నాగరాజు అనేక పదార్థాలు చేయించి తెచ్చాడు.

"నీ కిష్టమని చికెన్ బిర్యానీ చేయించాను" అన్నాడు నాగరాజు.

మోహన్ నవ్వాడు.

"జైలులో రుచీపచీలేని పదార్థాలు తినితిని నాలిక చచ్చిపోయింది" అన్నాడు మోహన్.

భోజనాలు ముగించి యిద్దరూ పడుకున్నారు. వాళ్ళు లేచేసరికి ఆరుదాటింది.

కాఫీ సేవించి యిద్దరూ కొంతసేపు తోటలో పచార్లు చేశారు. పనిచేసే నౌఖర్లు ఎక్కడా లేరు.

"పొద్దుట మనం చూసిన పనివాళ్ళు యెక్కడకు పోయారు?" అడిగాడు మోహన్.

"సమీపంలోనే వున్నాయి వాళ్ళ ఇల్లు. అక్కడకు పోయి మళ్ళా పొద్దుటే వస్తారు" అన్నాడు నాగరాజు.

చీకటి పడింది. హాల్లోని లైట్లు వెల్గుతున్నాయి. ఇద్దరూ సోఫాలో కూర్చున్నారు. స్కాచ్ విస్కీ బాటిల్ తీసి నాగరాజు టీపాయిమీద వుంచాడు. సోడా బుడ్లు, రెండు గ్లాసులు, ఒక కూల్ బాక్స్ వంటగది లోంచి అతడు తెచ్చాడు.

రెండు గ్లాసుల్లో విస్కీ పోసి, సోడా కలిపి ఐస్

ఫ్యాన్స్ పడేశాడు. ఆప్యాయంగా మెరిసే కళ్ళతో మోహన్ వైపు చూశాడు.

"మోహన్, లెటస్ డ్రింక్ ఫర్ విక్టరీ!" అన్నాడు.

ఇద్దరూ గ్లాసులు అందుకున్నారు. రెండు పెగ్గులు సేవించారు. హుషారుగా వున్నారు.

నాగరాజు అతడివైపు చూశాడు.

"ఇప్పుడు బిజినెస్‌కి వస్తాను. ఒక్క విషయం నేనింత వరకూ నీకు చెప్పలేదు. నీ వాటాకు రావలసిన డబ్బు నేను నీ భార్య సుమిత్రకు అప్పుడే యిచ్చేశాను!" అన్నాడు నాగరాజు.

"ఎవరు యిమ్మన్నారు?"

"ఇవ్వకపోతే నన్ను పోలీసులకు అప్పగిస్తానంది. మరేం గత్యంతరంలేక యివ్వవలసి వచ్చింది" అన్నాడు నాగరాజు.

"యూ ఆర్ ది బిగ్గెస్టు లయర్!" అరిచాడు మోహన్.

"నువ్వు యేమనుకున్నా నాకు కేర్ లేదు. నీ వాటా డబ్బు యిచ్చేసి నా బాధ్యత తీర్చుకున్నాను. ఇదంతా మొదలే చెప్తే గుండాగి చస్తావని చెప్పలేదు."

"నా భార్య సుమిత్ర కట్టెల కన్నయ్యతో లేచి పోయిందన్నావు. అటువంటి దానికి అంత డబ్బు ఎలా యిచ్చావు?"

"ఆమె లేచిపోయేముందు యిచ్చాను."

మోహన్ గ్లాసులోని విస్కీని తాగేశాడు.

"అంత డబ్బు తీసుకొని సుమిత్ర దండకవనం వెళ్ళి పోయి అక్కడ ఒక ధనవంతుడి యింట్లో పనిమనిషిగా చేరిందా? నేను నమ్మను!"

"ఆమెకు నేనిచ్చిన డబ్బంతా ఆ కన్నయ్యగాడు లాగేసి పారిపోయి వుండొచ్చు!"

"నాగా!" అర్చాడు మోహన్, కుర్చీలోంచి లేస్తూ.

"ఏమిటి?" అడిగాడు నాగరాజు.

"కట్టెల కన్నయ్య యీ పట్నంలోనే వున్నాడు. నిన్న నువ్వు నన్ను దింపి వెళ్ళిపోయాక విచిత్రంగా అతడు కనిపించాడు. నీ మాటలు నమ్మి అతడిని తిట్టాను. తర్వాత నిజం తెల్సుకొని సిగ్గుతో తలొంచి నిలబడ్డాను."

మోహన్ చెప్పింది విని నాగరాజు తృళ్ళిపడ్డాడు. కట్టెల కన్నయ్య అతడికి ప్రత్యక్షమవుతాడని కలలో కూడా వూహించలేదతను.

"నాగా, నువ్వు నన్ను మోసగించావు. నా కొడుకును అనాథాశ్రమంలో వదిలేసి, నా భార్య దిండివనం వెళ్ళిపోయింది. అక్కడ పనిమనిషిగా వుండి జీవించింది. చివరకి పాముకాటుకు బలై ఆమె మరణించింది. ఆమెకు నువ్వు పైసాకూడా యివ్వలేదు. అందుకే ఆమె పేదరికంలో బతకవలసి వచ్చింది."

"అయితే ఏమంటావు?"

"నా డబ్బు నాకిమ్మంటాను. ఈ పన్నెండేళ్ళలోనూ అది పెరిగి కోటి రూపాయిలు అయిందన్నావు. అది నాకిచ్చేయి!"

నాగరాజు పకపక నవ్వాడు.

"ఒక పైసా యివ్వను. ఏం చెయ్యగలవు?"

"నాగా, నీకోసం, నిన్ను కాపాడ్డానికి నేను జైలు కెళ్ళాను. నీ సహచరుడెవరని పోలీసులు నన్నెంతకొట్టినా నీ పేరు చెప్పలేదు. నన్ను మోసం చెయ్యకు. నాకు కోటి రూపాయిలు వద్దు. కనీసం నా వాటాకొచ్చే 25

లక్షలు యిచ్చేయి. మన స్నేహాన్ని పాడు చెయ్యకు!"

నాగరాజు విస్కీ తాగి అతడివైపు పిస్టల్ని గురి పెట్టాడు. నవ్వుతూ లేచాడు.

"మోహన్, చేతులెత్తు! ట్రిగ్గర్ నొక్కితే నీ తల పగులుంది" అర్చాడు నాగరాజు.

మోహన్, చేతులెత్తాడు. కాలో విస్కీ గ్లాసును తన్ని అమాంతంగా బయటకు పరుగెత్తాడు.

అతడివైపు రెండుసార్లు షూట్ చేశాడు నాగరాజు. మోహన్ అమాంతంగా కిందపడ్డాడు. దొర్లుతూ కొంచెం దూరం కదిలాడు. కాస్సేపట్లో అతడు బాధపడుతున్నట్లు అర్చాడు.

నాగరాజు అతడిదగ్గర కెళ్ళాడు. టార్చి కాంతిలో మోహన్ వైపు చూశాడు.

మోహన్ వెల్లకిలా పడున్నాడు. అతడు ధరించిన చొక్కా ఎర్రగా, రక్తమయంగా అగుపిస్తోంది.

"శని విరగడైంది" అనుకుంటూ నాగరాజు హాల్లోకి వెళ్ళాడు. గ్లాసులో విస్కీ పోసుకొని గడగడ తాగేశాడు.

తన వస్తువులన్నీ కారులో పెట్టుకున్నాడు. సిగరెట్ వెలిగించి కారును పోనిచ్చాడు. గేటు ప్రాంతంలో కారు ఆపాడు.

వస్తాదులా వున్న వాచ్‌మన్ కారు దగ్గరకు వచ్చాడు.

"భీమా, యింటి ముందు వాడు చచ్చిపడున్నాడు. గొయ్యితీసి వాడిని పాతేయి. పైన మొక్కలు నాటు. హాలు సుభ్రంచేసి, యింటికి తాళంవేయి."

"అలాగేనయ్యా. అదంతా నేను చూసుకుంటాను."

నాగరాజు జేబులోంచి వెయ్యి రూపాయలు తీసి అతడికిచ్చాడు.

"ఇదుంచుకో! రెండు మూడు రోజుల తర్వాత నేను వస్తాను. అంతా చూశాక మరో వెయ్యి నీకిస్తాను" అన్నాడు నాగరాజు.

"అలాగేనయ్యా" అన్నాడు వాచ్‌మన్.

నాగరాజు కారును పోనిచ్చాడు. వేగంగా కారు పట్నంవైపు ప్రయాణం చేస్తోంది. అతడి మెదడులో ఆలోచనలు సాగుతున్నాయి.

ఈ లోకంలో మోహన్‌కి ఎవ్వరూ లేరు. అతడి మరణాన్ని యెవ్వరూ గుర్తించరు. తనకు బెంగలేదు! పాము కాటుకు గురై సుమిత్ర మరణించిందని అతడికి తెలుసు. తను ఎన్నేళ్ళుగానో భయపడే మోహన్ ఈ లోకంలో లేడు. తను యిటుపైన యే బెంగా లేకుండా హాయిగా జీవించవచ్చు! అతడి మెదడులో ఆలోచనలు సాగుతున్నాయి.

కారు పట్నంవైపు దూసుకుపోతోంది.

# 7

నాగరాజు విస్కీ సేవిస్తున్నాడు. గదిలో ఫ్లోర సెంట్ లైట్లు ప్రకాశవంతంగా వెలుగుతున్నాయి. అతడి భార్య రమాదేవి పక్కనే కూర్చునివుంది.

టెలిఫోన్ మ్రోగింది. అతడు రిసీవర్ని అందుకొని "హలో!" అన్నాడు.

"మిష్టర్ నాగరాజ్, నీ సహచరుడు మోహన్ని షూట్ చేసి చంపావు. అదంతా నేను చూశాను. మోహన్ శవం నా దగ్గర వుంది. నువ్వు నేను చెప్పినట్లు చేయకపోతే ఆ శవాన్ని పోలీసులకు అప్పగించవలసి వస్తుంది" అందో కంఠం.

నాగరాజు గుండె దడదడలాడింది.

"ఎవరు నువ్వు?"

"పేరు చెప్పినా నువ్వు గుర్తించలేవు!"

కాస్సేపు నాగరాజు మాట్లాడలేదు. లైను విరగడి అయిందని తను అనుకున్నాడు, కాని మళ్ళీ లైను దాపరించింది.

"మిస్టర్ నాగరాజ్!"

"నీకేం కావాలి?"

"నీ మిత్రుడు నాకంతా చెప్పి కళ్ళు మూశాడు. అతడికివ్వవలసినదంతా నాకివ్వాలి రొఖ్ఖంగా!"

"ఎంత?"

"మొదట్లో 25 లక్షలియ్యి. ఇంకా యెంతివ్వాలో తర్వాత చెప్తాను."

"అతడిని నేను చంపినట్టు రుజావులేదు!"

అటువైపు వ్యక్తి నవ్వాడు.

"నువ్వు రెండుసార్లు షూట్ చేసినప్పుడు నాతో యెవ్వరూ లేకపోవచ్చు. అయినా నీ గురించి నేను చెప్తే గతంలో జరిగినదంతా బయటకు వస్తుంది. నువ్వు ఎందుకు అతడిని చంపావో అప్పుడు అర్థమవుతుంది. ఇద్దరూ కలిసి బ్యాంకిని దోచారు. పాపం, అతడు జైలుకెళ్ళి పన్నెండేళ్ళ తర్వాత తిరిగొచ్చాడు. నువ్వు సుఖంగా జీవితాన్ని సాగిస్తున్నావు!"

"నీకా డబ్బు యెలా యివ్వాలి?"

"రొక్కంగా డబ్బు రెడీగా వుంచు. 25 లక్షలు. నాకెలా ఇవ్వాలో తర్వాత చెప్తాను. పిచ్చివేషాలు వేస్తే తర్వాత చాలా కష్టపడ్తావు."

అటువైన రిసీవర్ పెట్టేసిన శబ్దం వినపడింది. నాగ

రాజు సోఫాలో కూర్చున్నాడు. రమాదేవి అతడివైపు గాభరాగా చూసింది.

"ఏమిటలా వున్నారు? ఏమైంది?"

"ఏమీ కాలేదు. గ్లాసులో విస్కీ పోయి. నన్ను డిస్టర్బ్ చెయ్యకు" అన్నాడతను.

ఆమె గ్లాసులో విస్కీ పోసి బయటకు వెళ్ళిపోయింది. అతడు విస్కీ తాగుతూ ఆలోచించసాగాడు?

ఎవరతను? తన తోటలో అతడు ఆ రోజున ఎలా వున్నాడు? ఇప్పుడు తనేం చెయ్యాలి?

టెలిఫోన్ మ్రోగింది.

"హలో, నాగరాజు" అన్నాడతను.

"మిస్టర్ నాగరాజ్, నన్ను యెలా చంపాలా అని నువ్వు ఆలోచిస్తూ ఉండొచ్చు. కాని నన్ను నువ్వు చంపలేవు! మోహన్‌లా నీ చేతుల్లో నేను చావను!"

"నిన్ను చంపాలనే ఉద్దేశం లేదు నాకు."

"డబ్బు యివ్వడానికి సిద్ధంగా వున్నావా?"

"యిస్తాను."

"రేపు మూడింటికి అన్నాదురై విగ్రహం దగ్గరవున్న సబ్‌వేలోకి దిగి అక్కడ నిలబడు. ఎర్రటి నెక్ టై వేసుకో. ఒక యాంగ్లో ఇండియన్ యువతి నిన్ను పోల్చి, నీ దగ్గరకొస్తుంది. తెచ్చావా అంటుందామె. తెచ్చాననుు. డబ్బున్న బాగ్ ఆమెకియ్యి. పదినిమిషాల్లో ఆమె నేనున్న చోటుకి వస్తుంది. ఆమె అలా రాకపోతే మోహన్ శవాన్ని పోలీసులకు అప్పగిస్తాను."

"అలాగే చేస్తాను" అన్నాడు నాగరాజు.

"మిస్టర్ నాగరాజ్, ఆ యాంగ్లో ఇండియన్ యువతిని పట్టుకొని ఆమెద్వారా నేనెక్కడున్నానో

తెలుసుకోడానికి ప్రయత్నించకు. ఆమెకు నా గురించి తెలియదు."

"నేనటువంటిదేదీ చెయ్యను. ఆమెకు డబ్బిచ్చి నా తోవన వెళ్ళిపోతాను."

"గుడ్! డబ్బు నాకు అందగానే నీకు ఫోన్ చేసి చెప్తాను" అని అతడు రిసీవర్ పెట్టేశాడు.

నాగరాజు మళ్ళా గ్లాసులో విస్కీ పోసుకొని తాగుతూ కూర్చున్నాడు. అతడు ఆలోచిస్తున్నాడు. అక్కడ ఏం జరిగిందో తను వెళ్ళి వాచ్‌మన్‌తో మాట్లాడి కనుక్కోవాలి.

వెలుగు వచ్చేముందు అతడి కారును తోటవైపు పోనిచ్చాడు.

తోటలో కారాపి దిగాడు. వాచ్‌మన్ భీముడు కారువైపు పరుగెత్తుకొచ్చాడు. నాగరాజు నలువైపులా చూశాడు. మరెవ్వరూ లేరు.

"భీమా, ఏం చేసేవు?"

"మీరు చెప్పినట్లే ఆడిని పాతేశానయ్యా" లోలోపల ఆశ్చర్యపడినా అతడు పైకి కనపర్చలేదు.

"ఎక్కడ పాతేవు?"

"రండయ్యా!" అని అతడు కదిలాడు.

భీముడు వెనకనే వెళ్ళాడతను. ఒకచోట అతడు ఆగాడు. తవ్వి, కప్పెట్టిన గుర్తులు స్పష్టంగా కనిపిస్తున్నాయి. పైన ముక్కలు నాటబడినాయి.

ఆ ప్రదేశాన్ని చూస్తూ నాగరాజు ఆలోచించసాగాడు. ఫోన్ చేసినవాడు తనని మోసం చేయడానికి ప్రయత్నించాడు. తను భయపడనక్కరలేదు.

కాని మరో ఆలోచన కటాలున మెదడులో మెది

లింది. భీముడు తన్ని మోసం చేస్తున్నాడేమో!

"భీమా!"

"అయ్యా!"

"శవం జేబులో ఒక పత్రం వుంది. అది నాకు కావాలి! తొందరగా తవ్వు!"

"ఎవరేనా చూస్తారయ్యా."

"చూడకుండా జాగ్రత్తపడదాం."

భీముడు కదల్లేదు. అలాగే వుండిపోయాడు.

"ఈపాటికది వాసనకొడ్తూ ఉంటుందయ్యా."

"అయినా తప్పదు. ఆ పత్రం నాకు కావాలి."

"ఆ పని నేను చెయ్యలేనయ్యా. మరెవరినేనా తవ్వమనండి!"

నాగరాజా అతడివైపు సూటిగా చూశాడు.

"భీమా, నువ్వు వచ్చేసరికి యిక్కడ శవంలేదు. అవునా? నిజం చెప్పు!"

అతడు మాట్లాడలేదు.

"రాస్కెల్ నిజం చెప్పు!"

"మీరిస్తానన్న వెయ్యి కోసం అబద్ధమాడానయ్యా. నేనొచ్చేసరికి యిక్కడ శవంలేదు. ఎర్రటి మరకలు నేలమీదున్నాయి. గొయ్యి తవ్వి, పూడ్చి, పైన మొక్కల్ని నాటాను. అలా యింకెప్పుడూ చెయ్యను, నన్ను కాపాడండి."

"వెళ్ళి నీ పని చూసుకో" అన్నాడు నాగరాజా.

# 8

కారును రోడ్డువారగా ఆపి నాగరాజా కిందకు దిగాడు.

అతడి చేతిలో పెద్ద బాగ్ వుంది. అతడు బ్లా

సూట్ లో వున్నాడు. ఎర్రటి నెక్ టై కట్టుకున్నాడు.

కొంచెం దూరంలో పేవ్ మెంటుమీద నిలబడిన వ్యక్తి నాగరాజువైపు పరీక్షగా చూశాడు. అతడు నల్లటి కళ్ళద్దాలు ధరించాడు. గడ్డం, వెడల్పాటి మీసాలు, తలమీద ఫెల్ట్ కాప్ ఉంది.

అతడి పక్కనే ఒక ఆంగ్లో ఇండియన్ యువతి నిలబడి ఉంది.

"లుక్, అతడే మన మనిషి!" అన్నాడతను.

"వెళ్ళనా?" అడిగిందామె.

"కొంతసేపు అతడిని నుంచోనియ్యి!"

సబ్ వే మెట్లు దిగాడు నాగరాజు. లోపల లైట్లు వెలుగుతున్నాయి. ఒకచోట నిలబడి అతడు సిగరెట్ వెలిగించాడు. పొగ పీల్చి వదులుతున్నాడు.

అనేకమంది సబ్ వేద్వారా యిటూ, అటూ కదులుతున్నారు. అతడు టైమ్ చూశాడు. మూడు అయింది.

ఒక యాంగ్లో ఇండియన్ యువతి మెట్లు దిగివచ్చింది. అతడి పక్కనుంచి పోతూ ఎర్రటి నెక్ టై చూసి ఆగింది.

"తెచ్చావా?" అడిగిందామె.

"తెచ్చాను" అని బాగ్ ను ఆమె కిచ్చాడు.

బాగ్ తీసుకొని ఆమె వచ్చిన వైపుకే వెళ్ళిపోయింది. నాగరాజు సబ్ వే ద్వారా రెండో వైపుకు వెళ్లాడు. ఆమెకోసం నలువైపులా చూశాడు.

ఆమె యెక్కడా కనపడలేదు!

అతను తన కారువైపు సబ్ వేలోంచి వెళ్ళాడు. కూర్చొని తలుపుమూసి, కారును శరవేగంగా పోనిచ్చాడు.

నాగరాజు తన గదిలో పచార్లు చేస్తున్నాడు. టెలి

ఫోన్ మ్రోగింది. అతడు రిసీవర్ ఎత్తాడు.

"హలో నాగరాజు" అన్నాడు.

"మిస్టర్ నాగరాజ్, నువ్వు పంపిన బాగ్ అందింది. 25 లక్షలు ఉంది. గుడ్ బాయ్‌లా నేను చెప్పినట్లు చేశావు. నీకు యే ప్రమాదం రాదు" అన్నాడతను.

"మిస్టర్, ఆ శవం ఇంకా నీ దగ్గర వుందా?"

"వుంది. ఎంబామ్ చేయించి చెక్కపెట్టెలో వుంచాను."

"దాన్ని కాల్చేయి! అలాకాకపోతే యెక్కడో పాతించేయి! నువ్వు అడిగినది యిచ్చాను. నే కోరినది నువ్వు చెయ్యాలి" అన్నాడు నాగరాజు.

అటువైపున మనిషి గంభీరంగా నవ్వాడు.

"కొంతకాలం పోయాక నువ్వు చెప్పినట్లు చేస్తాను. అంతవరకూ నువ్వు ఓపిగ్గా వుండాలి"

"ప్లీస్, వుంటాను."

అటువైపున రిసీవర్ పెట్టేయబడింది. నాగరాజు రిసీవర్ పెట్టేసి సోఫాలో కూర్చున్నాడు. గ్లాసులో విస్కీ పోసుకుని తాగేశాడు.

అతడు తనిచ్చిన డబ్బుతో తృప్తి పడేటట్లు లేడు. ఇంకా అడుగుతాడేమో! జీవితాంతం అతడి కిలా చెల్లిస్తూనే వుండాలేమో!

అతడు లోలోపల విచారించసాగాడు. మోహాన్ని షూట్ చేయడం తప్పయి కూర్చుంది. ఈ 25 లక్షలూ మోహన్‌కి పారేస్తే అతడు నోరు మూసుకుని వెళ్ళిపోయేవాడు. ఇప్పుడు పెనంలోంచి పొయ్యిలో పడినట్లుంది తన బ్రతుకు!

ఈసారి అతడు వఛ్ళ్ళి డబ్బడిగితే త నేదో చెయ్యాలి!
ఏదో చేసి అతడిని నిర్మూలించాలి!

# 9

రోడ్డువారగా ఆమె కారు ఆపింది. తలుపు తెర్చి, నవ్వుతూ అతడామె పక్కనే కూర్చున్నాడు. తలుపు మూశాడు.

"హై, జానకీ!" అన్నాడతను.

"హై, రవీ!" అందామె.

కారు మెల్లిగా కదుల్తోంది.

"ఎక్కడకు పోదాం?" అడిగిందామె.

"నువ్వే చెప్పాలి."

ఆమె తీయగా నవ్వింది. అతడామెవైపు ప్రేమతో చూశాడు. ఆమె చాలా అందమైన యువతి.

"రవీ, ఆకలిగా వుంది. టిఫిన్ తిని ఎక్కడికెళ్లాలో తర్వాత ఆలోచిద్దాం" అందామె.

"గుడ్ ఐడియా" అని అతడామె ఎడంచెయ్యి పట్టుకున్నాడు.

"నువ్వు చెయ్యి వదిల్తేగాని నేను గేరు మార్చలేను" అందామె నవ్వుతూ!

అతడు చెయ్యి వదిలేశాడు. హోటల్ పిక్నిక్ కాంపౌండ్‌లో ఆమె కారు ఆగింది. ఇద్దరూ కిందకు దిగారు. ఒక టేబుల్ దగ్గరకు వెళ్ళి కూర్చున్నారు.

బేరర్ రాగానే కావలసినవి ఆమె ఆర్డరిచ్చింది. అతడివైపు ఆమె నవ్వుతూ చూసింది. ఒకళ్ళనొకళ్ళు అలా చూసుకొంటూనే వుండిపోయారు.

ఆప్యాయంగా అతడామె చెయ్యి పట్టుకుని నిమిరాడు.

"జానకీ, మనం వెంటనే పెళ్ళి చేసుకుందాం" అన్నాడతను.

"నాన్నకు చెప్పాలి. ఆయన ఒప్పుకోవాలి!" అందామె.

"ఆయన వద్దంటే?" అడిగాడతను.

"ఆయన వద్దంటే మనం విడిపోవలసిందే!" అందామె నవ్వుతూ.

అతడామె చెయ్యి వదిలేశాడు. మొహాన్ని పక్కకు తిప్పుకున్నారు.

"అప్పుడే కోపం వచ్చేసింది నీకు!" అందామె కొంటెగా.

అతడామెవైపు చూశాడు.

"జానకీ, నువ్వు నా ప్రాణం. నువ్వు లేకుండా ఒక్క క్షణం కూడా నేను బ్రతకలేను. మనం విడిపోవలసిన పరిస్థితి ఏర్పడితే నే నీ లోకంనుంచే పోతాను."

"రవీ, అలా అంటే నేను ఏడుస్తాను," అందామె.

"ఐయాం సీరియస్" అన్నాడతను.

"నీ గురించి నాన్నతో చెప్తాను" అందామె.

"వెంటనే చెప్పు, జానకీ. నీ తండ్రి కోటీశ్వరుడు. నేను ధనవంతుడిని కాను. ఉద్యోగం చేసుకు బ్రతికే యువకుడిని. నా అమ్మా, నాన్నా ఏమయ్యారో నాకు వివరంగా తెలియదు. నేను ఒంటరివాడిని" అన్నాడతను.

ఇద్దరూ టిఫిన్ తింటూ మాట్లాడుతూ కూర్చున్నారు. బేరర్ బిల్ తెచ్చాడు. అతడికంటే ముందు ఆమె ప్లేటులో డబ్బు పడేసింది.

"పోదాం పద!"

ఇద్దరూ కారువైపు నడిచారు. ఆమె కారును బీచ్ వైపు పోనిచ్చింది.

చంద్రకాంతిలో యిద్దరూ ఒక పడవ పక్కన యిసుకలో కూర్చున్నారు. సముద్ర కెరటాలు హోరుమంటూ ముందుకొచ్చి, నురగలు కక్కుతూ వెనక్కి మళ్ళుతున్నాయి.

రవి నలువైపులా చూశాడు. సమీపంలో యెవ్వరూ లేరు. అమాంతంగా అతడామెను కౌగలించుకుని ముద్దెట్టుకున్నాడు.

ఆమె అతడివైపు సూటిగా చూసింది.

"రవీ, నాన్న ఒప్పుకోకపోతే మన పెళ్ళి ఆగదు. నేను యిల్లు వదలి నీతో వుండడానికి వచ్చేస్తాను" అందామె.

ఉద్రేకంతో అతడి చేతులు ఆమెను చుట్టేశాయి.

"రవీ, ఇంతవరకుముందే నాతో నీ తలిదండ్రులు యేమయ్యారో తెలియదన్నావు. గుర్తుందా?"

"గుర్తుంది, జానకీ. అమ్మ చాలా మంచిది. నాన్న కూడా మంచివాడే. నన్ను అనాధాశ్రమంలో అమ్మ వదిలేసింది. అప్పటినుంచీ అమ్మా, నాన్నా ఏమయ్యారో నాకు తెలియదు" అన్నాడతను.

అతడి చేయిపట్టుకుని ఆమె నిమిరింది.

"నీ అమ్మా, నాన్నా మళ్ళా తిరిగొస్తారేమో!" అందామె.

"అలా తిరిగొస్తే అది మన ప్రేమ ఫలంగా భావించి ఆనందిస్తాను" అన్నాడు రవి.

ఆమె టైమ్ చూసింది. ఎనిమిది దాటింది.

"పోదామా!"

"అప్పుడే!"

"ఇలా యెంత సేపు కూర్చున్నా మనసు తనివితీరదు" అందామె.

"ఇద్దరు ఆ స్థితిలో వుండడాన్నే ప్రేమంటారు" అన్నాడు రవి.

ఇద్దరూ లేచి పక్క పక్కనే నడుస్తూ కారువైపు కదిలారు. లోపల కూర్చుని తలుపులు మూశాడు. ఆమె కారును పోనిచ్చింది.

# 10

నెల గడిచిపోయింది.

అతడు రిసీవరెత్తి "హలో, నాగరాజు!" అన్నాడు.

"మిస్టర్ నాగరాజ్, మోహన్ ఆఖరి కోర్కెను తీర్చవలసిన బాధ్యత నాది. నువ్వు 75 లక్షలు రెడీగా ఉంచు!" అన్నాడతను.

"నా యింట్లో డబ్బులు రాలే చెట్టుందా?"

"వుందేమో! మోహన్ వాటాను కోటిపైన వస్తుందని నువ్వే చెప్పావట!"

"ఇదిస్తే అక్కడ ఆగుతావనే నమ్మకం ఏమిటి?"

"ఇది ఆఖరిసారిగా అడుగుతున్నాను. ఇటుపైన నిన్ను వేధించను. నువ్వు కోరిన ప్రకారం మోహన్ శవాన్ని పాతిపెట్టించేస్తాను."

"ఎలా యివ్వాలి?"

"పాత పద్ధతిలోనే. ఈసారి ఒక హిందూ యువతి నిన్ను కలుసుకుంటుంది. ఈసారి బ్లూ సెక్టై వేసుకో. రేపు రెండింటికి, సబ్‌వేలో!"

"నిన్ను నమ్మి యిస్తున్నాను. ఇటుపైన నాకు మళ్ళీ ఫోన్ చేయకూడదు."

"చెయ్యను."

నాగరాజు రిసీవర్ పెట్టేశాడు. అతడు అడిగింది పాకెట్సే కని విరగడవుతుంది!

మర్నాడు రెండింటికి నాగరాజు వెళ్ళి బాగ్ను ఒక యువతికిచ్చాడు. వెనక్కి తిరిగి ఆమె వెళ్ళిపోయింది.

నాగరాజు తన కారువైపు నడిచాడు. కారులో ఇంటికి చేరుకున్నాడు. అతడు గదిలోకి అడుగు పెడ్తూంటే ఫోన్ మ్రోగింది.

అతడు రిసీవర్ని అందుకున్నాడు.

"హలో" అన్నాడు.

"మిస్టర్ నాగరాజ్, నీ మాట నిలబెట్టుకున్నావు. నాకిచ్చినది ఆ మోహన్కి యిచ్చివుంటే అతడు ఎంతో ఆనందించేవాడు. అదంతా గతం! ఇటువైన నీకే బెంగా లేదు. నిన్ను మళ్ళా ఎప్పుడూ ఏమీ అడగను. ఆ శవాన్ని పాతిబెట్టించేస్తాను."

"థాంక్స్" అన్నాడు నాగరాజు.

రిసీవర్ని పెట్టేసి సోఫాలో కూర్చున్నాడు. గ్లాసులో విస్కీ పోసుకొని వుషారుగా తాగాడు.

గదిలోకొచ్చిన యువతి వైపు అతడు నవ్వుతూ చూశాడు.

"ఏం కావాలమ్మా?"

"నాన్నా, రవితో నాకు బాగా స్నేహమయింది. అతడు మనింటికొచ్చాడు. అమ్మను పరిచయంచేశాను. రవితో నువ్వు మాట్లాడు" అందామె.

"ఈ గదిలోకి రమ్మను" అన్నాడతను.

ఆమె వుషారుగా కిందకు వెళ్ళింది. రవితో పైకొచ్చి అతడిని తండ్రికి పరిచయంచేసి వెళ్ళిపోయింది.

ఎదురుగా కూర్చున్న రవివైపు అతడు నవ్వుతూ చూశాడు. ఏ యువతైనా అతడిని చూడగానే కలులుగనే సౌందర్యము, వ్యక్తిత్వం వున్నాయి రవిలో.

"నువ్వు ఏం చేస్తున్నావు?"

"శారదా టి. వి. కంపెనీలో యింజనీర్‌గా పని చేస్తున్నాను."

"మా అమ్మాయితో నీకు పరిచయమెలా అయింది?"

అతడు తీయగా నవ్వాడు.

"ఒక షాపులో ఆమె మర్చిపోయిన హేండ్ బాగ్‌ను నేను తీసుకెళ్ళి వాపసుచేశాను. అందులో చాలా డబ్బు వుందట. ఆ విధంగా మాకు పరిచయమైంది."

"మీ తలిదండ్రులు వున్నారా?"

"అమ్మలేదు. నాన్నగారు యెన్నేళ్ళో దుబాయిలో ఉండి యీ మధ్యనే తిరిగివచ్చారు."

"ఆయన పేరు?"

"గణపతిరావుగారు."

అప్పుడే జానకి గదిలోకొచ్చింది. నాగరాజు ఆమె వైపు నవ్వుతూ చూశాడు.

"రవితో మాట్లాడేనమ్మా, చాలా?"

ఆమె కళ్ళు చిట్లిస్తూ తండ్రివంక చూసింది.

"రవీ, నేను ప్రేమించుకుంటున్నాం, నాన్నా."

"మంచిది."

"మీరు ఒప్పుకున్నట్టేగా?"

నాగరాజు కూతురివైపు సూటిగా చూశాడు.

"అమ్మాయి, ప్రేమించుకునేవాళ్ళకు అడ్డుపడ్డం నాకిష్టంలేదు. త్వరలో నేను వెళ్ళి రవి నాన్నగార్ని కలుసుకొని మాట్లాడతాను."

"థాంక్స్ సార్! మీ మాటలు వింటుంటే ఆక్సిజన్ పీలుస్తున్నట్లుంది" అన్నాడు రవి.

రవి, జానకి బయటకు నడిచారు. ఇద్దరూ మెట్లు దిగుతున్నారు.

"మీ నాన్నగారు మంచి మూడ్‌లో వున్నారు" అన్నాడు రవి.

"ఏదో శుభవార్త నాన్నకు ఫోన్ లో అందివుంటుంది. ఆ సమయంలో నాన్నను యేమడిగినా యిచ్చేస్తాడు" అందామె.

## 11

పెద్ద కాంపౌండులో కారు ఆగించి, నాగరాజు కిందకు దిగాడు. రవి అతడిని విశాలమైన హాల్లోకి తీసుకెళ్ళి సోఫాలో కూర్చోమన్నాడు.

"నాన్నగారితో చెప్తాను" అని రవి పైకి వెళ్ళాడు.

నాగరాజు హాలు నలువైపులా చూశాడు. రవితండ్రి తనలాగే ధనవంతుడయి వుండాలి! దుబాయిలో అతడు బాగా డబ్బు సంపాదించి వుంటాడు.

మెట్లమ్మట దిగుతున్న వ్యక్తిని చూసి నాగరాజు లేచాడు.

అతడు నాగరాజుతో కరచాలనం చేసి కూర్చోమన్నాడు.

"మీ గురించి రవి ఫోన్‌లో చెప్పాడు. అమ్మాయి జానకిని కూడా చూశాను. మంచిపిల్ల!" అన్నాడతను.

"ఆమె నా ఒక్కగానొక్క కూతురు" అన్నాడు నాగరాజు.

"రవి తప్ప నాకూ ఎవ్వరూ లేరు" అన్నాడతను.

రవి లోపలకు వెళ్లాడు.

"మా అమ్మాయిని మీ అబ్బాయి పవికిచ్చి పెళ్ళి చేయాలని నా ఉద్దేశం" అన్నాడు నాగరాజు.

"ప్రేమించుకున్న వాళ్ళకు మనం తప్పక పెళ్ళి చేయాలి" అన్నాడతను.

నాగరాజు అతడివంక నవ్వుతూ చూశాడు. అతడు నల్లటి కళ్ళద్దాలు ధరించాడు. పెద్ద గడ్డం. గుబురుగా పెరిగిన మీసాలు. తలమీద కాప్.

"అయితే ముహూర్తం పెట్టిస్తాను" అన్నాడు నాగరాజు.

"పెట్టించండి!"

క్షణకాలం యిద్దరూ నిశ్శబ్దంగా కూర్చున్నారు.

"రండి పైకి వెళ్దాం" అన్నాడతను.

ఇద్దరూ మెట్లెక్కి పైకి వెళ్ళారు. విశాలమైన పడగదిలో యెదురెదురుగా సోఫాల్లో కూర్చున్నారు.

"మీరు దుబాయిలో యెన్నేళ్ళో వున్నారని విన్నాను" అన్నాడు నాగరాజు.

"వున్నాను."

"మీ కంఠం యెక్కడో విన్నట్లుంది" అన్నాడు. నాగరాజు.

అతడు నవ్వాడు.

"ఎక్కడ విన్నారు? ఫోన్‌లో వినుంటారా?" అన్నాడతను.

నాగరాజు ఉలిక్కిపడ్డాడు. తనను బ్లాక్ మెయిల్ చేసి కోటి రూపాయిలు గుంజుకున్న వ్యక్తి కంఠమే అది! కోటి రూపాయిలు లాక్కొని, దానితో తృప్తిపడక తన కొడుకును జానకికి పెళ్ళిచేసి తతిమ్మాదికూడా మింగాలని అతడు ఆశిస్తున్నాడా?

"మీ కంఠం ఫోన్‌లో విన్నాను. చాలాసార్లు."

"విసుండొచ్చు."

నాగరాజు అమాంతంగా సోఫాలోంచి లేచాడు.

"యూ ఆరే బ్లాక్‌మెయిలర్, నా కూతుర్ని నీ కొడుక్కి యివ్వను" అరిచాడతను.

"యూ ఆరే కిల్లర్! మోహాన్ని చంపావు. అయినా వాళ్ళ ప్రేమకు అడ్డుపడలేదు. పెద్దల పాపాలకు పిల్లల్ని మనం శిక్షించకూడదు."

నాగరాజు అతడివైపు చూశాడు.

"నన్ను బ్లాక్‌మెయిల్ చేసి యీ పెళ్ళి జరిపిస్తావా?" అన్నాడు నాగరాజు.

అతడు నాగరాజువైపు సూటిగా చూశాడు.

"ఈ పెళ్ళికోసం నిన్ను నేను బ్లాక్‌మెయిల్ చేయను. నా మాటమీద నేను నిలుస్తాను."

"అయితే నే వెళ్తాను, గుడ్‌బై" అన్నాడు నాగరాజు.

"ఆగు, యిలా ఒకసారి చూడు!"

నాగరాజు వెనక్కి తిరిగాడు. యెదుటి వ్యక్తివైపు చూసి స్తంభించిపోయాడు.

అతడికిప్పుడు కళ్ళద్దాలులేవు. గడ్డంలేదు. తలమీద కాప్ లేదు. యెదురుగా కూర్చున్న వ్యక్తి మోహన్!

నాగరాజు అతడి దగ్గరకెళ్ళి కాళ్ళమీద పడ్డాడు.

"మోహన్, నన్ను క్షమించు. నీకెంతో ద్రోహం చేశాను నేను!" ఏడుస్తూ అన్నాడు నాగరాజు.

"నాగా, నిన్ను క్షమిస్తున్నాను. ఆనాటి రాత్రి తోటలో యేదో నువ్వుచేసి నన్ను చంపడానికి ప్రయత్నిస్తావని ముందే వూహించాను. నీ బులెట్లు నాకు

తగ్గలేదు. రక్తం చిమ్మినట్లు నీకు అగుపిస్తే నేను చచ్చానని నువ్వు వదిలేస్తావు. నా జేబులో ఉన్న రెడ్ సొల్యూషన్ పాకెట్‌ను నోరుతో పొడిచి అందులోని ద్రవాన్ని బయటకు వదిలేను. అదంతా చూసి నేను అనుకున్నట్లే నువ్వు కారులో వెళ్ళిపోయావు. నీ కారు వెళ్ళగానే నేను లేచి అక్కడనుంచి పారిపోయాను. అటుపైన జరిగినదంతా నీకు తెలుసు."

"మోహన్, నాకు చాలా ఆనందంగా వుంది నువ్వు బ్రతికి వున్నందుకు. నీకు అన్యాయం చేశానని నేను లోలోపల యెంతో బాధపడ్డాను."

"నాగా, నా భార్య పోయినా నా కొడుకు దొరికినందుకు యెంతో సంతోషిస్తున్నాను. గతాన్ని యిద్దరం మర్చిపోదాం. మనం యిటుపైన ప్రాణ మిత్రులుగా ఉందాం. రవీ, జానకీ సుఖంగా ఐక్యంగా, ఆనందంగా జీవించాలని దేవుడిని ప్రార్థిస్తూ వాళ్ళ పెళ్ళి జరిపించుదాం" అన్నాడు మోహన్.

"ఇటుపైన నువ్వు చెప్పినదే వేదం నాకు" అన్నాడు నాగరాజు.

—: సమాప్తం :—

# అల్లుడొస్తున్నాడు జాగ్రత్త!

## చంద్రశేఖర అజాద్

గూటిలో రెక్కలు ముడుచుకొని పడుకున్న తల్లికోడి ఎందుకో భయం భయంగా చూస్తోంది.

ప్రళయమేదో రాబోతున్నట్లుంది. సిక్స్త్ సెన్స్ ఏదో జరగనుందని హెచ్చరికలు పంపుతోంది. ఒక్కసారి లేచి నిలబడి చుట్టూ చూసుకుంది. విశాలమైన ఆ గూటిలో త్వర త్వరగా తాను విస్తరింపచేసిన తన వంశాన్ని చూసింది. మనస్సు ఓ క్షణం ఆనందంతో పులకరించి పోయింది.

తన యజమాని చాలా మంచివాడు. ఇప్పటివరకూ తాము పెట్టే గ్రుడ్లు మాత్రమే తింటూ, అమ్ముకుంటూ వస్తున్నాడు. కొన్ని గ్రుడ్లను పొదిగించి తిరిగి పిల్లల్ని చేస్తున్నాడు. అందులో కొన్ని పందెం కోళ్ళుగా ఎదిగాయికూడాను. అవి పందాల్లో గెలిచాయి.

అంతమాత్రంచేత యజమానికి కోడికూరంటే ఇష్టం లేదనికాదు. ఆయనకో సిద్ధాంతం ఉంది. తను పెంచిన

కోళ్ళను తినకూడదు. తను పందెంలో నెగ్గిన వాటిని సైతం తినకూడదు. మంచో, చెడో ఈ సిద్ధాంతానికి ఇంతవరకు భంగం కలగలేదు. యజమాని రమణయ్య అప్పుడప్పుడు బయటి కోళ్ళను ఆరగిస్తూనే ఉన్నాడు.

తల్లికోడి తీవ్రంగా ఆలోచిస్తోంది. రాబోయే ప్రమాదం ఏ రూపంలో ఉంటుందో అర్థంకావటంలేదు. ప్రమాదం ముంచుకు రాబోతుందనేది మాత్రం స్పష్ట మయింది. అంతలోనే కళ్ళకు వెలుగు రేఖలు ఒక్కసారి అడ్డంవచ్చాయ్. గూటి తలుపులు తెరుచుకున్నాయ్....

రమణయ్యకు ఒక్కతే కూతురూ, కొడుకూ నూ. రమణయ్యను పున్నామ నరకంనుండి బయటపడెయ్య టానికి కొడుకుండాలని పురాణాలు చెప్పాయి కాబట్టి, వాడు లేకుంటే ఆ నరకంలోనేపడి కొట్టుకు చస్తానే మోననే బాధలేదుగానీ, తన వంశమంతా చరిత్ర పుటల వెనక్కు వెళ్ళిపోతుందే అనే బాధ. అంతమాత్రాన రమణయ్య యెవరినీ దత్తు తీసుకోలేదు.

రమణయ్యకు కూతుర్తోపాటు, నాటుకోళ్ళ పెంపకం ఉంది. కొంత పొలం ఉంది. బ్యాంకులో సొమ్ముంది. ఆ గ్రామంలో మంచి కొంపుంది. రమణయ్య కూతురికి వయ సుంది. అందుకోసం అల్లుడ్ని చూడాల్సిన అవసరంవుంది. ఆ వేటలో అయనున్నాడు.

మరో కార్యక్రమంలో ఉంటే కోళ్ళూ, పొలాలూ దెబ్బతిని పోతాయేమోననే భయంలేదు. పది సంవత్సరాల క్రితం "రాముడు" వాళ్ళింటికి వచ్చాడు. రాముడు రమణయ్యకు అల్లుడవుతాడు. స్వయంగా మేనల్లుడుకాదు. దూరంగా యెక్కడో చుట్టరికం. తల్లిదండ్రులు చనిపోతే రమణయ్యే తీసుకొచ్చి తన దగ్గర పెట్టు

కున్నాడు.

పొలంపని, ఇంటిదగ్గర పని చూసుకోవటం రాముడి వంతు. రాముడు నల్లగా ఉంటాడు. జుట్టు ఉంగరాలు తిరిగి ఉంటుంది. కండలు పొంగి ఉంటాయి. కళ్ళు చురుగ్గా ఉంటాయ్. మూడో తరగతి దాకా చదివాడేమో తీరిగ్గా ఉన్నప్పుడు ఏ పుస్తకమన్నా, పేపరుముక్కన్నా దొరికితే అందులో అక్షరాలు గుర్తుపట్టి చదువుకుంటాడు.

రమణయ్య కూతురు పెద్ద అందగత్తెకాదు. ఆ అమ్మాయికూడా నల్లగా ఉంటుంది. అయినా ఆ నలుపులోనే ఓ రకమైన అందం ఉంది. పదో తరగతి పూర్తయ్యాక చదవనంది. చదవటం వాళ్ళమ్మకూ, నాన్నకూ ఇష్టంలేకున్నా ఆ మాట ఆ అమ్మాయి నోటినుండి విని సంతోషించారంతా. ఇప్పుడా అమ్మాయికి కోళ్ళను సాకటంతో ప్రొద్దు గడుస్తుంది. రాముడితోపాటు కోళ్ళకు మేత వెయ్యటం, గ్రుడ్లు ఏరటం, మిగిలిన పనులు చేయటం చేస్తుంది.

రాముడికి లక్ష్మి అంటే ఇష్టం. ఆ అమ్మాయి కళ్ళు గుండ్రంగా తిరిగితే బాగుంటాయి. లంగా, ఓణీ వేసుకుని అటూ, ఇటూ హడావుడిగా తిరుగుతుంటే ముఖంమీదకు జారిపడే వెంట్రుకలను చూస్తే ఇష్టం. పమిట నడుంచుట్టు త్రిప్పి బిగించి నడుంమీద చేతులు వేసుకుంటే చూడటం ఇష్టం. ఇంకా పొలాల పచ్చదనం, దొడ్లో విచ్చుకున్న గులాబి పువ్వు రాముడికి ఇష్టం. లక్ష్మిని చూసినా, గులాబిని చూసినా రాముడికిష్టం.

ఆ ఇష్టానికి అంతకుమించి వేరే భావాలేం లేవు. ఆలోచనలూ లేవు. రాముడికి భవిష్యత్తు గురించి కూడా ఎటువంటి ఆలోచనాలేదు. ఈసారి పొలం యెంత పండు

తుంది? కోళ్ళు పెంపకం లాభంగా ఉందా? లేదా? పందెంలో ఈసారి గెలుస్తామా? అంతకుమించి దేన్ని గురించి ఆలోచించడు.

## 2

రమణయ్య పెళ్ళి వేటలో జగన్నాధం తగిలాడు.

జగన్నాథం ప్రభుత్వంవారి ఉద్యోగం చేస్తున్నాడు. పెళ్ళికి యెదిగివున్నాడు. గ్రాడ్యుయేట్ అయివున్నాడు. కాగా మంచి రేటిచ్చి కొనుక్కుపోవచ్చు. జగన్నాథం గురించి రమణయ్యకు గాని, ఆయనకు చెప్పినాయనకుగాని పెద్దగా తెలీదు. జగన్నాథం తెల్లటి ఇస్త్రీ బట్టల్లో మడత నలగకుండా వస్తాడు. పెదాలమీద రెడీమేడ్ చిరునవ్వు ఉంటుంది. క్రాపుమాత్రం వంకరటింకరలుగా ఉంటుంది.

జగన్నాధాన్ని సరిగ్గా తెలుసుకోవాలంటే ఆ వేవో థాట్ రీడింగ్ మెషీన్లొచ్చాయట — వాటివల్లనే సాధ్యం. లేకుంటే అతనితో కొంతకాలం సన్నిహితంగా ఉండాలి.

జగన్నాథం వయస్సు నాల్గింట ఓ వంతు గడిచి కూడా ఏణ్ణర్ధం కావస్తోంది. ఆ నడుమ ఓ ముఖ్యమంత్రి గారి పుణ్యమంటూ వర్క్ ఛార్జ్‌డ్ నుండి ఖాయం చెయ్య బడ్డాడు. ఇప్పుడు పూర్తిగా ప్రభుత్వోద్యోగే. పూర్తి హక్కులున్నాయి జనాన్ని తింటానికి.

జగన్నాధానికి ఇంతవరకు సంబంధాలు రాలేదను కుంటే పొరపాటు అవుతుంది. ఆయన దగ్గరకు చాలా మంది వచ్చి తమ తమ కూతుర్లను కట్టుకొని ధన్యుల్ని చెయ్యమన్నారు. అందులో కొందరు "నీ యెనకాల ఎంతైనా ఉండనీ ఫర్వాలేదు. మేమింతిస్తాం" అంటూ

రాయబారం పంపేరు.

"ఎనకాల ఎర్రగాని లేదు. ఏం చూసుకు ఇస్తారయ్యా మీరు" అంటూ వాళ్ళను కొంతమంది నిలదీసేరంట కూడాను.

"పిచ్చోడా. ప్రభుత్వంలో ఉద్యోగమంటే పదెకరాల పెట్టు. అందులోనూ కుర్రాడు బహు చురుకైనవాడు" అంటూ వివరణలిచ్చారట.

అంచేత జగన్నాధం "ఫలానా" మొత్తాన్ని కూడా తిరస్కరించేడు. అందుకు కారణం లేకపోలేదు. జగన్నాధంకో ప్రిన్సిపల్ ఉంది. తనకొచ్చే అర్ధాంగి వాళ్ళ బాబుకు ఏకైక సంతానం అయివుండాలి. సదరు మావగార్కి మంచి ఆస్తులుండాలి. "దాని" అమ్మా, బాబూ ముసలివారుగా ఉంటూ, రేపో, మాపో పోయేవారుగా ఉండాలి. అందుకోసం విక్రమార్కుడి కార్యక్రమం తీసుకున్నాడు.

కొన్ని సంబంధాలలో కూతురొక్కతెనూ, దరిద్రం బోలెడంత ఉంది. మరికొన్ని సందర్భాలలో ఒక్క కూతురే ఉన్నా, యెవరినో దత్తు తీసుకున్నారు. ఇంకా కొన్నింటిలో వాళ్ళేమో ఇప్పట్లో చచ్చేట్లు లేరు. చాలా కాలం చూసేక తన నిర్ణయం మార్చుకోక తప్పదనిపించింది. ఈ రోజుల్లో ఒక్క కూతురుండి, కాటికి కాళ్ళు చాపుకుని ఉండేవారు దొరకటం కష్టమని నిర్ణయించుకున్నాక కొన్ని ఎమెండ్ మెంట్స్ తప్పలేదు.

కాగా జగన్నాధం రమణయ్యగారి సంబంధం విన్నాక ఇది బాగానే ఉందనుకున్నాడు. వెంటనే పెళ్ళిచూపులకు గ్రీన్ సిగ్నల్ ఇచ్చాడు ...

పెళ్ళిచూపులకు వెళుతుంటే ఆలోచనల్లా కాబోయే

మావగారు ఏం టిఫిన్ పెడతారనే. వాటినిబట్టి మావగారి స్థాయిని, అభిరుచిని అంచనా వెయ్యొచ్చు. జగన్నాథం వరకు మితంగా భుజిస్తాడు. సొంత డబ్బులయితే రెండ్రోజులు భోజనం లేకున్నా రెండు ప్లేట్ల ఇడ్లీలతో ఎడ్జస్టు కాగలడు.

జగన్నాథం సన్నగా ఉంటాడు. ఆయన్ని నిలబెట్టి, చొక్కా పైకితీసి మొత్తం యెముకలు లెక్క చెప్పవచ్చు. ఆ చొక్కా క్రింద నల్లటి బనీను ఉంటుంది. అంటే నల్లటి రంగుది కాదు. అది ఉతికి వారంరోజులవుతుంది. ఆయన బనీన్లూ, డ్రాయర్లు వారానికోసారే ఉతకబడతాయి. పైన చొక్కా, ప్యాంటూ మాత్రం చక్కగానూ, ఇస్త్రీగానూ ఉంటాయి. ఆయన శరీరం మీద నల్లటి మచ్చలుంటాయి. దేహంమీద మచ్చలుండటం నేరం కాదుగాని ఆలోచనలనిండా అవే మరి. ఆయన దగ్గర నేర్చుకోవాల్సిన పాఠాలు అనంతం.

పెళ్ళిచూపులకెళ్ళిన జగన్నాథం రమణయ్యగారింటి ముందు దిగగానే ఆ పరిసర ప్రాంతాల్ని గమనించేడు. జగన్నాథం వెంట స్నేహితులెవ్వరూ రాలేదు. స్నేహితులతో రావటం అతనికిష్టంలేదు. "పార్టీ ఇవ్వవయ్యా" అంటూ బలవంతం చేస్తారు. ఎంతలేదన్నా ఓ వంద ఖర్చవుతుంది. అంచేత యేకంగా పెళ్ళినాడు పిలిస్తే, మావగారు పెట్టే భోజనాలు తినిపోతారు. ఎటూ శెలవులు పూర్తయ్యేనాటికి పాత పెళ్ళికొడుకవుతాడు. పార్టీ సమస్యే ఉండదు.

జగన్నాథానికి ముందు కోళ్ళగూడు కనపడింది. దాన్నిండా నాటు కోళ్ళున్నాయి. మనసు సంతోషంతో పొంగిపోయింది మరోప్రక్క చావడిలో బలమైన గేదెలు

కట్టేసి ఉన్నాయి. "ఎన్ని లీటర్లిస్తాయబ్బా" అని ప్రశ్నించుకొని "అయిదారు లీటర్లివ్వొచ్చు" అని సమాధానం చెప్పుకున్నాడు.

మరో ప్రక్క ఎత్తుగా ఉండి, నిలబడ్డ పందెంకోడిని చూశాడు. యెందుకో ఆ కోడ్ని చూడగానే శరీరం గగుర్పొడిచింది. దాని కాళ్ళవంక చూశాడు. పదునైన కత్తుల్లా ఉన్న కాటాలవంక భయం, భయంగా చూసేడు. వెంటనే సంతోషం కూడా కలిగింది. ఎన్ని పందాల్లో యెన్నెన్ని కోళ్ళను కొట్టుకొస్తుందో కదా అని తృప్తిపడ్డాడు. అకస్మాత్తుగా జగన్నాథం చూపులూ, ఆ పుంజు చూపులూ కలిశాయి.

"కొక్కొరకో" అంటూ ఉద్రేకంగా అరిచింది జగన్నాథం ఉలిక్కిపడుతుండగా.

"రండి....రండి" అంటూ వచ్చేశారు రమణయ్యగారు.

భుజాలో సారి నైసుగా ఎగరేసి ముందుకు నడిచాడు. అతని వెంట ఆయన అన్నగారు సేవకుడిలా నడిచాడు. జగన్నాథానికి బాబులేదు. అమ్మ మాత్రం వాళ్ళ ఊళ్లో అన్నదగ్గరుంది. ఆ యింట్లో చదువుకొని ఉద్యోగం చేస్తుంది ఇతనొక్కడే. కాగా ఆ వంశాన్ని ఉద్ధరించేది జగన్నాథమే కనుక పెద్దా చిన్నా అందరికీ ఆయనంటే భయమూ.... భక్తినూ.

జగన్నాథం కూర్చుంటూ చుట్టూ కేసి చూశాడు. తళ తళలాడింది. జగన్నాథం కళ్ళు మిలమిలలాడేయి. ఇంట్లో ఓ మూల పేర్చిన ధాన్యం, మినుముల బస్తాలు పలకరించాయి. గోడలకు వ్రేలాడుతున్న ఫోటోల్లో యెవరెవరో ఉన్నారు.

"మంచితీర్థం పుచ్చుకుంటారా" రమణయ్యగారు విన

యంగా అడిగాడు.

"మంచితీర మేనా" మనసు చివుక్కుమంది. "తొందర పడకు" తిరిగి తానే హెచ్చరించుకొన్నాడు.

"నాకో గ్లాసివ్వండి" అన్నాడు వాళ్ళన్న.

"అలాగే" అంటూ రమణయ్య లోనికి వెళ్ళి స్టీలు చెంబులో నీళ్ళు తెచ్చి గాజుగ్లాసులో పోసిచ్చాడు. జగన్నాధం ఇంటి పైకప్పువంక చూసి దూలాలు లెక్క వేస్తుండగానే ఈ సంబంధం గురించి చెప్పిన పెద్దమనిషి రానేవచ్చాడు.

"రండి, రండి" అంటూ ఆయన్నికూడా ఆహ్వానించేక, ఆయనవంక పెళ్ళికొడుకు స్టైయిల్లో ఓ చిరునవ్వు పారేశాడు జగన్నాధం.

రమణయ్యగారు లోనికి వెళ్లాడు. యెవరో చిన్నపిల్ల ట్రేలో కొన్ని ప్లేట్లు తెచ్చి అక్కడున్న టీపాయ్‌మీద సర్దింది. మైసూర్‌పాక్, జాంగ్రీ....పకోడి.

"తీసుకోండి" అన్నాడు రమణయ్య ప్లేటు పెద్దమనిషి కందిస్తూ.

"తీసుకోరా" అంటూ జగన్నాధం అన్నగారు ప్లేటు చేతిలోపెడుతూనే, జాంగ్రీ ఒకటి నోట్లో పెట్టుకొని కొరికేశారు. తియ్యటి రసం నోట్లోకి వెళ్ళగానే

"ఎక్కడ తెప్పించారండి" అనడిగేడు.

"అబ్బే....ఇంట్లోనే చేశాం" అన్నాడు రమణయ్య.

"నిజంగా."

"మా అమ్మాయే చేస్తుంట."

"చాలా బాగుంది."

జగన్నాధానికెందుకో ఆ సంభాషణ నచ్చలేదు. టిఫిన్లు పూర్తయ్యాక, కాఫీత్రాగి, వక్కపొడి వేసు

కున్నాడు.

"మరింక ఆలస్యం యెందుకు అమ్మాయిని తీసుకొస్తే పోలా" అన్నాడా పెద్దమనిషి.

"ఆఁ" అంటూ రమణయ్య లోనకు వెళ్లాడు.

"రామ్మా" అంటూ వచ్చి కూర్చున్నాడు.

పట్టుచీరలో మెల్లగా నడుచుకుంటూ వచ్చి....జగన్నాథానికి ఎదురుగా కుర్చీలో కూర్చుంది తలవంచుకొని.

పట్టుచీర కంచిదా, ధర్మవరందా అని అనుమానం వేసింది. మెడలో రెండు గొలుసులున్నాయి. చేతులకు ఆరు గాజులున్నాయి. తలమీద, జడమీద....ఫర్వాలేదు. మొత్తం అన్నీ కలిసి పది సవర్లకి పైబడి ఉండొచ్చు. గుమ్మంకేసి చూశాడు. ఆమె అత్తగారయి ఉండొచ్చను కున్నాడు. ఆమె మెడలో గొలుసులూ, చేతులకు బంగారపు గాజులూ ఉన్నాయ్. జగన్నాథం మనస్సు సంతృప్తితో నిండిపోయింది.

"తలెత్తి చూడమ్మా" అన్నారాయన.

భయంగా ఒక్కసారి తలెత్తిచూసి దించుకుంది. కళ్ళ ముందు ఓ ఆకారం కనిపించింది. అయితే పూర్తిగా ఏం అర్థంకాలేదు. ఆ ముఖం యెలా ఉంటుందో తెలియదు. మరోసారి చూద్దామనుకుంది. కాని సిగ్గువేసింది.

"ఇంక లోపలకు వెళ్ళమ్మా" అన్నాడాయన.

లక్ష్మి లేచి ఓ క్షణం క్రీగంట చూసింది. వెంటనే నడుచుకుంటూ వెళ్ళిపోయింది. జగన్నాథం కళ్ళు మెరవటం రమణయ్య గమనించేశు.

"సరే. ముహూర్తం విషయం ఆచారిగారితో సంప్రదించి మిమ్మల్ని కలుస్తాను" అన్నాడు రమణయ్య.

"ఇంక మాట్లాడేదేముంది. అయునకుంది ఆ అమ్మాయి.

ఉన్నదంతా ఆమెకే" అంటూ గలగలమని నవ్వాడు పెద్దమనిషి.

"మేం వెళ్ళొస్తాం" అన్నాడు జగన్నాథం అన్న.

"మంచిది" అంటూ అందరూ లేచారు.

రమణయ్యగారు బయటికొచ్చారు, సాగనంపటానికి. జగన్నాథం బయటకు రాగానే గడ్డిమోపు తీసుకెళ్తూ రాముడు కన్పించాడు.

"ఎవరతను?" జగన్నాథం అన్న ప్రశ్న.

"మావాడే" రమణయ్య జవాబు.

ముందుకు కదిలారంతా. జగన్నాథం మనసులో ఓ నిమిషం అనుమానం. "మావాడే అంటే?" బహుశా "మా జీతగాడయి ఉండొచ్చు" అని సరిపెట్టుకున్నాడు.

# 3

శోభనం గదిలో విసుగ్గా కూర్చుని వున్నాడు జగన్నాథం. అంతకుముందే భోజనం అయింది. అయితే అందులో పప్పు, కూరగాయలు మాత్రమే ఉన్నాయి. కోడికూర లేదు. అందుకే కోపంగా ఉంది. మొత్తంగా తొలిరోజు అనుభూతినే చెడగొట్టారు. కమ్మటి నెయ్యి, గడ్డపెరుగు, బాగానే వున్నా కోడిలేని కూరలూ ఒక కూరలా?

గదిలోకి లక్ష్మి అడుగుపెట్టింది. చేతిలో పాలగ్లాసు ఉంది. మంచం ప్రక్కన స్టూలుమీద స్వీట్లున్నాయి. అరటిపళ్ళున్నాయి. జగన్నాథం లేచి వెళ్ళి తలుపు గడివేశాడు. లక్ష్మిని నడిపించుకొచ్చాడు. గ్లాసు స్టూలు మీద ఉంచింది.

"రా....కూర్చో" అన్నాడు.

సిగ్గుగానే కూర్చుంది.

"ఏం చదివావ్?"

"పది."

"పాసయ్యావా?"

తలూపింది.

"తర్వాత చదవలేదా?"

"ఇష్టంలేదు."

"గుడ్."

"మీ బళ్ళో అబ్బాయిలుండేవారా?"

"ఆఁ."

"అందులో ఎవరు బాగా చదివేవారు."

"ఏమో."

"సరే. నీకేం ఇష్టం."

లక్ష్మి మాట్లాడలేదు.

"పోనీ నాకేం ఇష్టమని అడుగు."

లక్ష్మి ఆశ్చర్యంగా చూసింది.

"నాకు కోడికూరంటే ఇష్టం. నా మొదటికోజు కోడికూర తినాలనుకుంటుండేవాడిని. మీ నాన్నేమో పప్పు భోజనం పెట్టేడు. ఇంతకూ ఆ కోళ్ళన్నీ మీవేనా?"

"మావే."

"సరే. ఆ జీతగాడికి ఎంతిస్తారు?"

"ఏ జీతగాడు?"

"అదే మీ ఇంట్లో లేడూ."

"ఆయనకా."

"ఆయనా" అనుమానంగా అన్నాడు.

"అతను మాకు దూరపు బంధువు. మా ఇంటికొచ్చి చాలా సంవత్సరాలయింది. మా పొలాలు చూస్తుంటాడు."

"నీకేం అవుతాదేం."

"ఆ తగాదుకు కాబోలు."

"వరసేనన్న మాట."

"దగ్గరోళ్ళు కాదు."

"మీ ఇంట్లోనే ఉంటాడా?"

"ఆఁ."

"మీనాన్నేమన్నా రాసిస్తాడా?"

"నాకు తెలియదు."

జగన్నాథానికి ప్రమాదం ముంచుకురానున్నదనిపించింది. ఇదేదో గూడుపుఠాణి వ్యవహారంలా ఉందే అనుకున్నాడు.

"సరే రేపయినా కోడికూర ఉందా?"

లక్ష్మికి తిరిగి ఆశ్చర్యం కలిగింది.

"అమ్మకు చెబుతా."

"ఆమె మీ నాన్నకు చెబుతుందా?"

లక్ష్మి మాట్లాడలేకపోయింది.

"వధువ కోడికూరకు కమీషన్ వెయ్యాలా ఏమిటి? ఆ మాత్రం నువు వండించలేవా?" అని నవ్వేడు తిరిగి. లక్ష్మి వెర్రి నవ్వు నవ్వింది.

"వండిస్తాను లెండి."

టైము పదకొండు దాటింది. లక్ష్మి పెట్టుకున్న మల్లెపూలు మత్తెక్కిస్తున్నాయి.. జగన్నాథం ఇంకా వాటి వంక చూడలేదు. తొలిరోజు గురించి లక్ష్మి ఎంతో ఊహించుకుంది. పెళ్ళిచూపులప్పుడు చూసినప్పుడే ఏమిటో అనిపించింది. రాముడితో పోలిస్తే పిట్టలా వున్నాడు. ఆయన చేసే "గవర్నమెంటు ఉద్యోగం" గురించి అమ్మ, నాన్నా మాట్లాడుకుంటుంటే వింది.

పెళ్ళి గురించి ప్రత్యేకంగా ఏనాడూ లక్ష్మి ఆలోచించలేదు. తల్లి తండ్రులు ఏం చేసినా తన మంచికోసమే చేస్తారనే భావం ఆమెకుంది. అందుకే జగన్నాథాన్ని చూసి కొంత నిరాశపడ్డా అంతగా పట్టించుకోలేదు.

పన్నెండు గంటలదాకా యేవేవో అడుగుతూనే ఉన్నాడు. ఆ తర్వాత లక్ష్మిని చేతుల్లోకి తీసుకొని సినిమా స్టయిల్లో గుండెలకు అదుముకున్నాడు. ఆయన రాసుకున్న సెంటువాసన గుమ్మంది. తొలిసారిగా పురుష స్పర్శకు లక్ష్మి శరీరం పులకరించింది. అయినా మనసు రేపు కోడికూర వండించాలంటూ హెచ్చరిస్తూనే ఉంది.

తెల్లవారింది.

లక్ష్మి లేచి వెళ్ళింది. స్నానం పూర్తయ్యాక అమ్మ దగ్గరకు వెళ్ళింది.

"ఏయ్ అబ్బాయి లేచాడా" అంది వెంకటరత్నమ్మ.

"ఇంకా లేవలేదు. లేస్తారుకానీ, ఈ రోజేం కూర వండుతున్నావు" అనడిగింది.

"అదేమిటే అలా అడుగుతావ్."

"ఆయనకు కోడికూరంటే ఇష్టమట. అందుకని."

"రేపు ఆదివారం వండుదాములే."

"కాదు. ఈ రోజే కావాలట."

రత్నమ్మగారు మాట్లాడలేకపోయింది. ఏమయినా కాలం మారిపోతోందనుకుంది. "పెళ్ళయిన ఆరునెలలు దాకా ఆయన మొఖంలోకి చూడటానికే సిగ్గేసింది. తెల్లారేసరికల్లా ఏం కావాలో చెప్పేస్తుందే" అనుకుంది.

"అలాగేలే. ముందు లేచాడేమో చూడు. కాఫీ ఇచ్చి వద్దువు" అంది.

లక్ష్మి గదిలోకి వెళ్ళింది. జగన్నాథం ఇంకా నిద్ర

పోతూనే ఉన్నాడు. అప్పటికి టైము ఎనిమిదిగంట లయింది. తలుపు దగ్గరకు వేసి వచ్చింది. వెంకటరత్తమ్మ రమణయ్య దగ్గరికెళ్ళి విషయం చెప్పి

"మరి రాముణ్ణన్నా పంపించి యెక్కడో చోట కోడ్ని తెప్పించు" అంది.

"రేపు ఆదివారం కొద్దామనుకున్నాంగా."

"సరే. ఆ అబ్బాయికి ఈ రోజే తినాలనుందట."

రమణయ్య విసుగ్గా లేచి, రాముణ్ణి పిలిచి చెప్పాడు.

రాముడు పనాపి బయలుదేరాడు. అరగంట తర్వాత తిరిగొచ్చి "ముప్ఫైరూపాయలై తేగాని యివ్వరంట. తెమ్మంటారా" అన్నాడు.

"మరీ అంత రేటా?" అన్నాడు రమణయ్య.

"ఆగు చెప్తాను" అంటూ లోపలకు వెళ్ళాడు.

"ముప్ఫై రూపాయలు చెబుతున్నారంట తెప్పించ మంటావా" అని భార్య సలహా అడిగాడు. వెంకట రత్తమ్మ కొంచెం సేపు గుబగుబలాడింది.

"ఏం చేస్తాం, తెప్పించు. కొంచెం అల్లమ్ముక్క, గస గసాలు కూడా కట్టించుకురమ్మను" అంది.

రమణయ్య ఆ విషయమే చెప్పాడు.

రాముడు వెళ్ళి అల్లంముక్క, గసగసాలు మాత్రం తెచ్చాడు. కోడ్ని యెవరో కొనుక్కుపోయారట. ఇంక అమ్మేవిలేవు. రమణయ్యకేం చెయ్యాలో తెలీక అమ్మాయికి చెబుదాం అనుకున్నాడు.

అప్పుడే జగన్నాథంలేచి నోట్లో నీళ్ళుపోసుకొని పుక్కిలిస్తున్నాడు. యెదురుగా కోళ్ళగూడు ఉంది. వాటిలో పిల్లల్ని చూస్తుంటే నోరూరుతోంది. అక్కడ కొచ్చిన లక్ష్మివంక చూస్తూ,

"గుడ్లుపెట్టే కోడయితే భలే మజా వస్తుందికదూ" అన్నాడు.

"అవును" అంది లక్ష్మి ఏమనాలో తెలీక. రమణయ్య గుండెలో రాయి పడింది. ఇంతకాలం అనేక కోళ్ళు పెంచాడు. ఏనాడూ తినెరగడు. ఈ రోజు తొలిసారిగా తన సిద్ధాంతానికి భంగం కలగబోతుంది. ఆ విషయం తలుచుకుంటే దుఃఖం వచ్చింది. అయినా ఏంచేయగలడు? కాదంటే బావుండదు. అవమానం చేసినట్లుంటుంది. భారంగా వెనక్కి వెళ్ళి రాముడ్ని పిలిచాడు.

"అందులో ఓ కోడ్ని కోయించు."

"మనకోడినా" నమ్మలేనట్లు అడిగాడు.

"అవునురా."

"నేను కోయలేను."

"సరే, సాయిబును పిల్చుకురా."

రాముడు బాధగా వెనక్కి తిరిగాడు.

ముఖం కడగటం పూర్తిచేసిన జగనాథం వంక అనుమానంగా చూసింది తల్లికోడి. ఆ ముఖంలో ఉన్న కాంక్షను అవగాహన చేసుకుంది. ఈ రోజెందుకో ఇంకా గూటి తలుపులు తెరుచుకోలా. మరో అరగంటలో ప్రమాదం ముంచుకురాబోతుందని ఆ క్షణం తల్లికోడికి తెలియదు.

నాలుగు గంటలు గడిచాయి.

ఆ ఇంట్లో జగన్నాథం ఒక్కడే తృప్తిగా భోం చేశాడు.

"గొప్పగా ఉందోయ్. ఆ హోటళ్ళలోపడి ఫారం కోళ్ళను తినటం తప్పించి, నాటుకోడి రుచిచూసి చాలా కాలమయింది" అన్నాడు. లక్ష్మికూడా మజ్జిగన్నంతో నే

లేచింది. ఆ ఇంట్లో పెరిగిన కోడిని కొయ్యటం ఇన్ని సంవత్సరాల్లో ఇదే తొలిసారి.

రమణయ్యకు "అల్లుడివాత" అంటే ఏమిటో ఆ రోజే బలంగా తెలిసొచ్చింది.

## 4

అక్కడ సమావేశం అయిన కోళ్ళు కనీసం రెక్కలు కూడా కదల్చకుండా నిశ్శబ్దంగా రోదిస్తున్నాయి. ప్రపంచమంతా చీకటితో కప్పబడివుంది. ఆ చీకట్లో నే వాటి కళ్ళు మెరుస్తున్నాయి. తల్లికోడి మెల్లగా గొంతు విప్పింది. ఆ గొంతునిండా అంతులేని విషాదం వుంది. అందుకే గాద్గదికంగానే మొదలయ్యాయ్ మాటలు.

"ఈ నడుమకాలంలో గొప్ప ప్రళయమేదో ముంచుకు రాబోతున్నదని నాకర్థం అయింది. అయితే అదే రూపంలో వుంటుందో ఇన్నాళ్ళు అర్థంకాలేదు. ఈ రోజున ఈ ఇంటికి అల్లుడి రూపంలో ఆ ప్రమాదం వచ్చిందని అర్థమయింది. ఇన్నాళ్ళు మన యజమాని తన సిద్ధాంతాన్ని కాపాడుకుంటూ వస్తున్నాడు. ఆయన తన చేతుల్లో పెంచిన మనల్ని చంపటానికి యేనాడూ ప్రయత్నం చెయ్యలేదు. కేవలం మనం పెడుతున్న గుడ్లని అమ్ముకుంటూ వస్తున్నాడు. కానీ క్రొత్తగా వచ్చిన అల్లుడికి ఇలాంటి సిద్ధాంతాలేమీ లేవని అర్థం అవుతోంది. పైగా వాడి ముఖం చూస్తుంటే మన జాతిని సర్వనాశనం చేసిగాని వదలడనిపిస్తోంది. ఇలాంటి పరిస్థితుల్లో ఈ రోజు మననుండి దూరమయిన నా బిడ్డపట్ల నా హృదయం తీవ్రమైన శోకంతో నిండివుంది."

తర్వాత మాట్లాడలేకపోయింది. ఒక్క క్షణం కోళ్ళన్నీ కదిలిపోయాయ్. ఆ తర్వాత బలయిన కోడి

ఆత్మశాంతికోసం మానందాల్చాయ్.

అప్పుడు లేచి నిలబడింది యువకోడి.

"ఇది అన్యాయం, దారుణం" అరిచింది.

అంతా నిశ్శబ్దం.

"ఏదన్యాయం, యేది దారుణమనుకుంటున్నారు. మన సోదరుడు గొంతు కొయ్యటమే అన్యాయంకాదు. వాడ్ని నూనెలో వేల్చుకుని నమిలి మింగటమే అన్యాయం కాదు. ఒక పుణ్యాత్ముణ్ని క్షోభ పెట్టడం అన్యాయం. ఇన్నేళ్ళూ ఈ దొడ్డిలో స్వేచ్ఛగా తిరిగాం. ఏనాడైనా ప్రకృతి వైపరీత్యాలకు మన జాతి నష్టపడిందేమోగాని ఇక్కడ జీవహింస జరగలేదు. అలాంటిది కేవలం అల్లుడి కోసం తల వంచాడు. ఈ లోకంలో అల్లుడనేవాడు యెంత దుర్మార్గంగా వుంటాడో మరోసారి ఋజువయ్యింది. మనం యేదో ఒకటి నిర్ణయించుకోవాలి. లేకుంటే రేపు నేను..ఎల్లుండి మరొకరు బలికావలసిందే. దీనికి అంతం లేదా అనేదే ప్రశ్న" వుద్రేకంగా ప్రశ్నించింది.

"మాండబ్బాయ్" అంది ముసలికోడి.

"ఏమిటన్నట్లు" చూసిందావైపు.

"కోళ్ళు పుట్టిందెందుకు?"

"తాతా....ఏమా ప్రశ్న?" అంది కోపంగా యువకోడి.

"అవును నాయనా మానవజాతి ఆరగించటంకోసమే మనంపుట్టాం. కాబట్టి నువ్వు గొంతు చించుకుని లాభంలేదు. మీకీ ప్రపంచం గురించి బొత్తిగా తెలీదు. జాతర్లలో బలులివ్వటానికి మనమే. కంట్రాక్టర్ బిల్లులు కావాలంటే

మనమే నైవేద్యం. త్రాగుబోతు పంటిక్రింద మెత్తగా తగి
లేది మనమే. ఎటు చూసినా మానవజాతి మనల్ని నిర్దా
క్షిణ్యంగా అరగిస్తూనే వుంది. మనం యెంత పెరిగితే అంత
ఆనందం వాళ్ళకి. వాళ్ళకు మనల్ని చూస్తే తినబుద్ధి అవు
తుంది. ప్రేమ కలగదు. మనం పోట్లాడుకుంటుంటే వారికి
ఆనందంగా వుంటుంది. మనమీద పందాలు కాస్తారు. మన
మూలంగా సామ్రాజ్యాలు కోల్పోయారట. కాబట్టి
వాళ్ళను యెదిరించి మనమేం చెయ్యలేం. సమస్త కోళ్ళ
జీవితం మానవ భోజనార్పితం" అంది.

"ముసలివాళ్ళ మాటలు ఇలానే వుంటాయ్. మాన
వుల ఆహారం కోసమే మనం పుట్టించబడ్డామనటం
ద్రోహం. గతంలో మనుష్యుల్ని మనుష్యులే పీక్కుతినే
వారని నేను విన్నాను. ఈ రోజుకూడా అలా తింటు
న్నారా? ఆ పద్ధతులు మారిపోయాయి. గతంలో యీ
మనుష్యులే మొగుడు ఛస్తే దాంతోపాటు భార్యను
తగలేసేవారట. ఇప్పుడు తగలేస్తున్నారా? లేదు! యీ
పద్ధతులు ఎందుకు మారాయి? ఆలోచించండి. పోరాటం
మూలంగానే ఇన్ని మార్పులొచ్చాయి.

మనం కూడా పోరాడిననాడు, చిన్న కోడిపిల్లల
గొంతులు కొయ్యరు. వృద్ధ కోళ్ళను సానుభూతితో
చూస్తారు. మనల్నికూడా గౌరవంకోసమే పెంచుతారు.
జాతి పౌరుషాన్ని నిలబెట్టేది మనం. తెల్లారే తూరుపు
ఎరుపును స్వాగతించేది మనం. ఇదంతా యెందుకు చెబు
తున్నానంటే గతంలో రాక్షసులుండేవారట. వాళ్ళు
మనుష్యుల్ని పీక్కుతినేవారట. ఇప్పుడు కల్లుళ్ళు ఆ
విధంగా తయారయ్యారు. మేం తిరుగుబాటును ప్రకటి
స్తున్నాం. విప్లవం వర్ధిల్లాలి. కొక్కొరొకో....కొక్కొ

రోజో" అంటూ నినాదించింది.

కోళ్ళన్నీ ఒక్కసారిగా ప్రతిధ్వనించాయ్.

ఆ క్షణం యువకోడి ఆనందంతో పులకించిపోయింది.

## 5

మంచంమీద తాంబూలం సేవించి దిండు కానుకొని ఆనందిస్తున్న జగన్నాథం ఒక్కసారిగా ఉలిక్కిపడ్డాడు.

"ఏమిటలా ఉలిక్కిపడ్డారు" అంది లక్ష్మి.

"అబ్బే....అది సరే, కోళ్ళన్నీ ఒక్కసారే అరిచాయేమిటి?"

"దాన్లో ఏవుందండి."

"భలేదానివే. ఆ అరుపులో ఏదో పోగొట్టుకున్న ధ్వనిలేదూ...."

"ఏం ధ్వనో నాకు తెలియదు."

"నాకు తెలుసు."

"ఏమిటండి వచ్చిందగ్గర్నుండీ చూస్తున్నాను. మీరు కోళ్ళ గురించి తప్పితే మరే విషయమూ మాట్లాడటం లేదు."

"అది కాదోయ్ మానవ జీవితంలో కోళ్ళు ఓ ప్రముఖ భాగాన్ని ఆక్రమించుకున్నాయి. కోడిని ఆహారంగా కనుక తీసుకోకుంటే ప్రపంచ దేశాలు ఆహారకొరత నెదుర్కొనేవి. తెలుసా."

"సర్లెండి. ఇంకేమైనా మాట్లాడండి."

"ఏం మాట్లాడమంటావు. కోడికూర బాగానే వుంది. నువ్వేనా వండావు?"

"నేను కాదండి."

"నీకు చేతకాదా?"

"ఎందుకు చేతకాదు."

"మరెవరొం౦డారు?"

"మా అమ్మకూడా కాదు."

"అదేమిటి?"

"అవును, మా ఇంట్లో మేం పెంచిన కోళ్ళు మేం తినం. మీ కోసమే కోయాల్సి వచ్చింది."

"అలాగా" అన్నాడు మామూలుగా.

"అయితే మీకో సిద్ధాంతం ఉందన్నమాట. నాకూ ఓ సిద్ధాంతం వుంది. నా బ్బుల్లో నేను కోడిమాంసం కాదుగదా .... కోడిగుడ్డు కూడా తినను. ఇలా తింటం అంటేనే నాకిష్టం!"

"సర్లెండి. నన్నెప్పుడు తీసుకెళ్తారు?"

"తీసుకెళ్తాలేవోయ్. ముందు మంచి గది తీసుకోవాలి. అది సరేగాని కోడికూర మీ జీతగాడుకూడా తినలేదా?"

"జీతగాడా, ఆ, తినలేదు."

"సర్లే మంచిదే. రెండు పూట్లా నాకే పెట్టారన్న మాట. మీ ఇంటి ప్రక్కనా మెకు కోడి పచ్చడిచేయటం వచ్చా?"

"తెలియదండి."

"తెలియదా, భలేవారే. అందులో నాటుకోళ్ళ పచ్చడి అద్భుతంగా వుంటుంది. ఇరవై రోజులుదాకా నిలవుంటుంది. రోజుకో ముక్క తినొచ్చు. నువ్వొచ్చే టప్పుడు రెండు కోళ్ళు తెస్తే అమ్మచేత పెట్టిద్దాం. అన్నట్టు నీకేం ఇష్టం."

"మీరు."

"మీ జీతగాడు ఇష్టంలేదా?"

"ఏమిటా మాటలు."

"జోకోయ్ జోకు, నవ్వవే."

"నాకిలాంటి జ్యోతిష్యం వుండదు."

"అలాగా.... సర్లే.... సర్లే" అంటుండగా మరోసారి కోళ్ళ అరుపు వినపడింది.

"ఇంక పడుకుందాం" అన్నాడు జగన్నాథం ఆలోచిస్తూ.

"ఈయనకు కోడిభాష తెలుసనుకుంటా" అనుకుంటూ లైటు తీసింది.

# 6

జగన్నాథానికి ఇప్పట్లో భార్యను తీసుకెళ్ళే ఆలోచన లేదు. అయితే పట్నంలో హోటలు భోజనం అంతగా రుచించక పోవటం, ధర యెక్కువవటం, తరచుగా ఆరోగ్యంమీద ప్రభావం చూపించటంవల్ల, వెంటనే తీసుకురావాల్సిన అవసరం ఏర్పడింది.

అందుకే తను వుంటున్న గదిలోనే సంసారం పెట్టాలని నిర్ణయించుకున్నాడు. ఆ గదిలో మంచం వేసుకుంటే పెద్ద ఖాళీ వుండదు. ఆ గదంతా చీకటిగా వుంటుంది. యెటువైపునుండి వెలుతురు రేఖలు జొరపడటానికి అందులో అవకాశాలు లేవు.

అయినా అందులో సంసారం పెట్టటానికి కారణాలు లేకపోలేదు. ఆ ఇరుకు గదిలో వుండటానికి యెవరికీ మనసొప్పదు. ఓ వేళ ఏ చుట్టం వచ్చినా వెంటనే ఖాళీచేసి పోవాల్సిందే. మామూలుగానే జగన్నాథం ఇంట్లో వుందామని ఏ చుట్టమూ రాడు. అయినా భవిష్యత్తును దృష్టిలో వుంచుకొని ఆ గదిలోనే వుండిపోవటానికి నిర్ణయించుకున్నాడు. ఇంటి అద్దె మొత్తం వంద రూపాయిలో సరిపోతుంది.

ఓ రెండు రోజులు శెలవు తీసుకొని మామగారి

గ్రామం వెళ్ళాలని బయలుదేరాడు.

ఆ క్షణంలోనే ఓ కోడిపిల్ల గిలగిల తన్నుకోవటం ప్రారంభించింది. "ఏమి కేమిటి? ఏమయింది?" అంటూ చుట్టూ చేరాయి కోళ్ళన్నీ.

"ఏమిటో బాధ తెలియటంలేదు" అంటూనే విల విలలాడుతోంది.

తల్లి కోడికి అర్థం అయింది.

"అల్లుడొస్తున్నాడు జాగ్రత్త" అంది.

కోళ్ళన్నీ బిగుసుకుపోయాయ్, భయంతో.

"ఏం చెయ్యాలి? ఏం చెయ్యాలి?"

"పారిపోదాం" అాదో పిల్ల.

"పిచ్చిదానా పారిపోతే ఇంకెవరి చేతిలోనైనా పడితే. వాడూరుకుంటాడా? యే పక్కలో, పిల్లలో వెంటాడవని నమ్మకం యేమిటి?" అంది తల్లి కోడి.

"రోగాలొచ్చినా బాగుండేది" నిరాశగా అందోపిల్ల.

"మంచి ఆలోచన" అభినందించింది తల్లి కోడి.

"మీరంతా రోగం వచ్చినట్లు నటించండి. ఆ దెబ్బకు యెవర్నీ కొయ్యరు. ఈ రోజుకు ప్రమాదంనుండి బయట పడొచ్చు. రేపటి సంగతి ఆలోచిద్దాం" అంది తల్లి కోడి.

"అది కరెక్టు కాదు. రోగాలొచ్చినా వాడొదలడు. ఎటూ రోగం వచ్చిందికదా వెంటనే కొయ్యమంటాడు" అంది యువకోడి.

"అలా అయితే నువ్వు నటించకు" అంది తల్లి కోడి.

అంతలో చేతిలో బాగ్ ఊపుకుంటూ వచ్చాడు జగన్నాథం. లక్ష్మి యెదురొచ్చింది. కనీసం అందులో మల్లెపూలుంటాయని ఆశించింది. బ్యాగ్ అందుకోబో తుంటే యివ్వలేదు జగన్నాథం.

"ఏవో ఆఫీసు కాయితాల్లే. జాగ్రత్తగా వుండాలి" అన్నాడు.

లక్ష్మి ముఖం ముడుచుకుపోయింది. ఆసరికే లక్ష్మి తీసుకెళ్ళాల్సిన సామానంతా రెడీగా ఉంచారు. మరుసటి రోజే ప్రయాణం.

గదిలోకి వెళ్ళి బ్యాగ్ జాగ్రత్తగా ఓ మూల పెట్టి, "వేడినీళ్ళున్నాయా?" అన్నాడు.

"కాయాలి."

"మరాపని చూడు" అని లుంగీ కట్టుకొని దొడ్లోకి వచ్చాడు. రాముడు గేదెల దగ్గర పనిచేసుకుంటున్నాడు. "ఓరేయ్" అని పిలవాలనిపించింది. కాని యెందుకో పిలవలేకపోయాడు.

"ఇదిగో రాముడు" పిలిచాడు.

"ఎప్పుడొచ్చారు" అంటూ వచ్చాడు.

"మంచి కోడిన్ని వెదకవోయ్" అన్నాడు.

రాముడి గుండెలో రాయి పడింది.

"చూడండి" అన్నాడు యేమనాలో తెలీక. జగన్నాథం గూటి దగ్గర కెళ్ళాడు. కోళ్ళన్నీ మునగదీసు కున్నాయి. ఒక్క కోడి మాత్రం తలెత్తుకొని వుంది.

"శభాష్" అన్నాడు. "ఇదిగో దాన్నిలాగు. మసాలా వేయిద్దాం" అన్నాడు.

రాముడు దగ్గరకొచ్చి "అయ్యగారికి చెప్పి" అని సగంలో ఆగాడు.

"అయ్యగారేమిటోయ్. నేను చెబితే చెయ్యవా" అన్నాడు కోపంగా, ఈ ఇంటికి అధికారిని తానే అనే ధ్వని స్ఫురింపచేస్తూ.

"అబ్బే... అది కాదండి."

"మరేం చెప్పకు. వెంటనే దాన్ని కోసి ఇంట్లో ఇవ్వు" అన్నాడు.

"అలాగే, కత్తి తెస్తా"నంటూ ఇంట్లోకి వెళ్ళాడు. కళ్ళవెంట నీళ్ళు కారుతున్నాయి. లోపలకు ఏడుస్తూనే వెళ్ళాడు.

"ఏమయింది రాముడూ" అంది రత్తమ్మగారు.

"బాబుగారు వెంటనే ఆ నల్ల కోడిని కొయ్యమన్నారు" గాద్గదికంగా అన్నాడు.

రత్తమ్మకు నోటమాట రాలేదు. ఆ దౌర్జన్యానికి కొంచెంసేపు బాధపడింది. లక్ష్మి సంసారం యెలా వుంటుందో అనే అనుమానం వెంటనే ప్రవేశించింది.

"కానీయ్" అంది.

రాముడు యూవకోడి దగ్గరికెళ్ళి పట్టుకున్నాడు. రోజూ పట్టుకునే రాముడికి, ఈ రోజు రాముడికి తేడా గ్రహించేలోపు బయటకు లాగేశాడు. మునగదీసుకున్న కోళ్ళన్ని భయంగా లేచాయ్. బలవంతంగా యూవకోడి నోరు తెరిచాడు. రెండు నీటిచుక్కలు గొంతులో పడ్డాయ్. మరుక్షణం మెడ పొడవుగా సాగింది. కసుక్కున కత్తి తెగింది. దూరంగా విసిరివేయబడుతున్నప్పుడు చివరిసారిగా అరిచింది.

"అల్లుళ్ళూ, నశించాలి."

"కోళ్ళ విధ్వంసం ఆగిపోవాలి."

పీక తెగి ఎగిరెగిరి పడుతున్న తమ ఆప్తుణ్ణి చూస్తున్నాయ్. ఆ దృశ్యం మహా భయంకరంగా వుంది. అలా యెగిరెగిరి రెండు గజాల దూరంలో నిశ్చలంగా వుండిపోయింది. రాముడు దాన్నందుకొని బొచ్చుపీకటం ప్రారంభించేడు. ఆ తర్వాత ఎఱ్ఱటి మంటలో దాని

శరీరం కాల్చబడింది. కాల్చాక ఓసారి నీళ్ళలో శుభ్రంగా కడిగి ఇంటిలో అందించాడు.

ఆ ఇంటి సిద్ధాంతాన్ని ఈ రోజు పూర్తిగా భ్రష్టు పట్టించాననే విషయం తలుచుకున్నకొలదీ జగన్నాథంలో సంతోషం పెరిగిపోసాగింది. రమణయ్య వచ్చాక ఈ సంగతి తెలిసి బాధపడ్డాడు. ఉదయం బయలుదేరారు. లక్ష్మిని పంపుతుంటే వారికి దుఃఖం పొంగింది.

"మాకున్న సర్వస్వం లక్ష్మి. దీన్ని మీ చేతుల్లో పెడుతున్నా" అంతకంటే యెక్కువ మాట్లాడలేక పోయాడు రమణయ్య.

వాళ్ళెందుకేడుస్తున్నారో అర్థంకాలేదు జగన్నాధానికి. అర్థంకాదు కూడా.

# 7

ఆ గది చూసేసరికి లక్ష్మికి నీరసం వచ్చేసింది. సామానంతా సర్దితే బాగా ఇరుకుగా వుంది. ఆ గదికి ఇరవై నాలుగు గంటలూ లైటు వుండాల్సిందే.

"మరీ ఇరుకుగా వుంది."

"మరి పట్నంలో ఇళ్ళంటే మాటలా. దీనికే వంద రూపాయలు" అన్నాడు జగన్నాథం.

రాత్రి పడుకోబోయేటప్పుడు అడిగాడు.

"అవునూ పెళ్ళిచూపులప్పుడు చాలా నగలు పెట్టుకున్నావు. ఇక్కడ ఇంటిలో వుంచుకోవటం మంచిది కాదు. రేపు బ్యాంకులో వేద్దాం సరేనా?"

"అవా? అవి నావి కాదండి."

"నీవి కావా, మరా పట్టుచీర."

"అదికూడా."

"అంటే నన్ను మోసం చేసేరన్నమాట."

"మోసమా?"

"కాకపోతే నీవి కానప్పుడు ఎందుకు పెట్టుకోవాలి-మోసం చెయ్యటానికి కాకుంటే."

"అది కాదండి మా ప్రక్కింటి వాళ్ళు సరదాగా మెడలో వేసేనూ" అంది.

"ఇంతకూ నీకెంత బంగారం వుంది."

"ఈ గొలుసుంది, జతగాజులున్నాయి."

"మీ అమ్మకి."

"అమ్మకూ అంతే."

"అంతేనా?"

"ఏమిటలా మాట్లాడుతున్నారు."

"మీకెంత పొలం వుంది?"

"నాలుగెకరాలు."

"నీకు తెలియకుండా ఏమన్నా వుందా?"

"నాకెలా తెలుస్తుంది."

"ఊఁ" అని గంభీరంగా నిట్టూర్చాడు.

"బ్యాంక్‌లో క్యాష్ ఎంతుంది?"

"నాకు తెలియదు."

"మరేం తెలుసు నీకు?"

లక్ష్మి కళ్ళవెంట నీళ్ళు తిరిగాయి. బుగ్గలమీద కారుతున్నాయి.

"ఏడవకు. నా కసహ్యం. అన్నట్టు మీ అయ్యకు చిన్నిల్లు వుందా?"

"చిన్నిల్లా" అయోమయంగా అడిగింది.

"అదే ఇంకెవరితోనైనా సంబంధం వుందా?"

"ఛీ" అంది కోపంగా లక్ష్మి.

"మీకెంత ఆస్థి వుందో తెలుసుకోకుంటే ఎలా?

యెందుకయినా మంచిది. ఆ పొలాలూ, ఇల్లు మన పేర రాయించుకోవాలి, ఏమంటావ్?"

లక్ష్మి మాట్లాడలేదు.

"లేకపోతే రేపు ఎవడన్నాయినా దత్తుతీసుకుంటే మన మేమైపోతామో ఆలోచించావా? ఆ శీతగాడికి రాసిస్తే" అన్నాడు.

"ఎప్పుడూ శీతగాడు, శీతగాడు అంటారెందుకు?"

"అమ్మమ్మా, ఏవిట్ట నీకింత ప్రేమ. అసలేవిటని."

లక్ష్మి కోపంగా చూసింది.

"ఇదేదో గూడుపురాణీలా వుందే. వాడ్ని శీతగాడంటేనే సహించకలేక పోతున్నావ్. అంత దగ్గర సంబంధమా అది?"

"మీరు ఏమిటేమిటో మాట్లాడుతున్నారు?"

"నిజమే మాట్లాడుతున్నా. పన్నెండేళ్లు కలిసుండి నన్నేం చెయ్యకుండా వుంటాడా?"

జగన్నాథంలోని అసలు మనిషిని చూస్తుంటే లక్ష్మికి భయంవేసింది.

"ఏమిటి మీ ఉద్దేశ్యం?"

"నా ఉద్దేశ్యాలు క్లియర్‌గా వున్నాయి. మీదే అంతా మాయగా వుంది. నా సంగతి తెలియదను కుంటాను. తేల్చేస్తాను."

లక్ష్మికింక ఏడుపాగలేదు. ఏడుస్తూ దిండులో ముఖం దాచుకుంది. జగన్నాథం సీరియస్‌గా ఆలోచిస్తుండి పోయాడు. లక్ష్మి అలాగే నిద్రపోయింది. తెల్లవారి లేచి వండితే తిని ఆఫీసుకు వెళ్ళాడు. తిరిగి నాలుగురోజు లయ్యాక ఇదే కార్యక్రమం మొదలయింది. తిరిగి లక్ష్మి బాధపడింది. ఆ తర్వాత అలవాటయినట్లనిపించింది.

ఓసారి భయం, భయంగా "సినిమాకెళదాం" అని అడిగింది.

"సినిమాకా నీతోనా" అన్నాడు, అంతటితో ఆగలేదు. "నాకు సినిమాలన్నా, మల్లెపూలన్నా ఇష్టం వుండదు. ఆ రకంగా డబ్బులు ఖర్చుకావటం ఒప్పుకోను. ఇద్దరం సినిమాకెళితే ఎంత ఖర్చవుతుందంటావ్? దాంతో వారం రోజులు కూరలొస్తాయి. మల్లెపూలంటావా ...ఓ పనిచెయ్యి. ఓ డబ్బాలో అరరూపాయికాసు వెయ్యి. మరో అర పూలు కొను. తెల్లారితే పూలు వాడతాయి. కాసు మెరుస్తుంది. డబ్బు ఖర్చుపెట్టడంలో గొప్పలేదు. సంపాదించటంలో వుంది. మీ నాన్నదగ్గరెంతుందో తెలీదు. అదేమైపోతుందో తెలీదు. అంచేత ముందు ఆ డబ్బు మనం రాబట్టుకుంటే తిరిగి సంపాదిస్తాడు" అని వివరించాడు.

లక్ష్మి క్రొత్త సంసారం గురించి చాలా ఊహించుకుంది. విచిత్రం ఏమిటంటే జగన్నాథానికి సెక్స్‌పరమైన కోర్కెలు కూడా వుండేవికావు. యెప్పుడో ఆవేశంవస్తే దగ్గరకు తీసుకున్నప్పుడు యేదో పోగొట్టుకున్న అనుభూతి రాముడి కండలు గుర్తొచ్చి ఓ క్షణం శరీరం పులకరించేది. ఈ నడుమ ఆలోచనలు రాముడిమీదకు మళ్ళుతున్నాయి. బలవంతంగా అయినా ఆ ఆలోచనలకు దూరంకావాలని భావించేది. అయినా సాధ్యంకావటంలేదు.

జగన్నాథం ప్రభుత్వ ఉద్యోగం సంగతేమోకాని ఏ కోణంనుండీ తనని సుఖపెట్టడంలేదు. అతనివెంట సినిమాకు వెళ్ళటం ఓ తీరని కోరిక. ఆఫీస్‌కెళ్ళేటప్పుడు అనుమానంగా నాలుగుసార్లు తలుపు వేసుకొమ్మని చెబుతాడు.

ఒక్కసారి ఆఫీస్‌లో యెవరితోనో వచ్చాడు. వాళ్ళకి ఆ గదిలోనే కాఫీ కాని ఇవ్వాలి. సిగ్గుతో ఛస్తుంటే ఇద్దరివంక అనుమానంగా చూపులు అబ్బ....ఎంత నరకం! ఆ తర్వాత ఆఫీస్‌లో యెవరూ ఇంటికి రాలేదు.

"జగన్నాథం ఇంట్లోనుండి వచ్చేటప్పుడు తాళం వేసుకుని వస్తాట" అని నోళ్ళు నొక్కుకుంటారు ఆఫీస్‌లో కొందరు.

అంతమాత్రాన జగన్నాథం రసికుడేం కాకుండా పోలేదు. మజ్జిగ అమ్మకొనే వారివెంట, కూరగాయల కొట్లదగ్గర చేరి వెకిలిచూపులు చూస్తుంటాడు. ఒకటి రెండుసార్లు చెప్పెట్టి కొట్టబోయారు కూడాను.

కొలీగ్స్ అంతా కూర్చున్నప్పుడు.

"స్త్రీ జాతిని నమ్మకూడదు" అంటుండేవాడు.

"నీకెవరైనా అన్యాయం చేశారా?" అనో కాయన ప్రశ్నించేడు.

"నాకేదో అన్యాయం అని కాదు జనరల్‌గా చెబుతున్నా. ఆడదాన్ని బయట తిరగనీయకూడదు. వెనకటి రోజుల్లో అసలు తల బయటపెట్టటానికి సాహసం చేసేవాళ్ళా?" అన్నాడు.

"మరలాగయితే సాయంకాలంపూట ఆ స్త్రీ జాతి వెంటే పెద్ద పనున్నవాడికి మల్లేపోతుంటా వెందుకోయ్" అన్నాడు కొలీగ్.

"పురుషలక్షణం."

ఆ విధంగా జగన్నాథానికి ప్రతి విషయంపట్ల ఓ అభిప్రాయం వుండేది. మావగారింట్లో కోళ్ళు మేసిన తను ఓసారి మావగారొస్తే మామూలుగానే ఒక్క కూరతోనే పెట్టి పంపాడు. అల్లుడిగారి వైభవం ఏమిటో

అర్థం చేసుకున్నాడు. లక్ష్మి జగన్నాథం కోర్కెల్ని చెప్పేక అతన్ని విశ్వసించలేకపోయాడు. ఉద్యోగం చూసి మోసపోయానే అనుకున్నాడు. ఆస్తంతా ఇచ్చాక రేపు పిల్ల నేమైనా చేస్తే, అనిపించింది.

పేపర్లలో వస్తున్న వార్తలు రమణయ్య ఆలోచనలకు బలమిస్తున్నాయి. జగన్నాథం ఎకరితో కలవక పోవటం, కనీసం వాళ్ళ అమ్మను, అన్నల్ని సైతం గౌరవించకపోవటం ఆశ్చర్యాన్ని కలిగించింది. అయితే ఇప్పుడు చేయగలిగిందేమీ లేదు. పండక్కి రమ్మని కబురు చేశాడు రమణయ్య. అప్పుడే మాట్లాడొచ్చు అని భావించాడు.

# 8

జగన్నాథం పండక్కి మామగారింటికి వచ్చాడు. జగన్నాథం సంగతి ముందే తెలిసి ముందుగానే బయట నుండి కోడిని తెప్పించి వుంచారు. ఓ జత బట్టలు కొన్నారు. ఎట్లయినా రేపు తమల్ని చూడాల్సినవాడు కదా అనుకున్నారు. భోజనాలయినాక కూర్చున్నారు.

"ఏమిటి విశేషాలు?" అని కబుర్లలోకి దిగాడు రమణయ్య.

"ఏవుంది. మామూలే."

"మీ అన్నగారికేం ఇబ్బంది లేకుండా గడుస్తుందా?"

"వాళ్ళకేం బాగానే ఉన్నారు. ఈ సంవత్సరం ఒక ఎకరం కొందామనుకుంటున్నాడు."

"అలాగా?"

"ఉద్యోగం చేస్తున్నాం అనే పేరేగాని, మేం సంపాదించి చచ్చేది కనపడటంలేదు."

"సరే. ఉద్యోగంలో ఉన్న సుఖం వాళ్ళకుంటుందా?

అయినా మీ కేమిటి ఇబ్బంది? వచ్చే జీతం తృప్తిగా వాడుకోండి. కొంచెం మంచి ఇల్లు చూసుకోండి. మిగతా విషయం మర్చిపోండి" అన్నాడు.

జగన్నాథం ఇబ్బందిగా "అదేం అలా అన్నారు?" అన్నాడు.

"అవునయ్యా, ఆ పొలంమీద వచ్చే రాబడి అంతా ఓ ప్రక్కనుంచి ఎప్పటికప్పుడు పొలమో బంగారమో కొనేసుంటాను."

"వాటి కంటే బ్యాంక్ మంచిదేమో."

"బ్యాంకా? అబ్బే! భూమి కంటే మంచిదేముంది? బ్యాంకుల్లో ఉన్న దగ్గర్నుండి ఖర్చవుతుంటాయి. పొలంగా ఉంటేనే నయం. అందులో గవర్నమెంటు ఉద్యోగం. మీ పేరుతో పొలాలూ గట్రా ఉండటం ఎప్పటికయినా దెబ్బే....అందుకని అమ్మాయి పేరుతో నేను కట్నం క్రింద యిచ్చినట్లు కొంటుంటాగా" అన్నాడు.

"అమ్మ కొట్టావురా మామ" అనుకున్నాడు జగన్నాథం.

ఆ తర్వాత మావగారు క్రొత్త బట్టలు తెచ్చి చూపించి "ఎలా ఉన్నాయి?" అన్నాడు.

జగన్నాథం వాటివంక చూడకుండానే "ఏం బట్టలో, వాటి ధరకంటే, కుట్టించటానికి ఎక్కువవుతోంది" అంటూ నవ్వాడు.

రమణయ్య మాట్లాడకుండానే జేబులో నుండి ఓ వంద కాయితం తీసిచ్చి "కుట్టించుకో బాబు" అన్నాడు. జగన్నాథం ఆ కాయితాన్ని తన సహజమయిన షర్ట్లో జేబులోకి పెట్టాడు.

ఆ సమయంలో రత్తమ్మ కూతురికి క్రొత్త చీర చూపిస్తూ, "ఏమమ్మాయ్ విశేష మేమయినా ఉందా?" అంది.

"అదేం లేదు."

"అదేమిటే!" పెదవి విరిచింది నిరాశగా.

"ఇప్పట్లో వద్దనుకొంటున్నారా?...." అనడిగింది తిరిగి.

"అదేం లేదు. ఆయన వెంటనే కావా లంటున్నారు."

"పిల్ల లంటే అంతిష్టవా?"

"అదేం కాదు. పిల్లలు పుట్టకుండా ఆపరేషన్ చేయించుకుంటే ఎక్కువ జీతం వస్తుందట"

"అయితే యెంతమందిని కంటారు?" అనుమానంగా అడిగింది.

"ఒక్కరు చాలంట."

"అదేమిటే చోద్యం. అంతగా అయితే ఆ జీత మేదో మీ నాన్న యిస్తాడులే. నువ్వు మాత్రం ఒప్పుకోకు."

"ఆయనే చేయించుకొంటారు."

"అయింది. ముత్తానికి భలే సంబంధం ఏరి కోరి తెచ్చుకొన్నాడు" అనకుండా ఉండలేకపోయింది.

"సర్లే ముందు నీ కడుపు పండనీ" అంటూ లోని కెళ్ళింది.

సాయంకాలం ఆ ఊర్లోకి షికారు వెళ్ళాడు జగన్నాథం. అందరూ రమణయ్య అల్లుణ్ని వింతగా చూడటం మొదలుపెట్టారు. ఆ ఊర్లో ఓ మర్రిచెట్టుంది. ఆ సమయంలో జనం అక్కడికి చేరుకొంటూరు. జగన్నాథం అక్కడకు వెళ్ళాడు. ఆ సరికే ఓ ముసలాయన అక్కడ

కూర్చుని చుట్ట పీల్చటంలో ఆనందాన్ని అనుభవిస్తు న్నాడు.

"ఎవురూ....ఓ....నువ్వా .... రమణయ్య అల్లుడివి గదూ" అన్నాడాయన.

సంబోధన విని కోపం వచ్చినా "అవునండి"

"కూర్చో."

కూర్చున్నాడు.

"గవర్న మెంటు ఉద్యోగమేనా?"

"అవును."

"పై డబ్బులు బాగా వస్తాయా?"

"ఏదో లెండి."

"మొత్తంమీద రమణయ్య అదృష్టవంతుడు లే" అన్నాడు తుపుక్కున ఊస్తూ.

"మా మావగారు మీకు బాగా తెలుసా?" గర్వ పడుతూ అడిగాడు.

"అది సంగతి తెలియకేంటయ్యా. అడికేటి మారాజు."

"అలా అన్నారేమిటి?"

"అది చేయి పెద్దదయ్యా. దానం చేసినా అంతే. పేకాడినా అంతే."

"పేకాడతారా?" ఆదుర్దాగా అన్నాడు.

"పేకా, సర్లే. కూర్చుంటే వారందాకా లేవడు."

"ఇంకేమైనా అలవాట్లున్నాయా?"

"ఏవుంటే ఏవయ్యా. అడికి చెల్లుద్ది. ఇంకాడికి అడ్డం యేమిటి? కూతురి పెళ్ళి చేశాడు. ఇంకంతా వైభోగమే" అన్నాడాయన.

ఆ ముసలాడికి ఇద్దరు కొడుకులు. అందులో ఒక్కడూ దగ్గరకు రానీడు. అంచేత ఎవడు పచ్చగా వుంటే వాడి మీద దుమ్ము పోయడం అతని అలవాటు.

జగన్నాథంలో అనుమానం పెరిగి పెరిగి పెద్దదయి పోయింది. ఈ సంబంధం విషయంలో తొందరపడ్డాను అనుకున్నాడు. వీళ్ళు ఇప్పట్లో చావరు. వీడి వాలకం చూస్తుంటే యెవడ్నైనా దత్తుకు తీసుకునేటట్లే ఉన్నాడు. పేకాటలో సొమ్మంతా తగలేస్తే తన గతేం కావాలి. అసలు ఎంతుంది? పెళ్ళికి ముందే తనెందుకు డిమాండ్ చెయ్యలేదా అని ఓ క్షణం బాధపడ్డాడు. అంతా తనదే గదా. మరీ పట్టుబడితే అంతవరకే సరి పెట్టొచ్చు. "ముసలితనంలో మనల్ని ముంచేస్తాడు" అనుకుంటారని ఆలోచించాడే కాని, ఇంత మెత్తగా తన గొంతు కోస్తారనుకోలేదు. దారుణం....కుట్ర.

ముసలాడు యేదో అడుగుతున్నాడు. జగన్నాథం సరిగ్గా సమాధానం చెప్పలేకపోతున్నాడు. ముందు ఆ పొలాలు ...డబ్బులు రాబట్టుకోవాలంటే ఏంచెయ్యాలి? అదే ఆలోచన.

ఆ సమయంలో లక్ష్మి దొడ్లో ఆలోచిస్తూ నడుస్తోంది. తన జీవితంపై జగన్నాథం ప్రభావం గురించి ఆమె తీవ్రంగా యోచిస్తోంది. ఎంత ఆనందంగా గడిచి పోయిందిక్కడ. అక్కడ ఇరుకు గదిలో....ఇరుకు మనసుతో ఏ అనుభూతి లేకుండా ఏం బ్రతుకు!

రాయి తగిలింది. తూలిపడబోయింది.

బలంగా రెండు చేతులు పట్టుకొని నిలిపాయి ఓ క్షణం.

ఓహ్! షాక్! పరవశం! కళ్ళు తెరిస్తే.

ఏ భావంలేకుండా నిలబడ్డ రాముడు.

ఈ క్షణం శాశ్వతమైతే....ఆ గుండెల్లో కరిగిపోతే. ఎంత దురాశ ...ఎంత దురదృష్టం....కళ్ళనుండి జారిన కన్నీటి బొట్లు.

గిరుక్కున వెనక్కు తిరిగింది లక్ష్మి.

మోచేత్తో ఒక్కసారి ముఖం తుడుచుకున్నాడు రాముడు. చేతికి తగిలింది.

"అయ్యగారు పెంచిన కోళ్ళు గొంతులు తెగాయి. అమ్మాయిగారి గొంతు కూడా కోశారు" అనుకున్నాడు.

ముసలాడు అరుస్తున్నా వినకుండా బయలుదేరాడు. భవిష్యత్ కార్యక్రమం మనసులో రూపం దిద్దుకుంటుంది. తిరిగి ఇంటి కళ్ళేముందు రెండు కోళ్ళను అడిగి మరీ తీసుకెళ్ళాడు, పచ్చడి చేయించుకోవాలంటూ.

రమణయ్య కడుపు మండిపోయింది.

"ఓరేయ్ రాముడూ, వాటన్నింటిని ఏదో రేటుకు ఈ రోజే అమ్మెయ్యరా" అన్నాడు.

"బాబు" రాముడు.

"అవునురా. నా కళ్ళముందే అవి నాశనం కావటం నేను చూడలేను. వెళ్ళు....వాటిని అమ్మెయ్."

"నా మాట వినండి."

"వినను. వెళ్ళు.... వెళ్ళు."

"ఆ పందెం కోడ్నయినా వుంచుదాం" అన్నాడు రాముడు.

"వద్దు. దాన్ని బ్రతకనివ్వడు. దాన్ని అమ్మేయ్."

"వద్దు బాబు. రేపు సంక్రాంతి వస్తుంది. దాన్ని అమ్మేటం నాకిష్టంలేదు" అని వెళ్ళిపోయాడు. రమణయ్య ఏం మాట్లాడలేకపోయాడు.

9

కోళ్ళన్నీ ఆందోళనగా అరుచుకుంటున్నాయ్.

"ఎక్కడెక్కడికో... యెవరెవరి దగ్గరకో మనల్ని తోలేస్తున్నారు. ప్రశాంతంగా గడిపిన జీవితంలో తుఫాన్ రేగగొట్టారు. భవిష్యత్ కోసం ఆందోళన చెయ్యాలన్న బిడ్డ గొంతు కోశారు. అవి పిల్లలయినా, ముసలివయినా వదలకుండా నాశనం చేశారు. మనుషుల్లో మంచివాళ్ళుండొచ్చు. కానీ అల్లుడనేవాడు ఎంత దారుణంగా ఉంటాడో మనపట్ల బుజువయింది. పుట్టిన ప్రతివారూ చావటం తప్పదు. అయినా ఈ బ్రతుకులు మరీ దుర్భరం. ఏ క్షణాన యేం అవుతుందో తెలియదు. యేం చేస్తాం. మన జీవితాలింతే" అంది తల్లికోడి.

"అది సృష్టి నడకే, బాబు. మనం ఎన్నెన్ని పురుగుల్ని తినడంలేదు. అప్పుడు జాలిపడ్డామా? అవిమట్టుకు యేడ్చి వుండవా? ఈ రోజు నీకు బాధగా వుందని మనుషులందర్నీ తిట్టెయ్యకు. ఆడుకాకుంటే ఇంకోడు, మరొకడు తింటాడు. నువ్వేం చేస్తావ్. నేనేం చేస్తాను. ముదిరితే కసకసలాడతాం" అంది ముసలికోడి.

"మీ ఇద్దరు చెప్పిందాంట్లో తప్పేంలేదు. మీరు కొట్టుకోవాల్సిన అవసరంలేదు. మీరొక్క విషయం గమనించటంలేదు. మానవుల్లో మంచివారున్నారు. చెవార్ను రకం ఉన్నారు. మన యజమాని ఇంతకాలం మంచిగా వున్నాడు. వాళ్ళ అమ్మాయి మనల్ని ఎంతో ప్రేమగా సాకింది. ఆ అమ్మాయి కళ్ళలో నీళ్ళు మీరు చూశారా? అంటే ఆ అమ్మాయి ఎంతగా బాధలు అనుభవిస్తుందో.

ఈ మనుష్యులు తమలో తామే యింత నిర్దయిగా ప్రవర్తిస్తే కోళ్ళమైన మనమీద జాలి ప్రకటిస్తారా. ఈ

జనమే ఇన్ని బాధలు పడుతున్నా నోరు మెదపటంలేదు. వాళ్ళే కదిలి పోరాడలేనిది మనం ఏ ఆధారం చూసుకుని పోరాడతాం? ఏదియేమైనా మనల్ని మనం రక్షించుకోలేం. మనల్ని ఇంతకాలం ప్రేమగా సాకిన ఆ అమ్మాయి జీవితం బాగుపడాలని కోరుకోవాలి. ఈ ఇంటినుండి వెళుతున్న మనకు అదో కనీస బాధ్యత" అందో పిల్లకోడి.

కోళ్ళకు జ్ఞానోదయం కలిగినట్లయింది. ఒక్కసారి అవన్నీ తమకు ప్రేమగా బియ్యపు గింజలు, నీళ్ళు, ఆహారం పెట్టిన లక్ష్మి గుర్తొచ్చి కన్నీరు కార్చాయి. అప్పుడే గూట్లోకి ఓ రాక్షస హస్తం దూసుకొచ్చి వడిసి పట్టుకొని తట్టలో వేయటం ప్రారంభించింది.

ఒక్క పందెంకోడి మినహాయించి మిగతావన్నీ తట్టల్లో చేరిపోయాయ్. పందెంకోడి దుఃఖంతో తలెత్తి చూసింది. తనను కట్టేశారు. ఆందోళనగా చుట్టూ తిరిగింది.

"మిత్రమా వీడ్కోలు" అరిచేయి పిల్లలంతా, కన్నీటితో.

పందెంకోడి కదిలిపోయింది. ఒక్కసారి గొంతువిప్పి పెద్దగా అరిచింది. నెత్తిమీద జుట్టు మరింత యెర్రగా అయింది.

ఖాళీగా వున్న గూడుచూసి రమణయ్య కడుపులో దేవినట్లయింది.

## 10

లక్ష్మి చిక్కి శల్యమైపోయింది. జగన్నాథం పద్ధతులు పూర్తిగా మార్చేశాడు. మానసికంగా హింసించే కార్యక్రమంతోపాటు శారీరకంగా హింసించటం కూడా ఆరంభమయ్యింది. లక్ష్మి శరీరంనిండా మానిన

గాయాల గుర్తులు.

“నువ్వెళ్ళి ఆ పొలాలు నా పేర రాయించు” అంటుందేవాడు. ఆ నడుమ ఒకసారి యెలా అయినా “పది వేలు” కావాలని పట్టుబడితే, రమణయ్య యెలాగో తంటాలుపడి తెచ్చిచ్చాడు. అప్పట్నుండి మరింత విజృంభించిపోయేడు జగన్నాథం. మొత్తం ఆస్తి అంతా రాస్తారా లేదా అంటూ కూర్చున్నాడు. ఈ విషయం పెద్ద గందరగోళం జరిగింది. ఓ పెద్దమనిషి మాధ్యవర్తిత్వం వుంటే రమణయ్య తెగేసి చెప్పాడు.

“పొలాలు అతని పేర పెట్టమనే సమస్యలేదు. అవి మా తర్వాతవాళ్ళకెళ్ళాల్సిందే. మేం చచ్చేదాకా కూడా అగలేకపోతే మేమేం చెయ్యలేం” అంటూ.

ఆ పెద్దమనిషి జగన్నాథాన్ని ప్రక్కకు తీసుకెళ్ళి మెత్తగా మందలించాడు కూడా.

“బంగారం గుడ్లుపెట్టే బాతును చంపుకు తింటారంటయ్యా, నీ పిచ్చిగాకుంటే అయినా ఆ సొమ్మంతావస్తే నువ్వు అనుభవించేదేమిటూ? నాకరం కావటంలేదు. జీతం పైన వచ్చే సొమ్మంతా ఏం చేస్తున్నావ్. అంతగా పట్టుబట్టుకు గోటితో పోయేదాన్ని గొడ్డలిదాకా తేకు.”

జగన్నాథానికి ఆ మాటలు యెంతమాత్రం రుచించలేదు. అప్పుడేం మాట్లాడకపోయినా లక్ష్మిని అన్ని విధాలుగా బాధించటం మొదలుపెట్టాడు.

జగన్నాథంతో లక్ష్మి పూర్తిగా విసిగిపోయింది. భర్తగా ఇంక యెంతమాత్రం గౌరవం ఇవ్వలేకపోతోంది. చాలాసార్లు ఉరిపోసుకు చచ్చిపోవాలనుకుంది. ఎప్పటికప్పుడు అమ్మ నాన్నలు గుర్తుకొచ్చి ఆ కోర్కెను వాయిదా వేసుకుంటూ వస్తుంది. అమ్మవాళ్ళు పెట్టిన

బట్టలు తప్పించి ఒక్క జాకెట్టు కొనుక్కోలేదు. కడుపు నిండా తింటానికిలేదు. ప్రక్క ఎవరితోనైనా మాట్లాడితే అనుమానం. ఒక్క సినిమా లేదు. షికారులేదు. ఎప్పుడన్నా ఆవేశం వస్తే బలవంతంగానే ఆ కార్య క్రమం ముగించుకోవటం... ఆ మురికి....ఆ చూపులు.... ఆ మనిషి రూపం....తలుచుకుంటున్నకొలదీ అసహ్యం... అసహ్యం...అసహ్యం.

అయినా లక్ష్మి కాపురం చేస్తూనే వుంది. రమణయ్య రెండు మూడుసార్లు వచ్చి వెళ్ళినా అమ్మాయి చిక్కి పోవటం గురించి బాధపడ్డాడేగాని, కొడుతున్నాడని మాత్రం లక్ష్మి చెప్పలేదు. బాధలన్నింటిని గుండెల్లోనే దాచుకుంది.

అయితే లక్ష్మి మనసు చెబుతుంది ఇంకా యెక్కువ కాలం అతనితో సంసారం చెయ్యటం కష్టమని. ఆమె ముందు రెండు మార్గాలున్నాయి. ఒకటి చావటం. రెండు విడాకులు. చావటంపట్ల ఇష్టమున్నా తల్లితండ్రుల్ని దృష్టిలో ఉంచుకొని అది అసాధ్యం. విడాకులు ఈ విష యంలో వాళ్ళేమంటారో....?

జగన్నాథం ముందూ రెండూ సమస్యలు.

ఈ అసిని యెలా రాబట్టుకోవాలి? లక్ష్మిని తగ లేసి మరో సంబంధం చేసుకుంటే? రెండింటిలోనూ ఇబ్బంది లున్నాయి. అందుచేత జగన్నాథంకూడా తొందర పడటంలేదు.

ఇదిలావుండగా సంక్రాంతికి రమ్మని రమణయ్య లెటర్ రాశాడు. అంతకుముందే పోట్లాట జరిగింది. ఆ లెటర్ చూసి తెగించి లక్ష్మి బట్టలు సర్దుకొని వెళ్ళిపోయింది. ఇంటి దగ్గర "ఆయన తర్వాత వస్తారు" అని చెప్పింది.

జగన్నాథం సంక్రాంతికి రాకుంటే..అసలింకెప్పుడూ రాకుంటే బాగుండు ననుకోసాగింది.

కాని సంక్రాంతికి రెండు రోజులముందే జగన్నాథం వచ్చేశాడు. కోళ్ళగూడు బోసిపోయి వుంది. అది చూసి జగన్నాథం ఆగ్రహంతో మండిపోయేడు.

రాముడ్ని పిలిచి "కోళ్ళన్నీ యేమైపోయాయ్?" అనడిగాడు.

"రోగాలొచ్చి చచ్చాయ్" అనేసి వెళ్ళిపోయాడు రాముడు.

ఎందుకు రాముడికి జగన్నాథంమీద అంతులేని కోపంగా వుంది. ఆ జవాబులోని ఆవేశానికి జగన్నాథం కొంతసేపు స్తంభించిపోయేడు. అవన్నీ చచ్చాయంటే నమ్మబుద్ధి కాలేదు. 'అమ్మేసి వుంటారు' అదే జరిగుంటుంది. రేపు పాలాలుకూడా ఇలానే అమ్మేసి యేదో కథ చెబుతారు. ఈ రోజుతో తేల్చెయ్యాలి. తేల్చేస్తాను. ఏ రకంగా తగాదా పెట్టుకుంటే బాగుంటుంది" అంటూ ఆలోచించాడు.

అప్పుడు వినపడిందో కేక.

"కొక్కొరుకో.

పందెం కోడి నిటారుగా నిలబడి పెద్దగా కూసింది. రణరంగంలో యుద్ధభేరిలా వుంది. జగన్నాథం పెదవుల మీద చిరునవ్వు వికృతంగా మెరిసింది.

"ఓరేయ్ రాముడూ" అరిచాడు.

లక్ష్మి కంగారుగా కిటికిలోనుండి చూస్తోంది. ఆ పిలుపును ఇంటిల్లిపాది వింది. ప్రళయమేదో రాబోతున్న సూచనలు బలంగా కన్పించాయ్. రమణయ్యగారికి ఆవేశమొచ్చినా ఆడపిల్ల తండ్రిగా అణుచుకుంటున్నాడు.

రాముడొచ్చాడు.

"క త్తిపట్టుకురా."

"ఎందుకు?"

"ఆ కోడ్ని కొయ్యాలి. ముందు పట్టుకురా."

రాముడికామాటలు వింటుంటే కొరడాతో కొట్టినట్లయింది. అయినా లక్ష్మి ముఖం చూసి యేం చెయ్య లేకపోయాడు.

"అది పందెంకోడి."

"అందుకే తింటాను."

"అది కొయ్యటానికి కాదు."

"నువ్వెవ్వడివిరా చెప్పటానికి."

రాముడు గిలగిలలాడేడు.

"పట్టుకుంటావా, లేదా?"

"నేను పట్టుకోను" కోపంగా అన్నాడు.

"ఈ ఇంట్లోంచి పోరా" అరిచాడు.

"ఈ ఇల్లు నీ దయితే పోతాను. అంతేగాని ఆ కోడ్ని కొయ్యటానికి వీల్లేదు" ఖచ్చితంగా చెప్పి నడుచుకుంటూ వెళ్ళాడు.

జగన్నాథం ప్రళయరుద్రుడయ్యాడు.

"చూస్తా. ఈ రోజుతో తేలిపోవాలి. ఆ పుంజును కోసితీరా" అంటూ ముందుకు దూకాడు. దాని వెంట పరిగెత్తాడు. పావుగంట గడచినా ఉపయోగం లేకపో యింది. అయినా పట్టుదల విడవలేదు.

పందెంకోడి అలసిపోయి రొప్పుతోంది.

జగన్నాథం అలసి రొప్పుతున్నాడు.

అడుగులో అడుగు వేసుకుంటూ వస్తున్నాడు.

జగన్నాథాన్ని చూస్తుంటే .... తన మిత్రులు గుర్తొ

చ్చారు. లక్ష్మి గుర్తువచ్చింది.

జగన్నాథం దగ్గరకొచ్చాడు.

ఒక్క సారిమీద పడ్డాడు.

అదే క్షణం గాల్లోకి ఎగిరింది పంచెంకోడి.

మరుక్షణం "కవ్వ్వ"న గుండెలవిసిపోయే కేక.

కాటానూటిగా వెళ్ళి కంటిలో దిగబడింది.

జగన్నాధానికి ప్రపంచమంతా చీకటిగా వుంది కొంత సేపు.

కనుగ్రుడ్డు వ్రేలాడుతోంది భయంకరంగా. రక్తం వరదలుగా పారసాగింది. క్రిందపడి గిలగిల తన్నుకుంటున్నాడు. ఎర్రటి రక్తం.... వ్రేలాడుతున్న కనుగ్రుడ్డు చూసేసరికి ఒక్కసారే భయంతో శరీరమంతా చల్లబడింది. ఆ భయంతోనే గుండె కొట్టుకోవటం చటుక్కున మానేసింది.

భయంతో.... బాధతో బిగుసుకుపోయాడు.

తిరిగి భయంకరంగా "కొక్కొరకో" అంటూ అరిచింది పంచెంకోడి.

జగన్నాథం కన్ను శూన్యంలోకి చూస్తోంది.

—:అయిపోయింది:—

సీరియల్

# శైల గర్భం

పోలిశెట్టి అచ్చారావు

(గత సంచిక తరువాయి)

అక్కడికి పచ్చటి వెల్తురు మరింత సమీపంలో వున్నట్టు కనిపిస్తోంది.

అభిలాష్ వాచీ చూసుకున్నాడు. సాయంత్రం నాలు గంటలు కావస్తోంది. నిన్న రాత్రి పళ్ళు తిని తేనె తాగాక మళ్ళీ ఎవరూ ఎంగిలి పడినదిలేదు. ఆకలిబాధకు శరీరం క్రమేపీ అలవాటు పడిపోతోన్నట్టనిపించింది అభిలాష్కు.

"ఆ కనబడే వెలుగు గురించి యీ రాగిరేకులో యెక్కడైనా ప్రస్తావన వున్నదేమో చెప్పగలవా....?" అన్నాడు వర్మ.

అభిలాష్ ఆయనవేపు చురుగ్గా చూశాడు.

వర్మ నాలిక్కొరుచుకుని, "సారీ...." అన్నాడు.

ఇద్దరు మరికొంత దూరం ముందుకు నడిచారు.

సొరంగ మార్గం రాను రాను ఇరుగ్గా తయారయింది. యిద్దరు నెమ్మదిగా అడుగులు వేస్తున్నారు. గబ్బిలాల

కంపుతో కలిసి ఏదో యింకా దుర్గంధం గాల్లో బాగా వ్యాపించింది వున్నది.

ఇద్దరు ముక్కులు మూసుకున్నారు భరించలేక.

మరో నాలుగడుగులు వేసేసరికి దుర్గంధం మరింత ఎక్కువయ్యింది.

"ఇంక ముందుకు వెళ్ళలేం! నా ఉద్దేశ్యంలో మిస్ దీప్తి యీ దారిన మిస్సయి వుండదనుకుంటున్నాను" అన్నాడు వర్మ.

అభిలాష్ సమాధానం చెప్పకుండా నడుస్తూనే వున్నాడు.

"ఇక్కడ చీకటి బాగా ఆవరించుకున్నది. ముందుకి వెళ్ళటం ప్రమాదకరమనిపిస్తోంది!" అన్నాడు వర్మ.

అభిలాష్, వర్మ వంక చిత్రంగా చూసి, "ఎంతో ధైర్యసాహసాలు ప్రదర్శించి, శత్రువులని తుదముట్టించిన మీరేనా యిలా పేలలా మాట్లాడుతున్నది? వర్మగారూ, ఎందుకో మీలో అనుకోని మార్పు వచ్చిందనిపిస్తోంది నాకు!" అన్నాడు.

వర్మ తొట్రుపాటును కప్పిపుచ్చుకుంటూ "అదేమిటి? అలా అంటున్నారు? ఎదుట యేమున్నదో అంచనా లేకుండా అడుగేస్తే ప్రమాదం కదాని ముందు జాగ్రత్త కోసం అలా అన్నాను!" అన్నాడు.

అభిలాష్ అతని అభిప్రాయాన్ని చూచాయగా గ్రహించాడు. వర్మకు అకస్మాత్తుగా ధనాశ పట్టుకున్నది. ఆశ పుట్టనే కూడదు, పుట్టితే దానికి మనిషి దాసోహం కాక తప్పదు! అందులోను ధనాశ మహా చెడ్డది! వర్మ లాంటి గొప్ప వ్యక్తిని వశపరచుకున్న ప్రలోభం తక్కువ దనటానికి వీల్లేదు.

కాలికి యేదో మెత్తగా తగలగానే చటుక్కున వెనక్కు అడుగేశాడు అభిలాష్.

వర్మ కూడా అదే అనుభవం పొందాడు.

కాని అప్పటికే ఆలస్యమయింది. ఏవో మెత్తటి పాము కుబుసాల్లాంటి బంధనాలు వాళ్ళిద్దరి కాళ్ళకు చుట్టుకుని క్షణాలమీద బంధించేశాయి.

* * *

అశ్వని అస్థిపంజరాలు తమని పట్టుకునేలోపల మరో నాలుగుసార్లు కాల్పులు జరిపాడు. కాని యేం ప్రయోజనం లేకపోయింది. అవి మరింత వేగంగా ముందుకు వచ్చేస్తున్నాయి. హిమవంత్ వెనక్కు జరిగాడు. అవి తమ మీదకు రావటం చూసిన క్షణంలోనే తమ పనయిపోయిందనుకున్నాడు.

కార్తీక్ ధైర్యాన్ని కోల్పోకుండా నిలబడ్డాడు.

"అశ్వనీ, తూటాలు వేస్టు చేయకు. తుపాకీ వెనక్కు తిప్పి మడమలో వాటి సంగతి చూడు!" అంటూ తుపాకీ మడమ తిప్పి అస్థిపంజరాల మీద బలంగా మోదాడు.

ఒకటొకటిగా అస్థిపంజరాలు నేలమీదపడిపోయాయి. అశ్వని రెట్టించిన ఉత్సాహంతో తుపాకీ వెనక్కు తిప్పి వాటిని నుగ్గునూచగా కొట్టేశాడు. అస్థిపంజరాల ఎముకలు ఎక్కడికక్కడ ముక్కలు ముక్కలయిపోయి కాసేపట్లో అక్కడ ఓ ఎముకలగుట్ట పోగుపడింది.

అంతవరకు వినిపించిన భయంకర శబ్దాలు గాని, గాల్లోని వింత ధ్వనులు గాని వినిపించలేదు. ఒక్కసారిగా భయంకరమైన నిశ్శబ్దం అలముకున్నది.

హిమవంత్ కార్తీక్ వంక ఆశ్చర్యంగా చూసి,

"ఇదంతా క్షుద్ర శక్తుల ప్రభావమంటావా?...." అన్నాడు.

తాంత్రిక్ వెంటనే మాట్లాడలేదు.

అశ్విని అస్థిపంజరాల గుట్టదగ్గర గొంతుకూచుని పరీక్షగా చూశాడు.

"క్షుద్రశక్తులు దాడి చేశాయంటావా?" అన్నాడు తాంత్రిక్. అతను అప్పటికే తను గ్రహించిన విషయం కరక్టేనని నిర్ధారణ చేసుకున్నాడు.

అశ్విని అస్థిపంజరాల చేతి ఎముకలకు కట్టబడివున్న తెల్లటి సన్నటి దారాలను పైకి లాగాడు. అవి సన్నటి నరాలు! ఎండిపోయిన నరాలు. గతంలో అంతకన్న లావుపాటి నరాలతో మాంత్రికుడి అనుచరులు తమని బంధించి ఉంచారు. ఆ విషయం వెంటనే అశ్వినికి గుర్తొచ్చింది.

హిమవంత్ వింతగా చూసి, అస్థిపంజరాలు ఎక్కడి నుంచో అకస్మాత్తుగా ప్రత్యక్షమయ్యాయి కదా! మళ్ళీ అదృశ్యమయిపోలేదేం? క్షుద్రశక్తుల ప్రభావం అంతటితో నశించిందా?" అన్నాడు.

తాంత్రిక్, అశ్విని సమాధానం చెప్పలేదు. ముందుకి అడుగులు వేయసాగారు. హిమవంత్ మౌనంగా అనుసరిస్తున్నాడు.

"చీకటి పడిపోతోంది. మనకి ముందున్న వస్తువులు కనిపించకుండా పోతున్నాయి. ఏంచేద్దాం?" అన్నాడు తాంత్రిక్ వంక చూసి.

"అదే ఆలోచిస్తున్నాను. దీప్తి యింతదూరం కొద్ది గంటల సమయంలో ఎలా రాగలుగుతుంది? అసలు ఆమె ఎలా మాయమయ్యింది? మనం వ్యర్థంగా ముందుకు

పోవటం లేదుకదా అనిపిస్తోంది నాకు!"

కార్తీక్ కంఠంలో ధ్వనించిన విచారరేఖకు కదలి పోయాడు అశ్విని.

"నాకూ అదే అనిపిస్తోంది. ఉదయంనించి మనం యిలా నడుస్తూనే వున్నాం. ఎక్కడా దీప్తిని దాచేందుకు అనుమానించదగ్గ రహస్య స్థలం కనిపించ లేదు కదా! ఆమెని ఎవరు ఎత్తుకుపోయారో కనీసం మనకు ఊహాకూడా అందటంలేదు. గాల్లో అనవసరంగా రాళ్ళు విసురుతున్నామనిపిస్తోంది" అన్నాడు అశ్విని.

హిమవంత్ అతని వాదనను బలపరుస్తూ, మనం రాత్రి పడుకుని వుండిన ప్రదేశంలోనే మరికాస్త జాగ్రత్తగా వెతికి వుంటే సరిపోయేదనుకొంటున్నాను. తొందరపడి యింకా యింకా ముందుకు చొచ్చుకుని వచ్చేశాం" అన్నాడు.

"మన వర్మగారికి, అభిలాష్‌కి ఏమైనా ఆచూకీ తెలిసిందో లేదో!...."

"వాళ్ళు కూడా మనలాగే ముందుకు వెళ్ళిపోతుండవచ్చు!"

"ఏమో, యీపాటికి వెనక్కు తిరుగుముఖం పట్టారేమో...."

"కావచ్చు. చీకటిపడితే వాళ్ళు మాత్రం ముందుకు వెళ్ళటం కష్టంకదా!"

"ఒకవేళ యీ రెండు దార్లు యెక్కడో ఒకచోట కలుసుకుంటాయేమో...." అశ్విని వెలిబుచ్చిన అనుమానం అందర్నీ కాసేపు ఆలోచనల్లో పడవేసింది.

"కావచ్చు, కాకపోవచ్చు" అన్నాడు కార్తీక్!

ఇంతలో అతనికేదో స్ఫురించి ముందుకు పరీక్షగా

చూశాడు. ఎటు చూసినా చీకటి! ఎక్కడ వెలుగు కిరణాలు కనిపించటంలేదు! తన అంచనా నిజమయితే యీ పాటికి పచ్చటి వెలుతురు అతి సమీపంలోనికి వచ్చివుండాలి! కాని యెక్కడా వెలుతురు కనిపించటం లేదు!

"ఏమిటి ఆలోచిస్తున్నావు?" అన్నాడు అశ్విని.

"మనం బయల్దేరినపుడు, దార్లు విడిపోవక ముందు పచ్చటి వెలుగు కనిపించింది కదా!...."

"అవును!?"

"అది యిప్పుడు ఎక్కడా కనిపించటంలేదు."

"అంటే...."

"ఆ వెలుగురేఖవైపు వెళ్ళేదే సరైన మార్గం అయి వుండాలి! అంటే మనం యీ సొరంగం దారిగుండా వెళ్ళినా మనకు ఆ వెలుతురు కనిపించివుంటే మనం, వర్మ వాళ్ళు కూడా ఒకేచోట తిరిగి కలుసుకునే అవకాశ ముంటుంది!"

"వర్మవాళ్ళకు ఆ వెలుతురు కనిపిస్తున్నదో లేదో మనం ఇక్కడ్నుంచి ఎలా చెప్పగలం?"

"జస్టు యిమేజినేషన్! వాళ్ళు ఉత్తర దిక్కుగా వెళ్ళారు. సరిగ్గా ఆపోజిట్ డైరెక్షన్లో అంటే దక్షిణ దిశగా యీ సొరంగదారి సాగిపోయింది. మనకు పచ్చటి వెలుతురు వర్మవాళ్ళు వెళ్ళిన దారి, అంటే ఉత్తర దిశ గానే కనిపించింది. అంటే ఆ వెలుతురు వాళ్ళకు అభి ముఖంగానే కనిపిస్తూ వుండి తీరుంది!" అన్నాడు కార్తీక్.

అశ్విని, హిమవంత్ తల లూపారు. "నీ ఊహ కరక్టే ననిపిస్తోంది మాకు. సహేతుకంగా వున్నది" అన్నారు.

"ప్రో, మనం, వర్మవాళ్ళు కల్సుకునే అవకాశం— అదే, యీ సొరంగంలోనే యిలా కొనసాగితే—వుండ దనుకొంటున్నాను" అన్నాడు కార్తీక్.

"అది సరే, మిస్ దీప్తికోసమయినా మనం యీ సొరంగ మార్గాన్ని పూర్తిగా అంతం చూడాలి కదా!...."

మళ్ళీ ముగ్గుర్నీ యీ ఆలోచన కాసేపు మౌనం వహించేటట్టు చేసింది.

"సరే, యింతదాకా వచ్చాక వెనక్కి వెళ్ళటం అనవసరం! అదేదో చూద్దాం. ముందుకే పోవటం మంచి దని నాకూ అనిపిస్తోంది" అన్నాడు కార్తీక్.

"కాని యీ రాత్రి సమయంలో కన్ను పొడుచు కున్నా కనపడని చీకట్లో యెంతసేపని నడుస్తూ వెళ్ళ గలం? పైగా వెళ్ళేకొద్దీ ఏ ప్రమాదాలు మీదకొచ్చి పడతాయో!...." హిమవంత్ అనుమానం వెలి బుచ్చాడు.

అశ్విని తలూపి, "అసలు మిస్ దీప్తిని మనుషులే ఎత్తుకు పోయారో, జంతువులే లాక్కుపోయాయో, లేక మనకు తారసపడినలాంటి మాంత్రికుడిలాంటి ప్రమాదకర మైన వ్యక్తులు దొంగిలించుకుపోయారో అంతా అగమ్య గోచరంగా వున్నది!" అన్నాడు.

"జంతువులయితే ఆ సమీపంలోనే ఆమెను పొట్టన బెట్టుకుంటాయిగాని, అసలు యే విధమయిన రక్తంగాని, మాంసఖండాలు గాని, అస్థిపంజరంగాని కనిపించలేదు. అంటే జంతువుల పనికాదు! పైగా మనకు యింతవరకు యెలాంటి జంతువు కనపడలేదు. ఇకపోతే మామూలు

మనుషులా, మంత్రగాళ్లా అన్నది మనం వూహించుకో వలసిందే! ఆమె మాత్రం యింకా సజీవంగా నే వున్నదని మాత్రం నా మనస్సాక్షి చెపుతోంది!" దృఢంగా అన్నాడు కా రీక్.

"ఆకలిగా వుంది!" అన్నాడు హిమవంత్.

"పొరపాటు చేశాం. మనం విడిపోయేముందు కూడలి వద్ద కొన్ని పళ్ళవృక్షాలు, మరుగుజ్జు చెట్లు కనిపించాయి. మంత్రగాళ్ళు సేకరించిన పళ్ళు బహుశా అలాంటి చెట్ల నుంచే అయివుంటుంది. మనం మన ధ్యాసలో పడి వాటిని పట్టించుకోలేదు!" అశ్వని అన్నాడు.

"కాసేపు ఎక్కడయినా విశ్రమించి. తెల్లవారాక బయల్దేరితే బావుంటుందని నా అభిప్రాయం!" అన్నాడు హిమవంత్.

కా రీక్ మౌనం వహించాడు. తనొక్కడు అయితే ముందుకే సాగిపోయి వుండేవాడు. బహుశా ఆ సొరంగ మార్గం యిక ఎంతో దూరం వుండలేకపోవచ్చుననిపిస్తోం దతనికి!

"క్షుద్రశక్తుల దాడి నెదుర్కొవడానికి మనం బాగా అలవాటు పడిపోయాం. ఏ రాత్రి సమయంలోనో అవి మనల్ని ఓ పట్టుపడతాయేమోనని భయం లేకపోలేదుగాని యిక ముందుకు వెనక్కు కూడా కదల్లేను మిత్రులారా!" చతికిలబడిపోయాడు హిమవంత్.

కా రీక్ అతనివంక జాలిగా చూశాడు.

అశ్వని యేదో చెప్పటానికి నోరు తెరిచాడు. ఇంతలో ఎదురుగా సుదూరంగా యేదో వెలుగు కనిపించింది. మిణుగురు పురుగులు మినుకుమన్నట్టుగా ఆగి ఆగి వెలుగు వస్తూ పోతూ వుంది.

"అవి కొరివిదయ్యాలు. అనుమానం లేదు. ఈ నిర్మానుష్య ప్రదేశంలో యీ రాత్రివేళలో యథేచ్ఛగా విహరిస్తుంటాయని నేను చాలాసార్లు విన్నాను. అందుకని దర్శనాలు కూడా ఉన్నాయి" అన్నాడు హిమవంత్ కూచున్న చోటునుంచి లేచి నిల్చుని.

కార్తీక్, అశ్విని ఆ వెలురు వస్తున్నవైపుకే కళ్ళప్పగించి చూస్తున్నారు. వాళ్ళ మస్తిష్కాలు చురుగ్గా పనిచేస్తున్నాయి. ఆ వెలుగు యేమిటి? పచ్చటి వెలురు కాదు—ఎర్రటి వెలురు.

ఆ వెలురు క్షణ క్షణానికీ దగ్గరపడుతోంది.

కార్తీక్ చేతులు అప్రయత్నంగా తుపాకీని గురిగా పట్టుకున్నాయి—అశ్విని కూడా పొజిషన్‌లోకి వచ్చేశాడు.

హిమవంత్ కళ్ళప్పగించి చూస్తున్నాడు.

* * *

కాసేపటివరకు తమకాళ్ళకు చుట్టుకొంటున్న మెత్తటి వస్తువులేమిటో వర్మకు, అభిలాష్‌కు గ్రహింపుకు రాలేదు. పాములు కావచ్చు ననుకొన్నారు. కాని ఎక్కడ బుస కొడుతున్న శబ్దాలు గాని, పాకుతున్న చప్పుడు గాని వినిపించక పోవటంతో అవి కాదని నిర్ధారించుకొన్నారు.

కాళ్ళు పూర్తిగా బంధింపబడ్డాయి. అభిలాష్ కూడా బంధనాలు వదిలించుకోవాలని ప్రయత్నించాడు గాని, చాలా వేగంగా అతని కాళ్ళు కూడా మెత్తటి వస్తువులతో బంధింపబడ్డాయి. రబ్బరులా మెత్తగా వున్నా, కాళ్ళు సాగదీస్తే సాగలేదు. ఆ పదార్థానికి ఎలాస్టిసిటీ లక్షణం లేదు.

చీకటికి అలవాటుపడ్డ కళ్ళకి కాళ్ళ బంధనాలు యేమిటో కొద్దిగా గ్రహింపుకు వచ్చాయి. కాళ్ళ నుంచి నడుమువరకు చుట్టుకోబోతున్న ఆకారాన్ని చూడగానే వర్మ చిన్నగా కేకపెట్టాడు. అప్పటికి అభిలాష్ నడుము బంధనాలు వచ్చేశాయి!

వర్మ కేకపెట్టగానే అభిలాష్‌కి కూడా ఆ వస్తు వేమిటో గ్రహింపుకొచ్చేసింది.

ఎర్రటి నోరు తెరుచుకుంటూ ముఖందాకా వచ్చేసిన ఆ వస్తువు కొండచిలువని గ్రహించిన వర్మ యే మాత్రం అలస్యం చెయ్యకుండా దాని నోట్లోకి గురి చూసి రివాల్వర్‌తో కాల్చేశాడు.

ఒక్కసారిగా అతని బంధనాలు యెక్కడివక్కడ వదులయిపోయాయి. కొండచిలువ నేలమీదపడిపోయింది. ఆదే సమయంలో అభిలాష్ తనమీదికి దాడిచేసిన కొండ చిలువను రెండు చేతుల్తోను లాగటానికి వ్యర్థప్రయత్నం చేస్తున్నాడు.

ఉత్తర క్షణంలో అతి దగ్గర్నుంచి వర్మ కాల్చిన తూటా అభిలాష్‌ని చుట్టుకున్న కొండచిలువను నేల కూల్చింది.

అభిలాష్ అలుపు తీర్చుకుంటూ "ఇంకొక్క క్షణం ఆలస్యమయితే నా పక్క యెముకలు పళపళమని విరిగి పోయుండేవి! థాంక్స్ లాట్!" అన్నాడు వర్మతో.

"చాలా పెద్ద ప్రమాదంనుంచి బయటపడ్డాం! లెటజ్ గో బ్యాక్! మనకు దారి కనిపించకపోవటమే ఈ ప్రమాదానికి కారణం! గుడ్డిగా ముందుకి అడుగేస్తే చేతులారా ప్రాణాలు పోగొట్టుకోక తప్పదు!" అన్నాడు వర్మ.

"నా భయమే నిజమయితే మిస్ దీప్తిని యీ కొండ

చిలువలు గాని....” ఆగిపోయాడు అఖిలాష్. అతనికి తను పరి వాక్యం పూర్తిచేయటానికే భయంగా వుంది. తమ దగ్గిర ఆయుధ మున్నది కాబట్టి ఆ కొండచిలువల్ని చంపెయ్యగలిగారు. కాని దీప్తి....?

వర్మ చిన్నగా నవ్వి, “మీ అనుమానం నిరాధారం. ఎందుకంటే కొండచిలువలు యింతదూరం ఆమెను తీసుకు రావుకదా! ఆమెని యెవరో యెత్తుకొనిపోవటమే జరిగితే, ఈ కొండచిలవల బారి పడకకుండా తీసుకుపోయి ఉంటారు, ఆ ఎత్తుకుపోయినవాళ్ళ నుంచి ఆమెకు ఏదైనా ప్రమాదం వాటిల్లివుంటే చెప్పలేం!” అన్నాడు.

“అయితే, వెనక్కి పోవటానికే నిర్ణయించారా?”

“తెల్లారేవరకు మనం రెండు దారులు కలిసిన కూడలి దగ్గర యీ రాత్రి గడువుదాం. ఆ సమయానికి మన కార్తిక్ వాళ్ళు అక్కడికి చేరివుంటే అందరం ఒకరి అనుభవాలు మరొకరికి చెప్పుకుందాం. అదృష్టవశాత్తూ వాళ్ళకు మిస్ దీప్తి కనిపించివుంటే, యిక మనం వెతుకులాడుకునే సమస్యే లేదు. ఏమంటారు?”

“కరక్టే! పదండి, పోదాం!”

ఇద్దరు వెనుదిరిగారు.

ఎక్కడినుంచో సన్నటి కేక. స్త్రీ ఆర్తనాదం వినిపించింది.

దిగ్గున వెనక్కి తలలుతిప్పి చూశారు. ఆ గొంతు దుర్పట్టడానికి ఎంతోసేపు పట్టలేదు అఖిలాష్‌కి.

అవును. ఆ గొంతు....దీప్తిదే! ఆపదలోవుండి రక్షించమని ఎలుగెత్తి పిలుస్తున్నది.

దీప్తి బతికేవుంది! భగవాన్, నువ్వు దయామయుడివి! అనుకున్నాడు అఖిలాష్, అయితే దీప్తి ప్రమా

దంలో చిక్కుకున్నది. రక్షించమని అరుస్తున్నది! తమందర్నీ పేరుపేరునా పిలుస్తూ అరుస్తోంది.

కాని.... కాని.... తమకు దారి కనిపించటంలేదు. ఆమె ఎక్కడ్నుంచి ఎలుగెత్తి పిలుస్తున్నదో ఆ దిశలోనే కొండచిలువల్ని చంపారు. ఇంకా ఏమేమి వున్నాయో, విష సర్పాలే ఉన్నాయో.... విషంకక్కే మనుషులే ఉన్నారో....?

ఎలా.... ఎలా....?

అంతకంతకు దీప్తి అరుపులు ఎక్కువవుతున్నాయి. ఎలుగెత్తి పిలుస్తోంది.

• • •

"ఎవరు నువ్వు? నన్నిక్కడికెందుకు తీసుకు వచ్చావు?" దీప్తి కంఠంలో క్రోధం, ఉక్రోషం, అసహాయత ధ్వనించాయి.

అతను వికటంగా నవ్వాడు. అతని గడ్డం చిత్రంగా కదిలింది. విలాసంగా పొడవాటి గడ్డాన్ని దువ్వుకున్నాడు. తల అట్టలుకట్టి తైల సంస్కారం లేకుండా వున్నది. నుదుట విభూతిరేకలు, మధ్యగా ఎర్రటి రక్తాన్ని తలపించే సింధూర బొట్టు. మెడలో రుద్రాక్షమాలలు. నడుంవరకు నగ్నంగా వున్నాడు. నడుం కిందనుంచి పులి చర్మం ధరించాడు. మళ్ళీ మోకాళ్ళనుంచీ అచ్ఛాదన ఏదీ లేదు. చేతిదండకు కూడా విభూతిరేకలు అద్దుకున్నాడు.

అతని కళ్ళు నిప్పులు కక్కుతున్నట్టున్నాయి. రక్త జీరలు కంట్లో భయంకరంగా కనిపిస్తున్నాయి. ఏమాత్రం కనికరం, జాలి అతని ముఖంలో మచ్చుకైనా కనిపించటంలేదు. నిలువునా మనిషిని చీల్చి పచ్చినెత్తురు జుర్రే వాడిలాగా వున్నాడు.

"నన్ను యెవరని అడిగేటంత ధైర్యవంతురాలవటే!? నీ నెవరో నీకు చెప్పాల్సిన అవసరం గాని, అగత్యం గాని నాకు లేవు! నీకివి ఆఖరి క్షణాలని గుర్తుపెట్టుకో!" ఉరుము ఉరిమినట్లే వున్నది కంఠస్వరం.

దీప్తి అతనివైపు నిప్పులు కురిసేలా చూసింది.

అతన్ని చూస్తుంటే ఒళ్ళు కంపరమెత్తిపోతోంది. ఈ మాయదారి బందిఖానా నుంచి బయటపడగలనన్న ధైర్యం పూర్తిగా సన్నగిల్లిపోయింది దీప్తికి.

"నన్నెందుకు బంధించావు? నేను చేసిన నేరమేమిటి?" ఎలాగైనా అతనిచేత విషయం చెప్పించాలని దీప్తి ప్రయత్నం! అసలు యిప్పుడు తనెక్కడున్నది? ఈ మాంత్రికుడు కాని మాంత్రికుడు తననేం చెయ్యబోతున్నాడు? గతంలోలాగా యిక్కడ కాళికాదేవి విగ్రహంగాని, హోమాలు, యజ్ఞాలు, వధ్య శిలలు ఆవేమీ లేవు. కాని, అదే వాతావరణం! అదే పరిస్థితి! కొంపతీసి తనని బలివ్వరుకదా!

దీప్తి సన్నగా వణికింది. ఒకదాని వెంబడి మరొకటి తనని కష్టాలు తరుముకొస్తున్నాయేగాని, వాటికి అంతం లేదా? ఆమె మనసు బాధగా ఆక్రోశించింది. తన ఉనికి కార్తీక్ వాళ్ళకు తెలిసేదెలా? అసలు తనిప్పుడు ఎక్కడున్నది?

దీప్తి పరిసరాల్ని పరిశీలనగా చూసింది. గతంలో చూసిన రాతిగుహలాంటి ఓ గది! తనని కాళ్ళు చేతులు వెనక్కి విరిచి కట్టేశారు. తనకి మెలకువ వచ్చి చూసే సరికి గదిలో ఆ భయంకర వ్యక్తి ఏదో ధ్యానముద్రలో వున్నాడు. తనకు మెలకువ రాగానే దగ్గరగా వచ్చి ముఖంలో ముఖం పెట్టినట్టుగాని నవ్వాడు. తనకి ఒళ్ళు

జలదరించింది.

నిలువెల్లా ఒణికిపోయింది. భయపడవద్దని చేత్తో సంజ్ఞ చేశాడు. ఏమయినా తింటావా అనడిగాడు. తను తల అడ్డంగా తిప్పింది. ఎవరో ఓ ముసలామెను పిలిచాడు. తనకేం కావాలో ఆ మనిషిని కనుక్కొని యిమ్మని చెప్పి గది బయటకు వెళ్ళిపోయాడు!

తనకి ఏడుపొచ్చినంత పనయింది. రాత్రి చాలా పొద్దు పోయేవరకూ కార్తీక్‌తో కబుర్లు చెప్పి అతని పక్కనే నేలమీద నడుం వాల్చింది. చాలా తొందరగా నిద్ర పట్టేసింది. కాని నిద్ర లేచినది యీ కొత్త గదిలో!

ముసలామెను పిలిచి అడిగింది, తనెక్కడున్నానని!

"దేవుడి సన్నిధిలో!" అన్నది ముసలామె.

"యే దేవుడి సన్నిధి?" అడిగింది తను.

ముసలామె మాట్లాడలేదు. తను రెట్టించింది.

ముసలామె నోరు విప్పి, "నిన్ను, నన్ను యే దేవుడు పుట్టించి రక్షిస్తున్నాడో వాడే! ఇంతకుమించి నన్నేమీ అడగకు, నేను చెప్పను. నీకేం కావాలో చెప్పు, నేను తీసుకొస్తాను—అంతే!" అన్నది.

తను ఆశ్చర్యంగా చూసిందామె వంక. ముసలిదైనప్పటికీ ఆమె చలాకీతనం, మాటతీరు తనని బాగా ఆకట్టుకున్నాయి. ఆమెను మంచిచేసుకుని యెలాగైనా బయటపడాలని నిర్ణయించుకున్నది.

సాయంత్రం లోపల ఆ వ్యక్తి కాక మరికొందరు అనుచరుల్లాంటి వాళ్ళు కూడా ఆ ప్రాంతాల వున్నట్టు తను గ్రహించింది. ముసలామె చెప్పకుండానే వాళ్ళమాటల ద్వారా తను గ్రహించింది—తనని వాళ్ళు బలికనివ్వరు! యేదో నిధికోసం కన్నెపిల్ల రక్తం తర్పణ చెయ్యాలట!

అది చేజిక్కించుకోవటం కోసం తన రక్తాన్ని తర్పణ చెయ్యటంకోసం తనని తీసుకొచ్చారట!

సాయంత్రం అతనొచ్చాడు.

"యేం తినని మొండికేస్తున్నావట! తినితీరాలి! నా దగ్గరున్న వాళ్ళు పస్తులు పడుకుంటానికి నే నొప్పకోను! యేదోకటి తినాల్సిందే!" అన్నాడు.

"నేను తినను. నన్నొదిలెయ్యి. నేను నీకేవిధంగానూ సాయపడతాను. అదీగాకుండా నిధి నిక్షేపాలు చేజిక్కించుకోవటానికి కన్నెపిల్ల రక్తం కావాలని అంటారు. నేను పనికిరాను!"

అతని కనుగుడ్లు పెద్దవయ్యాయి. "నిధినిక్షేపాలేమిటి, కన్నెపిల్ల రక్తమేమిటి? యెవరు చెప్పారు నీకు?" అన్నాడు.

"మేం బయల్దేరిందీ అందుకేగా! నువ్వు చూసేవుంటావు మా వాళ్ళని! కళ్యాణవర్మ అనే మహారాజు కొన్ని వేల కోట్లరూపాయిల నిధిని యిక్కడెక్కడో దాచిపెట్టాడటగా!"

అతను అదిరిపడి చూశాడు.

"ఓహో, నీకు చాలా విషయాలు తెలుసన్నమాట! ఊఁ, ఆ నిధి పాతిపెట్టబడ్డ ప్రదేశం కూడా తెలుసా?" అడిగాడు.

"నాకు తెలియదు, మా వాళ్ళకి తెలుసు!"

అతను సాలోచనగా తలూపాడు.

"నేను కన్నెపిల్లనని యెవరు చెప్పారు? నాకిదివరకే పెళ్ళయింది!"

అతను నిరగబడి నవ్వాడు. "మరొకప్పుడయితే నీ మాటలు నిజమని నమ్మివుండేవాణ్ణి. కాని స్వయంగా

విన్నాను — నువ్వు, నీ ప్రియుడు కులాసాగా కబుర్లు చెప్పుకోవటం — ఒకరి నొకరు ప్రేమించుకోవటం, పెళ్ళయ్యేవరకు పవిత్రంగా వుండాలని మీ రిద్దరు అనుకోవటం—అన్నీ విన్నాను. అందుకే నువ్వు నిద్రకి పడగానే అలా యెత్తుకొచ్చాను. నీకన్న పవిత్రురాలయిన కన్నెపిల్ల నాకిక యెవరూ దొరకరని కూడా నాకు తెలుసు!" అన్నాడు.

"ఇప్పుడైతే నేనొచ్చానని నన్ను పట్టి బంధించి తెచ్చావు. ఎవరూ రాకపోయివుంటే యేం చేసేవాడివి? యిప్పుడు కూడా యెవరూ రాలేదనుకో నన్ను ప్రాణాలతో విడిచిపెట్టు. మా వాళ్ళ దగ్గరకు పోతాను. మా వాళ్ళను కూడా నిధికోసం రాకుండా తిరిగి వెళ్ళిపోతాను. నువ్వొక్కడివే యథేచ్ఛగా యీ సంపదనంతా అనుభవించవచ్చు. యెవరూ అడ్డురారు!"

అతను మళ్ళీ పడిపడి నవ్వాడు. "నీ వంటి ప్రశస్తమైన కన్య నాకు మళ్ళీ దొరకద్దూ? చేజేతులా వచ్చిన అవకాశాన్ని వదులుకునేటంత మూర్ఖుణ్ణి కాను! నీ వాళ్ళు బహుశా నీ కోసం వెతుక్కుంటూ ఇంకాసేపట్లో ఇక్కడికి రావచ్చును. నీతోపాటు వాళ్ళని కూడా ధన దేవతకు బలిస్తే, దేవత తృప్తిపడుతుంది. నిధి నా వశమవుతుంది. పిలు, గట్టిగా గొంతెత్తి పేరు పేరునా వాళ్ళను పిలు!" అన్నాడు.

"నేను పిలవను. చస్తే నేనొక్కత్తినే చస్తాను. వాళ్ళను కూడా బలి కానివ్వను. నీక్కావలసింది నా నెత్తురు. నన్ను చంపి నా నెత్తురు తర్పణ చేసుకో. నిధి సంపాదించుకో. అంతే కాని అన్నెం పున్నెం ఎరుగని నా వాళ్ళని యెందుకు నిష్కారణంగా పొట్టన పెట్టుకుం

టావు?"

"నేను చెప్పినట్టు విన్నావా సరే, లేదా చిత్రవధ చేసి మరీ చంపుతాను!....ఊం. ఎలుగెత్తి పిలు. పేరు పేరునా పిలు. వాళ్ళెంత దూరంలో వున్నా నీ గొంతు వాళ్ళకు వినిపిస్తే చాలు, పరుగెత్తుకొని వస్తారు....ఊం, పిలు!" కొరడా అందుకున్నాడు ఆ వ్యక్తి. గాల్లో ఝుళి పించాడు.

తను లెక్క చెయ్యలేదు. "నేను పిలవను. నువ్వేం చేసుకున్నా నేను మాత్రం వాళ్ళను పిలవను. అయినా నీకు వాళ్ళనుండి ఏ ప్రమాదమూ ఉండదు. వాళ్ళీ పాటికి నేను కనిపించక తిరిగి వెళ్ళిపోయి వుంటారు" అన్నది.

"లేదు, నీకోసం వెతుకుతూ తిరుగుతున్నారని నా అనుచరులు సమాచారం తెచ్చారు. వాళ్ళు అంత త్వరగా వెనక్కు పోరు. ఏ సంగతి నిర్ధారణ చేసుకోకుండా వెళ్ళరు!" అన్నాడతను.

తను వెంటనే మాట్లాడలేదు. కార్తీక్ తనని వదలి ఎట్టి పరిస్థితుల్లోనూ వెనుతిరిగి వెళ్ళడు. ఆ విషయం తనకి బాగా తెలుసు. అతనితోబాటు తక్కినవాళ్ళు ఎవరూ వెనక్కు వెళ్ళరు!

తను వాళ్ళను ఎలుగెత్తి పిలవకపోయినా యీ వ్యక్తి వాళ్ళు యెక్కడున్నా వెంటాడి చంపేస్తాడు. అది నిశ్చయం. తన దగ్గరికే కార్తీక్ వాళ్ళు రావటం అన్ని విధాలా శ్రేయస్కరం! తన ఉనికి తెలుస్తుంది. అదృష్టం బావుంటే వీళ్ళను సంహరించి తనతోపాటు అందరూ క్షేమంగా తిరిగిపోవచ్చు!

ఆలోచనల్లో వుండగానే ఆ వ్యక్తి కొరడా ఝుళి

పించాడు. "ఏం, యింకా ఏమిటి ఆలోచన?" అన్నాడు పలుంకరిస్తూ.

"నేను అరిచే సమయానికి మా వాళ్ళు యిటు వస్తారని నమ్మక మేమిటి? వాళ్ళు యెక్కడో దూరంగా వుంటే నా అరుపులు వినపించవుగా? అరచి లాభ మేమిటి?"

"వాళ్ళు యిటే వస్తున్నారని మా వాళ్ళు సమాచారం తెచ్చారు. అయితే చీకటి పడిపోయిందని సంకోచిస్తూ వుండొచ్చు. పిలు, అందరం కలిసి కాసేపు హాయిగా కబుర్లు చెప్పుకోవచ్చు. నువ్వు వాళ్ళను యిక్కడకు రప్పించకపోయినా నేను వాళ్ళను ప్రాణాలతో విడిచిపెడితా ననుకోకు! వెంటాడి వేటాడి మరీ చంపుతాను."

"పోనీ అలాగే చెయొచ్చుకదా! నేనిక్కడ పిలవటం దేనికి?"

అతను విరగబడి నవ్వాడు. "నీతో అబద్ధం చెప్పా లనిపించటంలేదు! చెప్పేస్తాను, విను! నేను యెన్నో ఏళ్ళుగా ప్రయత్నిస్తూన్న నిధి నిక్షేపాల గురించిన తామ్రపత్రం__అంటే రాగిఫలకం__మీ వాళ్ళకు దొరికింది. మీ వాళ్ళలో ఒకడి దగ్గర దాన్ని మా వాళ్ళు చూశారు. అది యిన్నాళ్ళుగా ఎక్కడున్నదో వెతుక్కుంటూనే వున్నానుగాని, దొరకలేదు. ఎలాదొరికిందో అది మీ మనుషులకి దొరికింది.

నిధి గురించిన రహస్యమంతా ఆ రాగి రేకులోనే వుంది! సంస్కృతంలో వ్రాయబడి వుంటుంది. మీ వాళ్ళకు సంస్కృతం తెలిసివుండదు. అయినా అదేమిటో నని జాగ్రత్తగా పెట్టుకుని వుంటారు. అర్థమయిందా నేను

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డుపై వ్రాసి, ఈ నెల 7 వ తేదీ లోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు ఏడాదిపాటు పత్రిక లేదా సప్లిమెంట్ బహుమతిగాపంపుతాము.

## "హోమ్ డెలివరీ"

మీరు 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరితే, నెల నెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 10/- లకే మా ఏజెంట్ ద్వారా గాని, వి.పి. ద్వారాగాని మీ యింటి దగ్గర అందజేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 5/-లు పంపి 'హోమ్ డెలివరీ' సభ్యత్వము పొందటమే.

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. మీ ఇంటిదగ్గరనే డబ్బు చెల్లించి కాపీలు పొందవచ్చును. కాపీలకోసం మీరు ఏజెంట్ చుట్టూ తిరగాల్సిన అవసరం వుండదు. కాపీలు దొరకలేదనే నిరాశ, పోస్టులో పోయే సమస్య, ఎంతమాత్రం లేదు.

నెల నెలా వి. పి. తీసుకోవటం కష్టమనుకునేవారు ఏడాది పైకము రు. 120/-లు ముందుగా పంపవచ్చును.

వాళ్ళెందుకు పిలవమన్నానో...."

తనకి పరిస్థితి అర్థమయింది. ఎటి పరిస్థితిల్లోనూ యీ మాయావికి లొంగిపోకూడదు. ఆ రేకు తనవాళ్ళ దగ్గిరున్నంతసేపు వాళ్ళ ప్రాణాలకేం ప్రమాదం లేదు—అది వీడికి చిక్కకూడదు!

"చూడూ, అది నాకు దక్కకుండా మీ వాళ్ళు ప్రాణాలతో ఎక్కడికీ తప్పించుకోలేరు. ఇదంతా నా సామ్రాజ్యం! అదీగాక నా వాళ్ళను చంపి నా కోపాన్ని మరింత రగిల్చారు మీ వాళ్ళు...."

"మీ వాళ్ళనా? ఎవర్ని చంపారు?"

"తెలియనట్టు అడుగుతావేం? మాంత్రికుడు, వాడితోబాటు వున్న అనుచరులు—వాళ్ళంతా నా వాళ్ళే! పరాయివాడిని సారంగంలోకి ప్రవేశించకుండా యెన్నో యేళ్ళుగా వాళ్ళు నిరోధిస్తూ వచ్చారు. కాని యిన్నాళ్ళకు మా వాళ్ళను కూడా చంపేసి, నాకు తీరని కోపం, ఆరని పగ రగిలించారు నీ వాళ్ళు! నిన్ను యెత్తుకొని వస్తే వాళ్ళు కూడా యిక్కడికొస్తారని నాకు తెలుసు .... అందుకే....అందుకే....నిన్ను పిలవమంటున్నాను."

"కాని, వాళ్ళదగ్గర నువ్వు చెప్తున్న రాగిరేకు వంటిదేమీ లేదు, నాకు తెలుసు!"

"నా వాళ్ళు స్వయంగా చూసి చెప్పారు. నీ మాట నేను నమ్మను!....నువ్వు కబుర్లతో కాలక్షేపం చేస్తున్నావు. ఊఁ....పిలు .. అరుస్తావా, లేదా?" కొరడా ఆమె వంటిమీద నిర్దాక్షిణ్యంగా వాలింది.

తను పళ్ళ బిగువున బాధ భరించింది.

అతను ఓ కత్తి తీసుకున్నాడు—ఆమెను సమీపించాడు. కత్తిని ఆమె ముఖంమీద ఆనించాడు.

"ఇప్పుడు నీ అంతట నువ్వే అరుస్తావు ప్రాణ భయంతో! ఇదిగో యీ కత్తి నీ అందమయిన ముఖాన్ని వీలయినంత వికృతంగా చెయ్యటంలో తన శక్తివంచన లేకుండా పాటుపడబోతోంది!" అన్నాడు విషం చిమ్మే నవ్వు నవ్వుతూ.

దీప్తి అప్రయత్నంగా అరిచింది—ప్రాణభయంతో కాదు, తనని వాడు చిత్రవధ చేయబోతున్నందుకు. తనని చంపినా ఫరవాలేదు, వికృతరూపిని చెయ్యాలనే వాడి కోరిక, ప్రయత్నం ఫలించకూడదు! తన కార్తీక్ వస్తాడు, తనని రక్షించుకుంటాడు! వీడికి చావు మూడింది. అందుకనే మృత్యువును పిలవమని తనను ఒత్తిడి చేస్తున్నాడు.

దీప్తి అరవసాగింది.

•   •   •

ఆ ఎర్రటి వెలురు కాగడాల వెలుగని కొంచెంసేపట్లోనే కార్తీక్ వాళ్ళు గ్రహించారు.

"ఎవరో శత్రువులు మన మీదికి దాడి చెయ్యబోతున్నారు! బి ఎలర్టు...." అన్నాడు కార్తీక్ తుపాకీ గురి చూసుకుంటూ. అశ్విని కూడా పొజిషన్‌లోకి వచ్చేడు.

నలుగురు వ్యక్తులు చూడటానికి ఇదివరకటి మాంత్రికుడి అనుచరుల్లాగా వున్నారు. వాళ్ళ నలుగురు చేత కాగడాలు ధరించి వున్నారు!

కార్తీక్ వేలు ట్రిగ్గర్ మీద పడింది.

ఇంతలోనే ఆ నలుగురు వ్యక్తులు గట్టిగా అరిచి చెప్పారు: "తుపాకీలు కాల్చవద్దు, మేం శత్రువులం కాదు—మిత్రులమే!" అంటూ. (సశేషం)

